# స్వాస్

# మింట్స్




## అమృతాంజన్ లిమిటెడ్

వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited**

# భారతి

## మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

*

మే 1988

సంపుటము : 65 సంచిక : 5

విడిపత్రిక వెల ఐదురూపాయలు

---

# విషయానుక్రమణిక

## మే - 1988

# స్వవిషయం

అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు, భాషాశైలి, దాశరథి కవితా విశ్వరూపం - ఈ రచనలు ఆధునిక కవిత్వానికి సంబంధించినవి. డాక్టర్ తంగిరాల వెంకట సుబ్బారావుగారు భారతి పఠితలకి సుపరిచితులే. శ్రీ శైలం కృష్ణారావుగారు కూడా...

శ్రీ కొల్లూరు సూర్యనారాయణగారు సుప్రసిద్ధులయిన చారిత్రికులు. సర్వసిద్ధి యుద్ధాన్ని గురించి రాసి ఆయన భారతి చదివేవారిని కొన్ని శతాబ్దాలు వెనుకకి తీసుకువెళుతున్నారు. చరిత్ర రచన ఎంత అభివృద్ధి చెందినప్పటికీ పాత విషయాలని కొత్త దృష్టితో అనుశీలించటం ఎంతయినా అవసరం. శ్రీ సూర్యనారాయణగారి వ్యాసం ఎందరిలోనో కొత్త ఆలోచనలు కలిగేట్టు చెయ్యగలదని ఆశించాలి!

భారతిలో కథలు పడటం అవసరం అనేవారికి శ్రీ పొలదుగు వెంకటేశ్వరరావుగారి "పరస్పరం" సంతృప్తి కలిగించగలదని అనుకుంటున్నాము. నవలల ప్రచురణ అంత తేలిక కాదు కాని ప్రతి నెలా కనీసం ఒక మంచి కథ వెయ్యగలిగితే బాగా ఉంటుంది. తక్కిన విషయాలలోవలెనే ఈ విషయంలోనూ భారతికి రాసేవారి సహకారం కావాలి !

డా॥ యు. ఎ. నరసింహమూర్తి, ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం, పి. బి. శ్రీనివాస్, కె. కిశోరుబాబు, అశోకుబాబు, కొంపెల్ల రామకృష్ణమూర్తి, బయిరెడ్డి సుబ్రహ్మణ్యం, శివకుమార్, గాలి నాసరరెడ్డి మొదలయినవారి రచనలు భారతిలో వైవిధ్యం కావాలని అనేవారిని సంతృప్తి పరచగలవు.

భారతిలో చాలా దీర్ఘమయిన రచనలకి త్వరగా ప్రచురింపబడే అవకాశాలు అంత ఎక్కువగా ఉండవని వ్యాసాలు, నాటకాలు, కథలు రాసి పంపేవారు గ్రహించగోరుతున్నాము!

సాహిత్య విమర్శ, శాసనములు, ఆర్థిక శాస్త్రం, చరిత్ర, విజ్ఞాన శాస్త్రం - అన్నిటిమీదా రాసి భారతిలో వైవిధ్యాన్ని పెంచవలసిందిగా కవులూ రచయితలనీ, రచయితలనీ కోరుతున్నాము...



# ఇనుప గీతం

డా॥ యు. ఎ. నరసింహమూర్తి

నేను తూరితాపల్లి తారియపల్లి
ఆడుకుంటూన్నప్పుడు
పారిపోతూన్న పడమటక్కల చిక్కలోంచి
రాలిపడ్డ రాలుగాయిగీతం
గుమ్మాలో గిరజా లూపుకుంటూ కూర్చోక
చిన్నిపల్లి వీథి సిగలో కెగబ్రాకి
చిన్నా! చిన్నా! అంటే
ఊరంతా ముక్కుమీద వేలేసుకుని
హన్నా! హన్నా! అంది.
దొర టోపీకింద ఊరిన
వెలుగునీడల వెన్నెల మడుగు
ఒడ్డున కూర్చొని గులకరాళ్లు విసిరే
కొంటె కోణంగుల్ని
దరిజేరని వలయాల్లో దగా చేస్తుంటే
పంచెకట్టు-పైజామా విప్పి పక్కన పెట్టి
దబ్బున దూకి భళ్లున లేచిన
విద్రోహగీతం
వేళ్లులేని చేతుల్తో
వీథి వీథినా
వెన్నెల కత్తుల్ని ఝుళిపించింది
ఎర్రగన్నేరు పూలదండలు దిగేసుకుని
కనపడని గెడ్డానికి
కావిరంగు పులుముకుంటూ
మాటల మూటల్ని చీకట్లోకి విసిరి
మనసుని మాత్రం
మొలకి బిగించి కట్టుకుని
గేదెపెయ్యనెక్కి మా ఊళ్ళోకొచ్చిన గీతాన్ని
కమాను కొసతో పొడిస్తే
ద్వార సముద్రంలో
నాదతల్పం మీద
నిద్దర నవ్వులు నవ్వుతుంది.
పడమటి గాలిపరకలు
రెక్కలేపిన వేళ
పుష్పించని గొర్రెలబండి
కబేళాకు పోతూన్న త్రోవలో
గుండె నిండా
ఫిరంగు గుళ్లు నింపుకుని
ఊరవతల ఊహాగానం చేస్తూ
తాండవ శివుడికి తందాన పలికే
చల్లని గీతం
తన తోక పట్టుకుంటే
నరకాన్ని దాటిస్తానంది.
పట్లుకర్ర పట్టుకుని
కనిపించిన కవినల్లా కంఠం తెరవమని
కస్పాలో వైరిపీరులా ఊరేగిన గీతం
ఎడారిపువ్వు ఎదురైనప్పుడు
నల్లనాలుకతో
శాపాన్ని నాకింది.
శ్రీరంగ కైంకర్యంలో
శివాలెత్తిన శంకరుడు
కొడిగట్టిన ఎఱ్ఱకంటిని
కొనదాకా వెలిగిస్తే
తెలుగురాత్రిలో ఆ గీతం
తాకి విడిచిందొక మౌనశంఖం
తీరా మనం ఊదుకున్నది
వట్టి లబోడా శంఖం.

డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు

# అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు

# భాషా శైలి

ఈ 20వ శతాబ్దిలో, అతిముఖ్యమైన సంఘటన భారతదేశం స్వాతంత్ర్యాన్ని పొందడం. ఏ సాహిత్యోద్యమాన్నైనా ఈ సంఘటన తోనే కొలవాల్సి వుంటుంది.

స్వాతంత్ర్యానికి పూర్వం భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం విజృంభించాయి. స్వాతంత్ర్యానంతరం కూడా అభ్యుదయ కవిత్వం ఏడెనిమిదేళ్ళు కొనసాగి, 1955లో వచనకవిత్వంగానూ, 1965లో దిగంబర కవిత్వంగానూ, 1970లో విప్లవకవిత్వంగానూ పరిణమించింది. భావకవిత్వం అనుభూతి కవిత్వంగా మారింది. తిలక్, శేషేంద్రలు భావ, అభ్యుదయ కవిత్వాల సమన్వయంకోసం కృషి చేశారు. సాంప్రదాయిక కవిత్వం మాత్రం 1947కి ముందూ తరువాతా కూడా వ్యాపించింది.

ఈ శతాబ్ది ప్రారంభంలో సాంప్రదాయిక కవిత్వానికి తిరుపతి వేంకట కవులూ, భావకవిత్వానికి రాయప్రోలు సుబ్బారావుగారూ, అభ్యుదయ కవిత్వానికి గురజాడ అప్పారావుగారూ పునాదులు వేశారు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీలు ఈమూడు పాయలకూ ముగ్గురు భగీరథులై తెలుగునేలను పునీతంచేశారు. భావకవిత్వం 1910నుండి1940 వరకూ, అభ్యుదయ కవిత్వం 1940 నుండి 1955 వరకూ తెలుగు సాహిత్యంపై తమతమ ప్రభావాలను చూపాయి. అందువల్ల 1955 తర్వాత వచ్చిన వచనకవిత్వం, దిగంబరకవిత్వం, చేతనావర్త కవిత్వం, విప్లవ కవిత్వం, అనుభూతి కవిత్వం కవిసేన కవిత్వం (శేషేంద్ర కవిత్వం) మినీకవిత్వం, నిరసన కవిత్వం, అభ్యుదయ కవిత్వానంతర ధోరణులుగా గుర్తించాలి.

తెలుగుకవిత్వం నన్నయతో ప్రారంభమయిందని భావిస్తున్నాం. నన్నయగారు తెలుగు కవిత్వానికి భాషాస్వరూపాన్ని తీర్చిదిద్దిన 'వాగను శాసనుడు'; గురు పద్య విద్యకు ఆద్యుడు. (పద్యానికే కాదు గద్యానికి కూడా ఆయనే ఆద్యుడని విశ్వనాథవారి అభిప్రాయం). 11వ శతాబ్దిలో నన్నయవాడిన కావ్యభాష ఆనాటి శాసనభాషకు దగ్గరగా ఉందని (నందంపూడి శాసనంతో పోల్చి) గిడుగు వారూ, తాతా సుబ్బరాయశాస్త్రి గారూ భావించారు. కాని భద్రిరాజు కృష్ణమూర్తిగారు ప్రాఙ్నన్నయ శాసనభాషనూ, తెలుగు భాషావికాసాన్ని పరిశీలించి, నన్నయ వాడిన కావ్యభాష తెలుగులో క్రీ.శ.6వ శతాబ్దినాటికే రూపు దిద్దుకుందని నిరూపించారు. 6-7శతాబ్దాల్లోని శాసనభాష తెలుగుదేశ్య పదాలతో నిండివుంటే 9-10 శతాబ్దాల నాటికి శాసనభాష సంస్కృత పద భూయిష్ఠంగా కావ్యశైలిని సంతరించుకుంది. ఈ శైలినే 11వ శతాబ్దిలో నన్నయ తన కావ్యశైలిగా స్వీకరించాడు. తన కాలంనాటి శాసనభాషనూ, ప్రజల వ్యావహారిక భాషనూ, రాజభాషయైన సంస్కృతాన్నీ, కన్నడంలోని పంపాదుల కావ్యశైలినీ పరిశీలించి నన్నయ తన కావ్యశైలికి యింకా మెరుగులు దిద్దుకున్నాడు. ప్రసన్నతనూ, అక్షర రమ్యతనూ సాధించాడు. ఈ విధంగా తెలుగు కవిత్వభాషకు శాసకుడయ్యాడు. అప్పటినుండి యిప్పటి వరకూ తెలుగుకవిత్వం పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు, ఖండకావ్యాలు, గేయకావ్యాలు, వచనగీతాలు అనే అనేక రూపాలను ధరించినా భాషమాత్రం 90 నన్నయ తీర్చి దిద్దినభాషే. నన్నయ భాషలో మూడు వంతులు తత్సమ పదాలు ఒక వంతు తెలుగు పదాలువుంటే, ఈనాటి కావ్యభాషలో కూడా అదే పరిస్థితి ఉంది. (నేను వ్రాస్తున్న ఈ వ్యాసభాషను పరిశీలించినా నేటి శిష్ట వ్యావహారిక భాషాస్థితి మీకు అవగతమవుతుంది.)

నన్నయగారి ఇతివృత్తం మీదా, ఛందస్సు మీదా, భాష మీదా మొదటిసారి విప్లవం లేవదీసినవాడు పాల్కురికి సోమనాథుడు. సమకాలీన మహాపురుషుల జీవితాల్ని ఇతివృత్తాలుగా స్వీకరించి, దేశిఛందస్సులో, జాను తెలుగులో బసవ పురాణం, పండితారాధ్య చరిత్రలు రచించాడు. ఇతడు రెండువంతులు దేశిపదాలూ, ఒకవంతు తత్సమ పదాలతో రచనచేశాడు. దేశి శైలికి నాందిపలికాడు. తరువాత వచ్చిన తిక్కన, నన్నయ మార్గశైలికీ, పాల్కురికి సోమనాథుని దేశిశైలికి ఒక సమన్వయం సాధించాడు. దేశిశైలిని ఇంకాముందుకు తీసుకు వెళ్ళాడు. మూడువంతులు దేశిపదజాలం, ఒకవంతు తత్సమ పదజాలంతో కావ్యశైలిని కొనసాగించాడు. తెలుగులో దేశిపదజాలానికి

గొప్పశక్తి ఉందని నిరూపించాడు. కాని తరువాత వచ్చిన కవులెవ్వరూ శివకవుల్ని కాని, తిక్కనను కాని అనుసరించలేదు. నన్నయనే మార్గ దర్శకంగా పెట్టుకున్నారు. ఒక్క వేమన్న మాత్రం శివకవుల దేశిశైలిని ఇంకా ప్రజల దగ్గరకు తీసికొనిపోయి, జానపదశైలిలా భాసింపచేశాడు. జానపద గేయాలకున్న జనరంజకత్వం తన కవిత్వానికి కూడా వచ్చేలా చేశాడు. కాబట్టి మనకు ప్రాచీన కాలం నుంచీ మూడుభాషా శైలులున్నాయి: (1) నన్నయ మొదలుపెట్టిన మార్గశైలి (2) పాల్కురికి సోమనాథుడు, తిక్కన మొదలు పెట్టిన దేశిశైలి (3) ప్రజా కవిత్వంలోవున్న జానపదశైలి. 20వశతాబ్ది కవిత్వంలో కూడా ఈమూడు శైలులే ప్రధానంగా కనబడుతున్నాయి. ఈ మూడింటిలోనూ నన్నయ మార్గశైలిదే ఈనాటికీ పైచేయిగా ఉంది.

ఆధునిక యుగంలో తిరుపతి వేంకట కవులు, విశ్వనాథ, గడియారం, వానమామలై, మధునాపంతుల వంటి సాంప్రదాయిక కవులు, నన్నయ మార్గభాషాశైలిని అనుసరించడంలో ఆశ్చర్యంలేదు. కాని భావ కవులూ, అభ్యుదయ కవులూ కూడా ఎక్కువగా నన్నయ మార్గాన్నే అనుసరించడం వింత! నన్నయ భారత శైలికీ, కృష్ణపక్షం శైలికీ, మహాప్రస్థానం శైలికీ ఏవిధమైన తేడానూ లేదు. భావకవులు భావ ప్రకటనలో మార్పుతీసుకువచ్చారు కాని, భాషాశైలిలోనూ, అభివ్యక్తిలోనూ నన్నయ పంథానే అనుసరించారు. ఒక్క బసవరాజు అప్పారావు గారు మాత్రం తిక్కన దేశిశైలిని ఆశ్రయించారు. ఈ అనుకరణం ఒక్క నండూరివారు మాత్రం జానపద శైలిని అనుకరించారు. ఈ అనుకరణం (సరళత) భాషకు మాత్రం పరిమితం. భావాల్లో శంకరాద్వైతం వరకూ పెరిగిపోయిన క్లిష్టమార్గధోరణే. జానపదాల్లో భాష, భావం రెండూకూడా సారళ్యంతో భాసిస్తాయి.

అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీది అచ్చంగా నన్నయ మార్గమే. శ్రీరంగం నారాయణబాబు, దాశరథి, నారాయణరెడ్డి మొదలైన వారు ఇదే ధోరణిలో వెళ్ళారు. ఒక్క పఠాభి మాత్రం భాషలో అభివ్యక్తిలో నిజమైన నవ్యధోరణిని ప్రదర్శించాడు. అతడొక్కడే అభ్యుదయ కవుల్లో నిజమైన నవ్యుడు. అద్రుద అతన్ని అనుసరించాడు.

వచన కవుల్లో కుందుర్తిది ముమ్మూర్తులా తిక్కనమార్గమే. తిలక్‌ది ఎక్కువగా నన్నయ మార్గం. దిగంబర కవుల్లో కొందరు నన్నయమార్గాన్నీ, మరి కొందరు తిక్కన మార్గాన్నీ, మరి కొందరు మధ్యేమార్గాన్నీ అనుకరించారు. చేతనావర్తం కవుల్లో ఇద్దరు నన్నయ శైలిలోనూ, ఇద్దరు తిక్కన శైలిలోనూ వ్రాశారు.

విప్లవకవుల్లో చెరబండరాజు, కె. జి. సత్యమూర్తి (శివుడు, శివసాగర్, రెంజిమ్) జానపద బాణీలనే అనుకరించ గలిగారు. కాని జానపద భాషా శైలిని అనుకరించలేకపోయారు. ఒక్క గద్దర్ మాత్రం జానపద శైలిని, బాణీనికూడా చక్కగా పట్టుకున్నాడు. కాని ఈ పల్లెపాటలవలె వ్రాయబడ్డ విప్లవ కవిత్వంలో భావాలు మాత్రం మార్క్సిజం తోనూ, గతి తార్కిక భౌతిక వాదంతోనూ బరువెక్కి జానపదుల తలల మీంచి దూసుకు పోయేవే! ఏ ఉద్యమాలకూ చెందని రంధి సోమరాజు, పులికంటి కృష్ణారెడ్డి అనేకవులు కూడా జానపద బాణీల్లో కవితలు వ్రాస్తున్నారు. వీరి జానపదంకూడా బాణికీ, కొంతవరకూ భాషకూ మాత్రమే పరిమితం. భావాలు శిష్టమైనవే! అనుభూతి కవులలో ఆటూ ఇటూ కూడా ఉన్నారు. శేషేంద్రది ముమ్మూర్తులా నన్నయశైలే. కానీ ఇటీవల ఆయన సామాన్య ప్రజలను దృష్టిలో పెట్టుకుని మామూలు మాటలలో (దేశిశైలిలో) కవితల్లు తున్నారు. ఇటీవలన వచ్చిన మినీ కవులు, నిరసన కవులుకూడా నన్నయ మార్గశైలీ ప్రభావంలోంచి తప్పించుకోలేక పోయారంటే, నన్నయ సృజించిన రాష్ట్రశైలి ఎంత బలమైనదో వేరే చెప్పనక్కరలేదు!

## 1. వచన కవుల భాష :

కవిత్వంలో భావాలు భాషాప్రజలకు దగ్గరగా ఉండాలి అనే శివకవుల నినాదాన్ని మళ్ళీ చేపట్టిన అభ్యుదయకవి, వచన కవితా పితామహుడు కుందుర్తి. ఈయన మధ్యతరగతి ప్రజలశిష్టవ్యావహారికాన్ని కవిత్వ భాషాశైలిగా స్వీకరించాడు. సాధ్యమైనంతవరకూ సంస్కృత సమాసాలనూ, తత్సమ పదాలనూ (తిక్కనలాగ) పరిహరించారు.

"రచనల పూల తోటలో
చ్ఛందస్సు మొక్కలు నాటను
భావనలో సామాన్యుని
జీవిత వలయాలు దాటను" అని ప్రతిజ్ఞ చేశారు.

ఇంగ్లీషు పద ప్రయోగాన్ని కూడా కుందుర్తి నిరసించారు. వాడుకలోవున్న చదువరులకు చిరపరిచితమైన మాటలతోనే కవిత్వం అల్లారు కుందుర్తి:

"మూడునాళ్ళ పసిపాపను ముద్దుగా వొడిలో గుండెలకద్దుకుంటూ
వెచ్చగా ఆస్పత్రి నుండి పచ్చగా యింటికి వెళ్ళేవచ్చి బాలెంత
రాలి మీద పూలజల్లులాగా
ఆగస్టు పది హేనున బారుగతిర్చి నించున్న పసిబాలుర మీద
జాలిగా సన్నని తుంపరగా వర్షంపడుతుంది".

వచన కవుల్లో కుందుర్తి తిక్కన అయితే, తిలక్ నన్నయ గారు (కుందుర్తి గుంటూరువాడూ, తిలక్ తణుకువాడూ కావటం కూడా విచిత్రమైన సాదృశ్యం) తిలక్ నన్నయగారి శైలిని ఆశ్రయించడమే కాక, అల్లసాని పెద్దనగారి అలంకృత శైలిని కూడా వచన కవిత్వంలో ప్రవేశపెట్టాడు.

"నీ క్రొత్త సింగారమ్ము వలదు, ఉదాత్త సురభిళాత్త
శయ్యా సజ్జితమ్ము వలదు, రసప్లావితము వలదు,

చిత్రశిల్ప కవితా ప్రసక్తి వాంఛింపను,
తత్వసూత్ర వాదోక్తి చలింపను,
సుందర వధూ కదుష్ణ పరి రంభముల రసింపను,
గత చారిత్రక యశః కలాపమ్ము వివరింపకు,
బహుళ వీరానేక గాథా సహస్రమ్ము వినిపింపకు,
ఇంకనన్ను విసిగింపకు.''

'తపాలా బంట్రోతు' గేయం మామూలు తెలుగు మాటలతో వ్రాస్తూ వ్రాస్తూ మధ్యలో (వేళాకోళానికే అనుకోండి) అచ్చంగా పెద్దనశైలిని చూపిస్తారు.

"మృదు మాధ్వీ పద లహరీ
తరంగ మృదంగ విలసద్భంగి
మనో హరాలౌ కావ్యాల్ గేయాల్
కొల్లలుగా వ్రాస్తాను.''

'అమృతం కురసిన రాత్రి'లో 75 గేయాలు ఇలాగ నన్నయ, పెద్దనల మార్గశైలిలో వ్రాసినవే. శివకవుల దేశిశైలిలో వ్రాసినవి చాలా తక్కువ. 'గొంగళీ పురుగులు' 'తపాలా బంట్రోతు' 'అమ్మా! నాన్న ఎక్కడికి వెళ్ళాడు?' మొదలైన దేశిశైలి గేయాలను వ్రేళ్ళమీద లెక్క పెట్టవచ్చు. ఒక్కొక్కప్పుడు ఇతివృత్తాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి, సంస్కృత శబ్దాలకు బదులు ఆంగ్ల శబ్దాలు విరివిగా వాడటం కనబడుతుంది.

"ట్రెంచెస్‌లో దాగాలి
పైన ఏరో ప్లేను, చేతిలో స్టెన్‌గన్
కీయిస్తే తిరిగే అట్టముక్క సైనికులం
మార్చ్!
వన్ టూ త్రీ షూట్ డెడ్ ఎపడ్
నువ్వా నేనా
కేబుల్ గ్రాం యిప్పించండి కేరాఫ్ సో అండ్ సో
(మీ వాడు డెడ్)
(--సైనికుడి ఉత్తరం)

ఛందోబద్ధమైన కవిత వ్రాయడంలో కూడా చేయి తిరిగినకవి తిలక్. అందువల్లనే కాబోలు, ఒక్కొక్కసారి పద్యాలకు ఉపయోగించే గ్రాంథిక శైలిని వచన గీతాలకు ఉపయోగిస్తారు.

"ఇన్నినే బ్రతికిన దినాల పన్నిన వ్యూహాన
నిన్నెక్కడ కలిసి కొనినానా స్మృతికిరాదుగాని నీవులే
వను నట్టి కాలమే నాకు లేదు, నాదారినుండి నిన్ను
విడదీయు వేరు మార్గము లేదు;''

కొన్ని చోట్ల జటిల సంస్కృత సమాసాలు కూడా వాడారు.

"జ్వలత్కాష్ఠ మిలా తలం శప్తధాత్రి నిర్జనమై పరచుకొనెను
సుప్త దేవహృదయ స్పృ జ్ఞాశము లెగిరిపడెను''

వచన కవులలో కుందుర్తిలాగే మామూలుమాటలతో కవిత్వం చెప్పిన మరోకవి అజంతా. కాని ఈయనకు శిల్పంమీద పట్టింపు ఎక్కువ. అందువల్ల మధ్య మధ్యన తత్సమ పదమిళితమైన మిశ్రమ శైలి కూడా తొంగి చూస్తుంది. కాని కందుర్తిలాగ ఇంగ్లీషు మాటలు వాడ కూడదనే పట్టింపు మాత్రం ఈయనకు లేదు.

"ఎక్కడా ఎవరూ లేరు
అంతా ఇళ్ళకు చేరుకున్నారు
విద్యార్థి పుస్తకాలు మూసేశాడు
విదూషకుడు వేషం మార్చేశాడు
వీథిగాయకుడు పాట ఆపేశాడు
గుడిసెలో వెన్నెట్లో కార్మికులు కన్నీళ్ళు ఆరబెట్టుకున్నారు
కటకటాల మధ్య శూన్యంలో ఖైదీలు ఆకాశయానంచేస్తున్నారు
పేవ్‌మెంటు మీద భిక్షకులు వాల్‌పోస్టర్లు కప్పుకున్నారు''
(--సుషుప్తి)

బైరాగి గారిది ఎక్కువగా మార్గశైలి. మధ్యమధ్య మిశ్రమశైలి. ఈయన వచన కవితల్లోని పాదాలు పద్యపాదాలలాగ గ్రాంథికవాసన కొడుతూ వుంటాయి కాని సహజంగా వుంటవి. సోమసుందర్ గారిది పూర్తిగా మార్గశైలి సమాస భూయిష్ఠ ప్రబంధమార్గం. మామూలు మాటల్లో ఈయన కవిత సాధారణంగా నడవదు. పాల్కురికి సోమనాధుడిలాంటి మరో అచ్చమైన దేశికవి కాళోజీ నారాయణరావుగారు. ఈయన ప్రజల బాధల్ని గురించి ప్రజల భాషలోనే కవితలల్లిన అచ్చమైన ప్రజాకవి. పట్టుపట్టి దేశిశైలిని సాధనచేసిన కవులలో ఆరుద్రను ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

## 2. దిగంబర కవుల భాష :

ఒక చేరబండరాజు పేరు తప్పతక్కిన ఐదుగురు కవుల కలం పేర్లూ సంస్కృత సమాసాలతో ఏర్పడ్డవే. ఇంచు మించు ఈ పేర్ల వంటిదే వీరిశైలికూడా. కొంచెం సూక్ష్మంగా పరిశీలిస్తే నగ్నముని, నిఖిలేశ్వర్ కొంతవరకూ దేశిశైలిని పాటించారని తెలుస్తుంది.

"సూర్యుని కడ్డంగా నుంచున్న
ఆ మబ్బు తునక పేరేమిటి ?
అర్థంకాని అనంత శూన్యం అంచుమీదకి
ఆకారంలేని కుర్చీ నొకటి లాక్కుని
అర్థవంతమైన బ్రతుకు వెన్నెలచుక్కల్ని రిప్పులోవొంపి
ఒక్కొక్క క్షణం పెదవులకానించి
విషాదాన్ని ఆరాధిస్తూ వుంటానా''
(-నగ్నముని-జైల్లోసముద్రం)

"ఇక్కడ
ఎవడూ హీరో కాదు, విలన్ కాదు
మంచాడు కాదు-పిచ్చాడు కాదు
నిస్సారతను పిండేస్తున్న
ఖాళీ టిన్ను మానవులు
మరి
రేపు తాజమహల్ కూలిపోయిందంటే
నీ సోమరి తనం ముక్కలై పోతుందా?
(-నిఖిలేశ్వర్-'నీరవనిఖిలేశ్వర')

ఆంగ్లభాష ఆధునిక సంస్కృతిలో ఒకభాగం కాబట్టి దిగంబర కవులు ఆంగ్ల పదాల్ని అవసరమైనచోట వాడటంలో వెనుకాడలేదు.

"ఆ విగ్రహం బ్రతికున్నప్పుడు చుట్టూ ఎన్నిగ్రహాలు
కోడిపుంజు కొట్లాటలు సిమెంటు కాంట్రాక్టులు
ప్లేట్లలో ఫోర్కుల కింద అలగా జనాలు
జైళ్లలో బందగాళ్లు కప్పుకుని అమాయకులు"
(-నగ్నముని-'దాహం')

"ప్రక్కనే ప్రాణంలేని నేరస్థుడిలా నిలుచుని వుంది లారీ
స్టీరింగ్ ముందు వేగానికి బానిస అయిన
డ్రైవర్ పాపం! పోలీసు స్టేషన్‌లో లాకప్పులో
(-నిఖిలేశ్వర్ - 'నీవు చెప్పింది అబద్ధం కాదు')

కవితను మొదలు పెట్టేటప్పుడున్న దేశిశైలి మధ్యలోనూ చివరలోనూ వుండదు. ఆవేశం హెచ్చినప్పుడు అందరి కవుల్లాగే వీళ్ళుకూడా మార్గ శైలిలోకి దూకివేస్తారు.

మహాస్వప్న, జ్వాలాముఖి ఎక్కువగా తత్సమ పదభూయిష్ఠమైన మార్గశైలినే ఆశ్రయించారు. అయినా సందర్భానుసారంగాకొన్ని దేశ్యాలూ అన్యదేశ్యాలూ దొర్లిస్తూనే వుంటారు.

"కలియుగం రేడియోగ్రాంలో
గిరగిర తిరుగుతున్న క్రీ. శ. ఇరవయ్యో శతాబ్దం రికార్డుమీద
పిన్నునై
మానవత రెండుకళ్లూ మూసుకు పోయినప్పుడు
విప్పుకుంటున్న మూడోకన్నునై
కాలం వాయులీనం మీద కమానునై
చరిత్ర నిద్రాసముద్రం మీద తుఫానునై
నేను వస్తున్నాను దిగంబర కవిని
రాత్రి ఉదయిస్తున్న రవిని"
(-మహాస్వప్న 'గ్లానిర్భవతి భారత')

మరణ జననాలు లేకుండా
వ్యాధీ వార్ధక్యాలు రాకుండా
అశ్వామృత కాసారంలో
మానవులంతా ఒక్కసారిగ
"సూర్య-స్నానం చేశారని
యమలోకంలో దిగంబర దేవుని ఉపాధ
నరకం రద్దుకు ఆర్డినెన్సు జారీ"
(-జ్వాలాముఖి:'సూర్యస్నానం")

భైరవయ్య, చెరబండరాజు తత్సమ పదాలూ దేశ్యపదాలు కలిపిన మిశ్రమశైలిని పాటించారు. ఈ శైలిలో ఆంగ్లపదాలు కూడా కలుస్తూ ఉంటాయి.

(ఆంగ్లపద ప్రయోగం దిగంబర కవులందరికీ వర్తించే సాధారణ సూత్రం):

"నిలుచున్నాను
అబద్ధాల కత్తి అంచుల మీద నిజంలా
మిన్నంటు తున్న జ్వాలల కొనలపై పొగలా
చూస్తున్నాను
రుద్ర ఫాలం మీది నేత్రంలా
చిక్కటి ఇరుల ఉడుపుల వెనుక దాగిన
తొగరు అందాల తేజంలా"
(భైరవయ్య 'అగ్నిప్రవేశం')

"ఏయ్! సుఖీ!
నిన్నే ముసుగులు తన్నేయ్
వెయ్యేండ్ల కలల తత్వంతో
వేసారి పోతున్న నీకు
క్షణం గ్యారంటీ లేని
జీవితం మిగిల్చేదేమిటి?"
( -చెరబండరాజు: 'చితి పేర్చుకుందాం' )

మొత్తానికి దిగంబర కవులందరూ నన్నయ ప్రవేశపెట్టిన మార్గశైలికి అతీతంగా కవితలు వ్రాసినట్టు సాక్ష్యాలు తక్కువ. ఆయన తీసిన గోతిలోనే పడ్డారు!

## 3. 'చేతనా వర్తం' కవుల భాష:

వీరిలో ఇద్దరు కవులు, ఇద్దరు పండితకవులు ఉన్నారు. పండిత కవులు (సుప్రసన్న, సంపత్ కుమార్) తమకు సహజమైన ధోరణిలో మార్గశైలినే ఆశ్రయించారు.

"స్వార్థానికి రంగులు పూసి
భాషలపేర మతంపేర జాతిపేర
దేశంపేర చేసిన మారణ హోమాలకు
చరిత్రకారులు తొడిగారు మారువేషాలు
శవగంధం కొడుతున్న ఈ పట్టుతెరని
శుష్కశ్మశానానికి పంపించండి"

తక్కిన కవుల్లో ముఖ్యంగా పేర్వారం జగన్నాథంగారిలో మామూలు మాటలతో చమత్కార పూరితమైన ధ్వనితో దేశిశైలి కొట్టవచ్చినట్టు కనబడుతుంది:

"స్వామీ! ఈ మగడు నాకొద్దు
వీడసలే తుమ్మ మొద్దు......
వీడా సత్యవంతుడు కాడు
నేను సావిత్రిగా నటించలేను"

## 4. విప్లవ కవుల భాష :

మహాప్రస్థానంలో నన్నయ మార్గశైలిని పాటించిన శ్రీశ్రీ, 'మరోప్రస్థానం'లోనూ, 'ఝంఝ' లోనూ దానినుంచి తప్పించుకోవాలని విఫల ప్రయత్నం చేశాడు. నన్నయ మార్గశైలిలో వ్రాయడమే శ్రీశ్రీకి సహజంగా వంటబట్టిన శైలి. ఆ శైలిలోనే ఆయన తన కవితోద్రేకాలను సమర్థవంతంగా వెల్లడించగలడు. 'ఝంఝ'లో ఈ సహజ శైలిలో వ్రాసిన గేయాలే బాగున్నాయి

"సాయుధ విప్లవ బీభత్సుని సారథినై
భారత కురు క్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝను ప్రసరిస్తాను
మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను"

ఝంఝ'లో 'నిన్నటి జట్కావాలా' అనే గేయంలో శ్రీశ్రీ తన సహజ మార్గశైలినివదిలి జానపదశైలిలో వ్రాయడానికి ప్రయత్నించి ఘోరంగా పరాజయాన్ని పొందాడు. "ఈ శైలి శ్రీశ్రీకి సహజంకాదు. తెచ్చిపెట్టు కున్నట్లే వుంది కాని యీ మార్గంలో తర్వాత గద్దర్, వంగపండు ప్రసాదరావు, చెరబండరాజు మొదలైనవారు రసవంత మైన, ఉత్తేజకరమైన గీతాలురచించి ఉద్యమానికి బలంచేకూర్చారు." (-కడియాల రామమోహనరాయ్, తెలుగు కవితా వికాసం,పుట345 )

'మరోప్రసానం'లో 'తుదిపయనం - తొలివిజయం' అనే గేయంలో తన మార్గధోరణిని బలవంతంగా అణచి పెట్టుకొని మామూలు మాటలలో దేశిశైలిలో కవిత్వం చెప్పడానికి ప్రయత్నించాడు శ్రీశ్రీ. కాని ఉద్రేకపూరితమైన ముగింపులో తిరిగి తన సహజశైలినే ఆశ్రయించక తప్పలేదు:

"తెల్లవాడు నిన్నునాడు భగత్సింగు అన్నాడు
నల్లవాడు నువ్వునేడు నక్సలైటు వన్నాడు
ఎల్లవారు నిన్నురేపు వేగుచుక్క అంటారు.
శివాజీకి వారసుడా! శ్రీశ్రీ కవిత్వ లాలసుడా !
నీ ధాటికి అడ్డులేదు, నీ త్యాగం వృథాకాదు!"

విప్లవకవుల్ని రెండు వర్గాలుగా విడదీయాలి: (1) వచన కవిత్వంలో విప్లవ భావాలు వ్యాపింప జేసిన వాళ్ల (2) పాటల్లో, జానపదగేయ బాణీల్లో విప్లవాన్ని ప్రబోధించిన వాళ్లు, శ్రీశ్రీ, కె. వి. రమణారెడ్డి, వరవరరావు కె. జి. సత్యమూర్తి (శివుడు, శివసాగర్, రెంజిమ్) చెరబండరాజు, అజ్ఞాత సూరీడు వచన కవితలు వ్రాసిన కవులు. సుబ్బారావు పాణిగ్రాహి, కె జి. సత్యమూర్తి, చెరబండరాజు, వంగపండు ప్రసాదరావు, గద్దర్ మొదలైనవారు పాటలు జానపదగేయాలు అల్లినకవులు. మొదటివర్గంలో కుందుర్తి మార్గానుయాయులూ ఉన్నారు. తిలక్ మార్గానుయాయులూ ఉన్నారు.

"అన్నా!
నీ గాయాల మీంచి వీచి
గాలి ఎరుపెక్కింది
నువ్వాసరా చేసుకున్న బొడ్డుమల్లె
ఇపుడెర్రగా పూస్తున్నది.
నువ్వు పడిపోయినచోట
భూమి ఎరుపెక్కింది.
నీ పాదాలను తాకి
చెలమ ఎరుపెక్కింది.
నీ చితి నిప్పులేకనే మండింది!
మరొక్కటి వినన్నా!
నువ్వు కొట్టిన బాణందెబ్బకు గాయపడి
చీకటి ఎరుపెక్కింది!"

ఇది 'ఝంఝ'లో ప్రకటింప బడిన టంకసాల అశోక్ అనే యువకవి రచించిన 'చీకటికూడా ఎరుపెక్కింది' అనేకవిత. ఇది మామూలు మాటలతో దేశిశైలిలో వెలువడిన చక్కని కవిత్వం. హెచ్చార్కె లాంటి కవులు కొందరు తత్సమపద బాహుళ్యంతో మార్గశైలిని ఆశ్రయించారు.

"ఆకలి హింసకాదు
అధిక ధరలు హింసకాదు
దుర్భర దారిద్ర్యం హింసకాదు

జాతు యుగళ గీతాల
సాంస్కృతిక దుర్గంధం హింసకాదు.
(-'మట్టికాళ్ళ రాక్షసి' అరుణతార ఏప్రిల్ 1984)

కె. శివారెడ్డి, చెరబండరాజు, సత్యమూర్తి మొదలైన కవులు మిశ్రమ శైలిని పాటించారు.

జానపద బాణీలలో పాటలు వ్రాసిన విప్లవకవులు కూడా నన్నయమార్గశైలీ ప్రభావంనుంచి తప్పించుకో లేక పోయారు.

"ఓ భారత కార్మికుడా!
భావియుగం నాయకుడా
సాగరా సాగరా వెనుదిరగక సాగరా ॥ఓ॥
మాతృభూమి పెదవులపై
సామ్యవాద దరహాసం
నీ రుధిరం చిందకుండ
నీ త్యాగం లేకుండా
కనిపించదు దీపించదు
నీ స్వప్నం ఫలియించదు"
(-చెరబండరాజు: 'ఓ భారత కార్మికుడా')

ఒకవేళ పట్టుపట్టి భాషలో జానపదశైలిని తీసుకొచ్చినా భావాలుమాత్రం విశిష్టులకూ, బుద్ధిజీవులకూ, మార్క్సిస్టు మేధావులకూ పరిమిత మైనవే కాని, సామాన్యులకు జానపదులకు సంబంధించినవికావు. చెరబండ రాజులాగే, కె. జి. సత్యమూర్తి. వంగపండు ప్రసాదరావుల జానపద బాణీలు కూడా మార్గశైలిలోనే సాగుతాయి. ఒక్క గద్దరుపాటలో మాత్రం అచ్చమైన జానపదశైలి కనబడుతుంది:

"అద్దమోలె మెరిసెటట్టు
నీ బూట్లు తుడిసినోల్లు
గంజిలో బట్టలుత్కి
కడ కిస్త్రి జేసినోల్లు
నీ కాల్ల గోల్లుదీసి
గడ్డాలు జేసినోల్లు
సెయ్యంత నూనెరాసి
మాలీసుజేసినోల్లు
పిడి కిండ్లు ఎత్తినారు
పందేసి తొక్కుతారు!"

## 5. అనుభూతి కవుల భాష :

అనుభూతి కవులలో ప్రధానులు నలుగురు: వేగుంట మోహన ప్రసాద్, ఇస్మాయిల్, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ. వీరిలో మోహనప్రసాద్, శ్రీమన్నారాయణ స్వచ్ఛమైన దేశిశైలిని ఆశ్రయించారు. అంతేపూర్తిగా అచ్చతెనుగు కావ్యాల్లా వ్రాశారని కాదు. సాధ్యమైనంత వరకూ దేశ్యపదాలనే వాడారు. తత్సమ పదాలు తక్కువ వాడారు.

"అట్లా అని
పెద్దబాధా వుండదు
వెల్ల వేసిన గోడలేమో తెల్లబోతూ ఉంటాయి.
విద్యుత్కాంతికి మహా అయితే ఏబల్లో ప్రాకుతూంటుంది
గోడమీద దాని నీడ ఒక్కటే భారంగా
మెదుల్తుంది"

ఇలాగ మోహన్ప్రసాద్‌లో తెలుగు పదాలు ఎక్కువగావున్నా శిష్ట వ్యావహారికం కనబడుతుంది.

"చీకటి కాకి
చుక్కల గుడ్లని
రాత్రల్లా పొదుగుతుంది
ఒకే ఒకటి
సూర్య కోకిలం ఔతుంది
మిగిలిన నన్నీ
కాకి పిల్లలై
చీకటిలో కాకితో
ఎగిరి పోతాయి" (-శ్రీమన్నారాయణ)

ఇందులో 'రాత్రి' 'సూర్యకోకిలం' అనే రెండు తత్సమ శబ్దాలు తప్ప తక్కినవన్నీ తెలుగు పదాలే.

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ మాత్రం బరువుగావుండే భావాలను బరువైన తత్సమ పదశైలిలోనే చెప్పారు. (తిలక్‌గారి మార్గశైలిని ఈయన అనుకరించినట్లు కనబడుతుంది)

"కిరణంలోంచి
వాతావరణంలోంచి
కే లెత్తి అవతరిస్తున్న నవవిరించిని
సమతా విపంచిని
సాహస గురుత్తులు విప్పి
సమయానికి రాగల శూరుణ్ణి, నరుణ్ణి, హరుణ్ణి"

ఇస్మాయిల్ మాత్రం తత్సమ పదాలు తెలుగుశబ్దాలు కలిసిన మిశ్రమ శైలిని పాటించారు.

"అకస్మాత్తుగా
ఒక రోజు
మృత్యువృక్షం

వ్యత్యస్తంగా
తల కిందుగా
మొలిచింది
మూగిన బంధుమిత్రులు
మోసుకు పోయి అతణ్ణి
విత్తనంలా పాతారు
జనాల
మనో గగనంలో
దాపురున్న జ్ఞాపకాల రొమ్మల్ని
గాఢాను రాగాల
ఊడల్ని వెనక్కి పీల్చేసి
ఈ మృత్యు బీజం
ఏ మీ తిరిగి ఇవ్వదు"

ఈయన మిశ్రమ శైలిలోకూడా తత్సమ పదాలదే పైచేయిగా ఉంది.

## 6. శేషేంద్ర శైలి :

శేషేంద్రశర్మగారి కవిత్వంలో ఆధునిక కవిత్వంలోవున్న అన్ని ధోరణులూ అన్నిదశలుగా కనబడతాయి.

1. సాంప్రదాయక పద్య కవిత్వదశ (పక్షులు, ఋతుఘోష),
2. భావ కవిత్వదశ (శేషజ్యోత్స్న, ప్రేమలేఖలు),
3. అభ్యుదయ కవిత్వదశ (మండే సూర్యుడు)
4. అనుభూతి కవిత్వదశ(నీరై పారిపోయింది, సముద్రం నాపేరు)
5. విప్లవ కవిత్వదశ (నాదేశం: నా ప్రజలు, గొరిల్లా,అరుస్తున్న అద్మీ)

వీరి భాషాశైలికూడా ఆయాదశలకు అనుగుణంగా పరిణామం చెందుతూ వచ్చింది. మొదట సాంప్రదాయిక మార్గ కవితాశైలి వుంది. తర్వాత భావ కవిత్వంలోనూ అభ్యుదయ కవిత్వంలోనూ కొంచెం మార్పుతో ఆదేశైలిని కొనసాగించారు.

"తొలిఋషులు అగ్ని కేలల్లో మంత్రగ్రామాలు
దర్శించినట్లు
నీ కౌగిట్లో ప్రేమజ్యోతిని చూశాను
నేను నీ భౌతిక మూర్తికోసం రాలేదు
వచ్చానొక కిరణం కోసం
ఒక కవితా చరణం కోసం
కిరణాల్లో స్నానం చేశాను
మృదు మధుర స్మరణల్లో గానం చేశాను
నన్ను నేను చేరుకున్నాను"

(-శేష జ్యోత్స్న)

మిగిలిన కవులందరూ పతాకస్థాయిలో మార్గశైలిని ఆశ్రయిస్తే, ప్రతిభావంతుడైన శేషేంద్ర "నన్ను నేను చేరుకున్నాను" అనే మామూలు మాటలతో ఎంతో తాత్త్వికమైన లోతుల్ని ప్రదర్శించారు.

అనుభూతి కవిత్వదశలో తత్సమ పదబాహుళ్యాన్ని కొంత తగ్గించి ఒక మిశ్రమశైలిని పాటించినట్టుగా కనబడుతుంది.

"పాలబాట ఉషః ప్రవాహాల్లో మునిగిపోయిందో లేదో గుల్మొహర్ తన ప్రథమ దర్శనం ఇచ్చి నూతన ఋతువును ప్రకటించింది. ఏవేవో స్మృతులన్నీ దూరదూరాలనుంచి నారక్త ప్రవాహాలోపడి కొట్టుకొచ్చాయి." (-నీరైపారి పోయింది)

శేషేంద్ర, రవిసమ్మేళనాల్లో ఎక్కువగా పాల్గొన్నారు. దీనివల్ల ఆయనశైలి మారింది. ఎలాచెపితే ప్రజలగుండెలోకి దూసుకుపోతుందో గ్రహించారు. ప్రజల నాడిని అర్థం చేసుకొని తనమార్గశైలిని చాలా భాగం తగ్గించుకుని దేశిశైలిని పెంచారు. ముఖ్యంగా విప్లవ కవిత్వ దశలో ఈ మార్పు ప్రత్యేకంగా కనబడుతుంది.

"నేనింతా ఒక పిడికెడు మట్టేకావచ్చు. కాని కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది." (-గొరిల్లా)

"మట్టి పిసుకుతాను. మట్టిలోనే చెట్లతో. వైర్లతో పెరుగుతాను. పళ్ళతో ధాన్యంతో బ్రతుకుతాను నాదేశంలో చేతులనిండా పనిముంచి పోస్తాను. తెల్లవారగానే మళ్ళీపనికోసం ఖాళీగా ఉంటాయి నాచేతులు"

(-నాదేశం-నాప్రజలు)

"సూర్యుడ్ని సూర్యుడికి
ఇరవై నాలుగు గంటలదూరం
మనిషి నుంచి మనిషికి
రెండు గుండెలే దూరం" (-అరుస్తున్నఆద్మీ)

ఒక్కొక్క కావ్యాన్ని తీసికొని సంపూర్ణంగా పరిశీలిస్తే, శేషేంద్రలో తత్సమ పదాలు, తెలుగు మాటలు సమపాళ్ళలో కలిసిన మిశ్రమ సైలియే కనబడుతుంది. శ్రీ శ్రీ లాగే శేషేంద్రకు కూడా తత్సమపద బాహుళ్యంతో కూడిన మార్గశైలే స్వతస్సిద్ధమై శైలి! ఆయన ప్రయత్న పూర్వకంగా దానిని ఇటీవల కొంతతగ్గించుకున్నారు.

శేషేంద్రలో ఇంకో విశేషం ఏమిటంటే తత్సమ పదాలువాడుతూనే మధ్యలో సహజంగా ఉంటుందనితోస్తే ఇంగ్లీషు మాటలూ ఉర్దూ హిందుస్తానీ మాటలూ గుప్పించడానికి వెనుకాడరు. ఈ అన్యదేశ్య ప్రయోగం ఆరుద్రలో లాగ కృతకంగా ఉండకుండా చాలసహజంగా, అందంగా, ఆమాట తీసివేసి ఇంకో తెలుగుమాట వెయ్యడానికి వీలు లేదన్నంత పకడ్బందీగా ఉంటుంది: కవిత్వం 'తాపీగా లేని గుండెల్ని కాపీ కొడు' తుందనడం, 'అరుస్తున్న ఆద్మీ' అనడం, ఇంకా-

“ఈ దునియా ఏమనుకుంటే నాకేమి?”
“నీ కిటికీలో బుల్బుళ్లు పూస్తాయి.”
“సంతోష పూరిత బెలూనులా”
“ఈ దేశం శరీరం మీద
లారీలు, లౌడ్ స్పీకర్లు, ప్రెస్సులు, బస్సులు”
“గుండెలతో నాకు దోస్తీ
నేనుండేది బాధల బస్తీ”
“లిల్లీలు పెదవులు విప్పాలి నీ కథలు చెప్పడానికి”
“కవిత్వం [illegible] ప్రవహించలేదు
విస్కీ దేవత భుజం తర్కాన్ని మోయలేదు”
“ఓ జిందగీ! నన్ను సుఖం మీద సిలువ వెయ్యకు”
“దోమల సామ్రాజ్యంలో
ఈగలు డిక్టేటర్లు”
“నీ గుండె ఒక గాయాల లైబ్రరీ శేషేన్”
“బాధితుల క్యూలో నిల్చుని
దర్శించు జీవితాన్ని”
“కలల వర్తకపు క్యాపిటలిస్టువు”
“మనిషి డబ్బుతో మారడమన్నది!
మటుకీ శలాబ్ది జోకు సుమీ!”
“ స్త్రీలో ఉన్న ప్రేమ మీద
పోలీసు ఎంక్వయిరీ జరపకు ”
“ పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు ”
“ నీ ఛాతీ బందూకుల కార్ఖానా
నీ కవిత్వం గాయాలకు దవాఖానా ”
“ నేనే మీ రస్తాపై కలలు కంటున్నాను” మొదలైనవి.

ఈ అన్యదేశ్యాల శైలి ఆయన ఇటీవలి కావ్యాల్లో ఎక్కువయింది. శేషేంద్ర గొప్ప పండితకవి. అయినా దుష్ట సమాసాలు వాడడం లోనూ, స్పెల్లింగులు తప్పుగా వ్రాయడంలోనూ వెనుకాడరు. అది కూడా ఆధునికత్వం అని ఆయన భావన కాబోలు, ఎన్నో అద్భుత మైన రమ్యమైన తెలుగు పదాల సమాసాలూ, తత్సమ పదాల సమాసాలూ వాడిన ఈ ప్రభావంతుడు ఒక్కొక్కప్పుడు దుష్ట సమాసాలు దొర్లిస్తాడు :

ఎ) తత్సమం + దేశ్యం : జీవన కోరలు, శాంతి రేవులు
ఊహాయాన దుకాణం, యావన్మంది,
బాల కైదీసులు, దేశ ద్రిమ్మరి మొ॥

బి) దేశ్యం + తత్సమం : ఒంటరి జావ్యం
ఇనప రంగు పత్యూషాలు
తుపాకి మందు గంధాలు మొ॥

సి) తెలుగు + అన్యదేశ్యం : (ఇంగ్లీషు హిందూస్తానీ) :
పెద్ద బిల్డింగు
కొత్త బిల్డింగు
పూల మేళా
వెన్నెల జెండా

అన్యదేశ్యం + తెలుగు: లక్సు బిళ్ళ

డి) తత్సమం + అన్యదేశ్యం: సంతోష పూరిత బెలూను
విప్లవ జెండా

ఇ) అన్యదేశ్యం + అన్యదేశ్యం: సూర్కాళ్ళ జైళ్ళు
పోలీసు ఎంక్వయిరీ

'ఎడు' లాంటి అపదాన్ని ఇంగ్లీషు మాటకి చేరుస్తారు శేషేంద్ర :

“వాజెడు పూలతో.... .... ....”

కావాలనే శేషేంద్ర వర్ణక్రమాలు తప్పుగా వ్రాస్తారు. 'స' వ్రాయ వలసిన చోట్లల్లా 'శ' వ్రాస్తారు క్రియా పదాల్లో; చేశిన, కోశే, రాశిన, చదివేశిన, మోశే మొ॥

ఇతర వర్ణక్రమ దోషాలు: వెదజల్లు (= వెదచల్లు)
రుతువు (= ఋతువు)
రుజురేఖ (= ఋజురేఖ)
రాస్తుంది (= వ్రాస్తుంది) మొ॥

## 7. మినీ కవితల భాష :

1980 నుంచి 'మినీ కవిత'ను ఒక ఉద్యమంగా లేపదీయాలని కొందరు విఫల ప్రయత్నం చేశారు. దీన్ని 'విప్లవం' అని కూడా అన్నారు. విప్లవం భావ సంబంధి కాని ఛందో సంబంధి కాదు కదా! దీంట్లో రెండు, మూడు పాదాలకన్న ఎక్కువ ఉండవు. ఒక్కొక్క సారి రెండుదళాలతో కూడిన ఒకే పాదం కూడా ఉంటుంది. శీర్షిక కూడా సాభిప్రాయంగా వుంటుంది : ఎక్కువమంది అంత్య ప్రాసలు విధిగా వేస్తారు. స్వరూపాన్ని బట్టి మినీ కవితను కొందరు పూర్తిగా తత్సమ పదాలతో నడుపుతారు. (తత్సమ పదం ఇముడ్చు కోగలిగి నంత అర్థాన్ని దేశ్య పదం ఇముడ్చు కోలేదు) కొందరు అంత్య ప్రాసలు తత్సమాలుగా వేసు కుంటారు. (దేశ్య పదాల్లో రైముకు పనికి వచ్చేని కూడా తక్కువే ఉంటాయి). మొత్త మీద మినీకవితను మిశ్రమ శైలిలో నడపడానికే సాధ్యమవుతుంది. పట్టు పడితే దేశి శైలిలో కష్టపడి నడపవచ్చు. (శ్రీ అసు రాజేంద్ర “వంటింటి సాహిత్యా”న్ని ఇలా దేశి శైలిలో నడిపారు. మినీ కవితా రచనలో ఈయన చేయి తిరిగిన కవి). ఆధునిక సమాజాన్ని చిత్రిస్తూ ఉండడం వల్ల అన్యదేశ్యాలు తప్పవు.

ఎ) మిశ్రమ శైలికి ఉదాహరణాలు :—

1) కంటి తెలివి

"కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్ప పాటేగద ప్రయాణం"
(—చంద్రసేన్)

దీంట్లో అంత్యప్రాసలకు మాత్రం తత్సమ పదాలు వాడ బడ్డాయి.

2) విప్లవ వీరుడు

ఒక్క అగ్గిపుల్ల
మరణిస్తే
కోటి పిడికిళ్ళలో
కాగడాలు లేస్తాయి
(—ఆసు రాజేంద్ర).

ఈ కవితలో శీర్షిక, 'మరణిస్తే' 'కోటి', అనే పదాలు తత్సమాలు.

బి) దేశి శైలి ఉదాహరణాలు :

1) జైజైలు
పులి
మేకను చంపితే
జైజైలు.
మేక
పులిని చంపితే
జైలు

2) కష్టం
కితకితలు పెడితే
మజ్జిగ
పకపకా నవ్వుతుంది!

3) కాలీ కాలని
కట్టెలు
పొయ్యి నోట్లో
చుట్టలు!
(—ఆసు రాజేంద్ర)

సి) అన్య దేశ్యాలు ప్రయోగించిన శైలి :—

1) కిరోసిన్
"మందు" కొట్టిస్తేనే
స్టౌ ముఖం వెలుగుతుంద

2) కిరోసిన్ లేని స్టవ్‌ని
పాపం
ఏ అగ్గిపుల్లా
లవ్ చేయదు
(—ఆసు రాజేంద్ర).

## 8. నిరసన కవుల భాష :

1983లో ఆబ్బూరి గోపాలకృష్ణ, అత్తలూరి నరసింహారావు, బైరవయ్య (మాజీ దిగంబర కవి), కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ అనే నలుగురు కవులు కలిసి తమ్ము 'నిరసన కవులు'గా ప్రకటించుకుని 'నిరసన' అనే కవితా సంకలనాన్ని ప్రకటించారు. మూర్ఖత్వాన్నీ, దగుల్బాజీ తనాన్ని, కాకుకూతల నాటు విమర్శకుల్ని, కవిత్వరుచిని చంపటాన్ని, రచయితలు రాజకీయ కార్యకర్తలుగా మిగిలి పోవటాన్ని, పార్టీ సాహిత్యాన్ని, ఫ్యూడల్ మార్క్సిస్టుల్ని నిరసించి వీరు నిరసన కవులయ్యారు.

"ప్రగతి మా ప్రాణం
ప్రయోగం మా శరీరం
కవిత్వం మా దైవం
కవి చిరంజీవి" అని ప్రకటించుకున్నారు,

ఆధునిక కవులెవరైనాసరే ఆవేశం మిన్ను ముట్టినప్పుడు, తమ భావాల్ని వ్యక్తం చెయ్యడం కోసం తత్సమ పదాల్నే ఆశ్రయిస్తున్నారు. విప్లవ కవులు తమ మొట్టమొదటి సంకలనానికి "ఝంఝ" అని పేరు పెట్టడంలోనే ఈ విషయం గుర్తుకు తోంచి - ఈ మాట తీసి ఇంక ఏ తెలుగుమాట వేసినా రసాభాసం అయిపోతుంది. అసలు అన్ని భావాల్ని వ్యక్తం చేసేశక్తి అచ్చ తెనుగుభాషకు లేదనిపిస్తుంది, నిరసన కవులు పరమార సాహిత్యాన్ని. సమాజాన్ని, నిరసిస్తున్నారు కాబట్టి ఆ ఆక్రోశాన్ని వెళ్లడించడంలో ఎక్కువగా మార్గశైలినే ఆశ్రయించారు.

"నగరాల, గ్రామాల ముఖాలమీద
నిశ్శబ్దాన్ని ముద్రించేయత్నం
మిట్ట మధ్యాహ్నం నక్షత్రాలను కూడా
మింగివేసే అమావాస్య చీకటి అయితేనేం
కారాగారపు కటకటాల వెనుక నుంచి
స్వేచ్ఛా సూర్యుడి అదృశ్య కిరణాల అభయహస్తం॥
(—అమావాస్య చంద్రుడు)

ఈ నిరసన కవులల్లో మిశ్రశైలి, దేశిశైలి చాలా తక్కువగా ఉంది.

## 9. అభివ్యక్తి :

ఇక అభివ్యక్తి చరిత్ర చూసుకుంటే, నన్నయ మార్గశైలితో ప్రసన్న కథా కవితార్థయుక్తితో, మెత్తని సంస్కృత సమాసాలతో, అనుప్రాసలతో అక్షర రమ్యతను సాధించి, శ్రోతల హృదయాలను ఆకర్షిస్తాడు తిక్కన దేశి శైలితో పాత్ర చిత్రణతో, సంఘటనలతో, శ్రోతల బుద్ధిని, ఆలోచింప జేసి వికసింప జేస్తాడు, పెద్దనాదులు కథా ప్రాధాన్యాన్ని తగ్గించి వర్ణన, చమత్కారాలను పెంచారు భావకవులు శబ్దాలకన్నా భావాన్ని రమ్యంగా ఆవిష్కరించడంలో కృతకృత్యులయ్యారు. వీరిభాష, ఛందస్సు మాత్రం పాతవే. అయినా వీళ్ళు హృదయవాదులు కావడంవల్ల ప్రజల్ని ఆకర్షించారు అభ్యుదయ కవులు తిక్కన ధోరణిలో బుద్ధిగమ్యంగా రచనలు చేశారు. కాని శ్రీశ్రీ అభివ్యక్తిలో ఎక్కువగా ప్రాచీన పురాణ ప్రతీకలనే వాడాడు. ఒక్క పదాభి మాత్రం అభివ్యక్తిలో చాలా నూతనత్వాన్ని ప్రదర్శించాడు.

అరుద్ర ఈయన్ని అన్నివిధాలా అనుకరించాడు. కుందుర్తి, మధ్య తరగతి జీవితంలోంచి కొన్ని అలంకారాలనూ, భావచిత్రాలనూ, అనుభూతులనూ గ్రహించాడు. తిలక్ భావకవుల ధోరణిలోనే అభ్యుదయ కవిత్వం చెప్పాడు. దిగంబర కవులు వర్తమాన సమాజం లోని లోపాలను చూసి ఆక్రోశం చెంది, దానికి అనుగుణంగా తిట్లు తిట్టారు. వీరి అభివ్యక్తి, నూతనమైనదే కానీ, నిందాత్మకమై, జుగుప్సా వహంగా ఉంటుంది. తెలుగు కవిత్వంలో ప్రతీకలు, భావచిత్రాలు వీరితోనే అధికమయ్యాయి. విప్లవకవులు శ్రీశ్రీ మార్గంలోనే ప్రాచీనాభివ్యక్తినే పాటించారు. గద్దర్ లాంటి కవులు ఆశు కవులు కావడంతో సహజోక్తులతో, ప్రజల నుడికారంతో అభివ్యక్తిని చూపారు. చేతనా వర్తం కవులు అనుభూతికవులు, భావ కవులలోని మార్మి కాంశాన్ని (మిస్టిసిజమ్) గ్రహించి కవిత్వంలో తాత్వికాంశాన్ని పెంచుతూ, అనుభూతుల్ని స్పష్టా స్పష్టంగా ఆవిష్కరించారు వీరిలో కొందరిది "ట్రాన్స్పరెంట్ చీకటి" అయితే మరి కొందరిది "చిమ్మ చీకటి" శేషేంద్రలో 1975వ వరకూ ప్రాచీనాభివ్యక్తే కనబడుతుంది. ఆ తర్వాత అది పరిపక్వమై నూతనాభివ్యక్తి, చమత్కారం, నూతన కల్పనలు, ఆధునిక జీవితానికి సంబంధించిన ప్రతీకలు, ఆంగ్ల పదాలతో, హిందూస్తానీ పదాలతో కూడిన విచిత్ర శైలి చోటు చేసుకున్నాయి. ఆధునిక కవిత్వాభివ్యక్తి అంతా నూటికి 90 పాళ్ళు రూపకాలం కారంతోనే జరుగుతుంది తరువాత ఎక్కువగా వాడబడేది ఉపమాలంకారం. శేషేంద్ర వచ్చేవరకూ నూతనాభివ్యక్తి రాలేదనే చెప్పాలి. ఈ శతాబ్దిలో యువతరాన్ని ప్రభావితం చేసిన కవులు ముగ్గురే : శ్రీశ్రీ, తిలక్, శేషేంద్ర.

## 10. ఆధునిక భాషాశైలి - నన్నయ ప్రభావం

నన్నయ, తెలుగు కవులకు ఒక భాషాశైలిని తీర్చిదిద్ది ప్రసాదించాడు. తన కాలంనాటి శాసన భాషను పరిశీలించాడు. ప్రజా వ్యవహారంలో ఉన్న తెలుగు పదాలు తీసుకున్నాడు. ఆ పదజాలం తక్కువగా వుంది. అప్పటి రాజభాష, సాంస్కృతిక భాష సంస్కృతం. అందువల్ల సంస్కృత పదాలు విరివిగా స్వీకరించాడు. అందులోనూ కఠినమైన పదాలు కాకుండా, మెత్తని శబ్దాలు, తెలుగు పదాలేమో అని భ్రాంతి గొలిపే సంస్కృతపదాలు గ్రహించాడు. అక్షర రమ్యత మీద దృష్టి వుంచాడు. సామాన్యులు కూడా వినగానే, అర్థం తెలియక పోయినా, ఆనందించే సంగీతం లాంటి శైలిని సాధించాడు. 11 వ శతాబ్దిలో నన్నియ ఏర్పరచిన ఆ శైలి, 20 వ శతాబ్ది నాల్గవ పాదంలోని శేషేంద్ర దాకా కొనసాగుతూనే వుంది. దానినుంచి బయట పడాలని ప్రయత్నించిన ఏ కవీ ఇంతవరకు కృతకృత్యుడు కాలేదు. అంత సహజమైన, అక్షర రమ్యమైన, పండిత పామర జనరంజకమైన భాషా శైలిని సృష్టించిన నన్నయ నిజంగా వాగను శాసనుడే.

నన్నయ ప్రారంభించిన మార్గశైలి తెలుగు కవులలో ఎంతగా జీర్ణించుకు పోయిందంటే, దేశశైలి ప్రయోగిస్తే, కొన్ని సందర్భాలలో కవిత ఉదాత్తతను కోల్పోయి, పేలవంగా, హేయంగా అయి పోయేటంతగా జీర్ణించుకు పోయింది. తిక్కన దేశ శైలి ఈ నాడు మనకు తిక్క తిక్కగా కృతకంగా కనబడటం దీనివల్లనే, 'ఘనం' అనే మాటే తెలుగు భాషకు సహజం కాని 'ఎటుక' ఎంతో అసహజం, నేటి విప్లవ కవులకు కూడా 'యుద్ధం, విప్లవం, ఉద్యమం, యోధుడు, వీరుడు' అనే పదాలు చాలా సహజమైన, పరిచయమైన శబ్దాలు ఇవి తత్సమ శబ్దాలుగా అనిపించవు వీటికి బదులుగ 'పోరు, జగడం, పూనిక, జోదు, మొనగాడు' అనే అచ్చ తెలుగు పదాలు వాడితే అవి ఏవో పాతకాలపు గ్రాంధిక పదాలుగా భాసిస్తాయి. 'పాదాలు' 'హస్తాలు' అనే మాటలు కవిత్వంలో ఎంతో ఉదాత్తతను కల్గిస్తాయి. 'కాళ్ళు' 'చేతులు' అని ప్రయోగిస్తే నీచంగా ధ్వనిస్తాయి. కవిత్వ భాషలో 'అర్ధరాత్రి' అనే తత్సమపదమే తెలుగు వాళ్ళకి సహజమైన పదం. 'అద్దమరేయి' 'నడిరేయి' అనే మాటలు కృతకాలు!

కన్నడంలో పరిస్థితి దీనికి వ్యతిరేకంగా ఉంది. కన్నడ ఆధునిక కవులు సాధ్యమైనంతవరకూ అచ్చ కన్నడ పదాలనే వాడుతారు. సహజంగా వచ్చే తత్సమ పదాలను ప్రయత్న పూర్వకంగా పరిహరిస్తారు. ఇది వారిలో ఒక భాషోన్మాదం. (ఇక్కడ బేంద్రే లాంటి మహాకవులు కూడా జానపద శైలిని వరించి అందులో కవిత అల్లారు. మన శేషేంద్రలాంటి ప్రతిభావంతులైన కవులకు జానపద శైలి అంటే పరమ అసహ్యం!) మనం తత్సమ శబ్దాలను పరిహరించక పోవడంవల్ల మనభాష యిప్పటికీ మధురమైన భాషగా నిలిచి వుంది. తెలుగు భాషకు మాధుర్యం సంస్కృతంతో చక్కగా కలవడం వల్లనే వచ్చింది. ఈ మేళవింపు 11 వ శతాబ్దిలోనే నన్నయ చేశాడు ఆది ఇప్పటికీ కవులకు శిరోధార్యమై వర్ధిల్లుతోంది!



# ఎందు కింక ఆలస్యము ?

## శ్రీ ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

వెదురు పొదను చిరుగడకా !
పొదవె నింత యదృష్టమ్ము ?
నాథు నధర సీమ జేరి
నాద సుధుల విరజిమ్మను ?

వివిధ వేణు నాదములను
వినలేదా పూర్వమందు ?
ఈ వేణువు కింత శక్తి
ఏ విధముగ సంప్రాప్తము ?.... వెదురు పొదను

నాథు డూదు ప్రాణవాయు
మాధుర్యమె మారుమ్రోగు;
పురుషోత్తము పరమాద్భుత
పారమ్యము పరగునిట్లు.... వెదురు పొదను

ఘనతర మీ నినాదములు
ఘనగతులను స్థంభించును;
బ్రహ్మదేవు నంతవాని
బొమ్మగ గావింపగలవు !!!.... వెదురు పొదను

తుంబుర నారద వితతికి
డంబు రూపు మాప గలవు;
సకల చరాచర జగతికి
సకలత్వము సంతరించు.... వెదురు పొదను

లోకాలోకము లన్నిట
ప్రకటితమీ నాదమహిమ !
పరవశించి యనంతుండు
శిరసు నూపు నేమొ చెలీ !! వెదురు పొదను

మీ చెవులకు సోకలేదె
ఈ చిన్మయ చైతన్యము?
ఎల్ల ప్రకృతి యెుక్కుమ్మడి
ఉల్లసిల్లు పులకితమై........ వెదురు పొదను

కాదా యిది ఆహ్వానము?
కాదా తరుణోపాయము??
ఎంత మంచి యవకాశము
ఇంత త్వరగ సంప్రాప్తము? వెదురు పొదను

వేదాలను చదవలేదు
వాదాలను నేర్వలేదు
ముక్కు మూసుకొని యొకచో
చక్కగ కూర్చొన జాలము!! వెదురు పొదను

ఎందుకింక ఆలస్యము?
బృందావన మధిగమింప;
సుందరుడౌ మన నాధుని
అందర మొకపరి కొల్వగ! వెదురు పొదను

ఈ తనువులు వేణువులుగ
చేతము వేవేగ రండు !
నూతనమౌ నాద సుధల
పూత మొనర్తుము జన్మల!! వెదురు పొదను

చెలులారా! లేచిరండు!
కలతలెల్ల మాపిగొనగ!!
చేరి చిన్ని కృష్ణునితో
చరియింపగ తరుణమిదే !! వెదురు పొదను

డా॥ యస్. యల్. యస్. ఆచార్య

# కాకతీయుల శాసనాలు: వాక్యనిర్మాణం

(గత సంచిక తరువాయి)

## విశేషాలు :-

### 1. వాక్య విరామ చిహ్నాలు

ఇంగ్లీషులో వాక్య విరామ చిహ్నంగా చుక్క కనిపిస్తుంది. కాని సంస్కృతంలో దేవనాగరీ లిపిలో విరామ చిహ్నంగా '॥' రెండు నిలువు గీతలు వాడే ఆచారం ఉంది. సంస్కృత శ్లోకాలలో పూర్వార్థం పూర్తియైతే ఒక నిలువు గీత '।' శ్లోకమంతా పూర్తిచేసి రెండు నిలువు గీతలు పెట్టే ఆచారం నాడు నేడు [35] కన్పిస్తుంది. అదే విధంగా వాక్య విరామ చిహ్నంగా నిలువు గీతలను వాడేపద్ధతి సంస్కృతంలో దేవనాగరి లిపిలో ప్రాచీనకాలంలోనే కన్పిస్తుంది.[36] సంస్కృత భాషతోపాటు సంస్కృత భాషా మర్యాదలను గ్రహించిన మన ప్రాచీనులు సంస్కృత శ్లోకాలను తెలుగు లిపిలో వ్రాసినా విరామ చిహ్నంగా రెండు నిలువు గీతలను వాడేవారు. కాకతీయుల నాటి సంస్కృత శాసనాలీ విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

అదే విధంగా నాడు తెలుగు వాక్యం పూర్తి కాగానే విరామ చిహ్నంగా రెండు గీతలు వాడుతున్నట్లు మొగులుట్ల తామ్రశాసన ప్రతిబింబాలే తెల్పుతున్నాయి.[37] ఈ పద్ధతి కాకతీయుల కాలంలో మొదటి బేతరాజు కాలంనుండే కన్పిస్తున్నది.[38] పద్య శాసనాలలో పద్యాల చివర కూడ ఈ విరామ చిహ్నాలు కన్పిస్తున్నాయి.[39] కొన్ని శాసనాలలో అసమాపక క్రియల దగ్గర కూడ ఒక నిలువు గీత వాడ బడింది. కాకతి ప్రోలుని నాటి మాచేడు శాసనంలో "త్రిభువన మల్ల దేవర విజయ రాజ్యముత్తరోత్తరాభివద్ధి ప్రవర్ధమాన మా-చంద్రార్కతారం సాయగా।" అని విరామచిహ్నం కన్పిస్తుంది.[40] అట్లే మల్లిరెడ్డి బెక్కల్లు శాసనంలోని దీర్ఘవచనంలో ప్రతి విశేషణానికి ఒక నిలువు గీత వాడబడింది.

ఈ విధంగా నిలువు గీత అసంపూర్ణ వాక్యాలకు చిహ్నంగా అంతటా ఉన్నట్లు చెప్పలేము. కొన్ని శాసనాలలో ఈ ఒంటి నిలువు గీత సంపూర్ణ వాక్యానికి చిహ్నంగా కూడ కన్పిస్తుంది. కాకతి రుద్ర దేవుని అనుమకొండ శాసనంలో ప్రతాప రుద్రదేవుని కాలానికి చెందిన శార్ఙ్గపాణి దేవుని పానుగల్లు శాసనంలో అవాంతర వాక్య విరామ చిహ్నంగా, నాగులపాడు పానుగల్లు పిల్లలమఱ్ఱి శాసనాలలో ప్రధాన వాక్యాలకు విరామ చిహ్నంగా కన్పిస్తుంది. ఐనా ఎక్కువగా నాటి శాసనాలలో రెండు నిలువు గీతలే వాక్య విరామ చిహ్నంగా కన్పిస్తాయి.

### 2. పద క్రమము

ఆంగ్ల వ్యాకరణ వేత్తలు ఆంగ్ల వాక్యాలలోని పదక్రమాన్ని తమ తమ వ్యాకరణాలలో సాధారణంగా తెలుపుతారు. కాని తెలుగు భాషలో ఆంగ్లభాషలో ఉన్నట్లు పదక్రమ నిర్ణయ పద్ధతి కన్పించదు. వక్తృ వివక్షలోని ప్రధాన్యాన్ని అనుసరించి పదముల క్రమము మారుచుండును. సాధారణంగా తెలుగు వాక్యం కర్త, కర్మ, క్రియ అను పద్ధతిలో క్రమము కన్పిస్తుంది. అట్లే విశేషణం తర్వాత విశేష్యం కన్పిస్తుంది. కాని అంతటా ఈ పద్ధతి ఉండాలన్న నియమం లేదు. అందువల్లనే చిన్నయసూరి బాలవ్యాకరణంలో "ఏక వాక్యమునం దొకానొకచో తక్క సర్వ పదంబులు క్రమ నిరపేక్షంబుగం బ్రయోగింపం జను" అని సూత్రీకరించినాడు (కారక-37)

అట్లే కాకతీయులనాటి శాసనాలలో కర్త కర్మ క్రియ మరియు విశేషణం, విశేష్యం, అను వరుస అంతటా పాటింప బడలేదు.

1. కర్మ, కర్త, క్రియ అనే వరుసలో ఉన్న వాక్యాలు

"దేవబ్రాహ్మణ విత్తులు రుద్రదేవమహారాజుల (లు?) పెట్టి (రి।)"

—ఇన్స్. ఎ.పి. డబ్లు.డిటి 37 పి 102

2. కర్మ క్రియ కర్త అనే వరుసలో ఉన్న వాక్యాలు

"ఇన్మఱురుపుర్వీశ తలంబిచ్చెనుం దాంబ్రశాసనముగా... ....
... ... బుధారాధ్యుండు మల్లండిలను"

—సెల్. ఇపి. ఎ.పి. 28 పి. 70.

"బిరుహ కుంతచేయంబును ఖం వితానముం బడసెనమాత్య
ప్రోలిండు"                —సెల్ ఎపి. ఎపి. 14 పి. 38.

పై రెండు శాసనాలు పద్య శాసనాలే.

3. కర్త, కర్తృ విశేషణం

"మల్లయ్య ప్రోలణ్ణు యి (గ్గి) మడి పడిమట (ను) నల్లరేవడు (నల్లు) నల్లలితుండు దుబకుంట శాసనమిచ్చెను."
—అదే 24 పి 72

"ప్రోలమరాజా (జు) మాత్య చూడామణి స్థిరముగ ప్రిత్తులు వడసెం బురుహూత నిభుండు (చా) గమరి పంప్రెండును."
—అదే 14 పి. 38.

4. క్రియ, క్రియా విశేషణం

"మల్లిమదేవరాజు సిద్ధీశ్వర దేవరకు తేజాలు ధారవోసి యిచె సర్వ్వ పరిహారము"          —కార్ప్స్. 4-42 పి. 89.

"అందు ఆయే (మ్మె) డి చిరవిధగడెనాన విసము ఇస్తిమి ఆ చంద్రార్కర్కం"          —అదే. 2-10 పి. 50.

నాటి శాసనాలలో కన్పించే పదక్రమము

సాధారణంగా నాటి దాన శాసనాలలో దాత పేరు ప్రతిగ్రహిత పేరు ఆ తర్వాత దానము అనే క్రమం కన్పిస్తుంది. దేవాలయాలకు దానం చేసేటప్పుడు దాత పేరు తర్వాత భగవంతుని పేరు దాన నిమిత్తమైన అంగరంగ భోగాదులు కన్పిస్తాయి. వీటిని త్యాగోద్దేశ్యం, ఉద్దేశ్యం అని చిన్నయసూరి (కారక-37) తెలిపితే పరోక్షకర్మ, ప్రత్యక్ష కర్మలని బూదరాజు రాధాకృష్ణగారు వివరించినారు.[41]

"శ్రీమన్మహామణ్డలేశ్వర బేతరాజులు బేతేశ్వరంబున ప్రోలేశ్వర దేవునకు నంద దీవియకు నిత్య పణ్డ్రెణ్డు మానికలు (౧౨) నేయ"          —అదే 2-6 పి. 25.

"మహాసామంత వేమ బోల బొడ్డుమ మల్లెనాయకుంకు మార చేటం దన నిల్పిన మల్లేశ్వర దేవరకు మల్ల సముద్రము పిఋంద(న్దు)నీ స్థానపతి కేశవజియ్యలకు పూజకు మఋడ్లు ౨ నివేద్యమునకు మఋలు ౧ దివియకు మఋలు ౧"
—అదే 3 కెఎమ్. 1 పి. 25.

ఇక నాటి శాసనాలన్నిటిలో అంకెలు, తత్సంబంధి పదాల తర్వాతనే కాని ఎట్టి పరిస్థితులలోనూ ఆ పదాలకు పూర్వం కనిపించవు. సంఖ్యా తొలుత చెప్పవలెననుకొంటే అక్షరాలలోనే దాన్ని వ్రాసేవారు.

"ప్రోలేశ్వర దేవునకు నందదీవియకు నిత్య పణ్డ్రెణ్డు మానికలు (౧౨) నేయ... ......"

స్థానపతి కేశవజియ్యలకి పూజకు మఋడ్లు ౨ నివేద్యమునకు మఋరా ౧ దివియకు మఋలు ౧"

—: పై శాసనములు :—

"పార్లు నిడు నుప్పు సిబరప ¼ జొంన్నల భండికి ప2¼ గిద్ద పెఋకకు వి 2 కు 1 పద్దుం సిబరప¼ ఆకు బెఋకకు రు2¼
—కార్ప్స్. 2-36 పి. 105

"తోంట రాట్నాల రాణ్ణాన మూడు సింగ్నాలు తిమ్మణ్ణు ౧ గొల్లవారు గ౨ అనామిక్కు గ"
—ఇన్స్. ఏ. పి. దబ్బుల్య డిటి 37 పి. 101

మిగిలిన పదాలన్నిటితో నియతంగా ఒక క్రమం పాటించబడలేదు

సాధారణంగా నాటి శాసనాలందు కన్పించే పదక్రమ మీ విధంగా ఉంది.

మొదటి రాజప్రశస్తి లేక బిరుదులు, తర్వాత రాజు పేరు, అతని ముఖ్యపట్టణము, రాజ్యమేలుతున్న విషయం సమయం (శక వర్షాలు లేక రాజ్య సంవత్సరాలు) సంవత్సరం, దానిశాసనమైతే దానమిచ్చే వ్యక్తి, ప్రతిగ్రహీత, దేవాలయాలకు చేసే దానమైతే భగవంతుని పేరు, దాన నిమిత్తం, (అంగ రంగ భోగాదులు, పూజ, నందా దీపం మొదలైనవి) దానమిచ్చే వస్తువు (ధనము లేక భూమి మొదలైనవి) ఆ తర్వాత క్రియ కన్పిస్తుంది దానమిచ్చే వ్యక్తి రాజ సామంతుడో రాజ భృత్యుడో ఐతే అతని బిరుదులు మొదలైనవి రాజు పేరు తర్వాత కన్పించును. దానశాసనం కాకపోతే ఆతడు చేసిన ధర్మకార్యం తర్వాత క్రియ కన్పిస్తుంది.

"స్వస్తి సమధిగత పంచ మహాశబ్ద మహామండలేశ్వర ... .... రుద్రదేవరాజుల విజయరాజ్య ముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్ధ్ధమానమా చంద్రార్కర్క తారము (గా) అన్మకొండ పట్టణమునందు సుఖ సంకథా వినోదంబున రాజ్యంబు సేయుచునుండ శకవర్షములు ౧౦౮౪ వు నేటి చిత్రభాను సంవత్సర మాఘ శు ౧౩ వడ్డవారము నాండు తనపేర రుద్రేశ్వరమును శ్రీవాసుదేవర శ్రీసూర్య్య దేవరాను ప్రతిష్ఠ సేయించె"          —కార్ప్స్ 2-3 పి. 8.

"స్వస్తిశ్రీ సమస్త విద్యావిలాసినీ లాసక రసిక ... ... విభవ నిర్జిత విబుధరాజులైన స్వస్తి శ్రీమతు గణపతిదేవ మహారాజులు ఓరుగల్లు పురవరమునందు ఆ చంద్రతారార్కర్కము ఉత్తరోత్తరాభివర్ధ్ధ (మా)న సుఖ సంకథా వినోదంబుల పృధ్విరాజ్యము శేయుచుండంగాను తమ దివ్యరాజ్య సంవత్సరములు ౬౨ అగు ప్రసాహిళక

వర్షంబులు ౧౧౮౭ అగు నేటి రౌద్రి సంవత్సర ఆషాఢ బ.... నాంటి కర్కాటక సంక్రమణ నిమిత్తమున శ్రీపర్వత పూర్వ ద్వార శ్రీ త్రిపురాంతక దేవర మధ్యాహ్న సంధ్య అంగరంగ భోగా లకు కంమనాంటికోని గుండ్రేటి ఉత్తరపు దిక్కున................పాడు అనెడు యూరును పూంగినాంటిలోని ముశికటురి (రే) డు మడపల్లి అనెడి యూరును చతుస్సీమములూను సకలాయ సహితముగా ధారా పూర్వకము శేశి ఆ చంద్రార్క స్థాయిగా నిచ్చిరి.''

—ద-హిం-శా10, 371 పు 192.

కాని నాటి శాసనాలన్నీ పైశాసనాలవలెనే ఉన్నాయని చెప్ప లేము. కొన్ని శాసనాలలో సంవత్సరమే తొలుత నుండగా మరికొన్ని శాసనాలలో తమ ఏలికను శాసన మధ్యభాగంలో పేర్కొన్నారు. కొన్ని శాసనాలలో రాజుపేరు కన్పడదు.

ఈ విధంగా నాటి శాసనాలలోని పదక్రమాన్ని గురించి ఒకే పద్ధతి అన్ని శాసనాలలో అనుసరింపబడలేదు.

## భిన్న వచనాలలోనున్న వాక్యాలు

నాటి శాసనాలలో కొన్నివాక్యాలు నేటి వ్యవహారానికి, వ్యాకరణ మర్యాదకు కూడ దూరమై కన్పిస్తున్నాయి. కొన్ని వాక్యాలు ఆనాటి వ్యవహారాన్ని తెలుపుతున్నాయి. వాటిలో కొన్ని నాటి సాహిత్యం లోనూ కన్పిస్తున్నాయి.

ఏ వాక్యమందైనను కర్త, క్రియ ఒకే వచనంలో ఒకే పురుషలో ఉండును. కాని కొన్నిచోట్ల కర్త బహువచనంలో క్రియ ఏకవచనంలో ఉన్న సందర్భాలున్నాయి. వాటిని గుర్తించిన చిన్నయసూరి "తిర్యగ్జడంబులు వాచ్యంబులగునపుడు లిఙ్గాట్టుల ప్రథమ బహువచనంబున కేక-వచనంబగు" (క్రియా-25) అని తెలిపినాడు. ఆంధ్ర భాషాభూషణ కర్తయైన కేతన, ఆంధ్రశబ్ద చింతామణి కర్తకూడ స్థావర తిర్యక్కుల బహుత్వమున కేక వచన మగునని తెల్పినారు.[42] ప్రౌఢ వ్యాకరణ కారుడు "మహద్బహు కర్తృకక్రియకు నేక వచనంబు విభాషనగు" (క్రియా-6) అని ఏక వచనాంతాలైన అనేక- మహత్కర్తలున్నప్పుడు తత్క్రియకు ఏక వచనాన్ని వికల్పంగా విధించినాడు అట్లే గౌరవార్థంలో ఏకవచ నానికి బదులు కర్తృ క్రియలకు బహువచనాన్ని నేటికీ ఉపయోగిస్తు న్నాము. కాని నాటి కొన్ని శాసనాలలో మహద్వాచకమైన కర్త బహువచనంలో ఉండగా క్రియ ఏకవచనంలో, కర్త ఏకవచనంలో ఉంటే క్రియ బహువచనంలో కన్పిస్తున్నాయి. ఇటువంటి వాక్యాలు నాటి వ్యవహార బలిమివల్లనో, శాసన-లేఖకుని అనవధానతవల్లనో ఏర్పడియుండవచ్చు.

"శ్రీ మట్టారి ప్రోలెరాయకుణ్ణు మల్లికార్జునమున..... .... ... కేశవభట్లకు గొల్లని గుణ్ణతోపును మల్లయ ప్రోల్లణ్ణు యి(గ్గి)మడి పడిమట(ను)....దుబకుంటసాసనమిచ్చెను"

సెల్. ఎపి ఎ. పి. 24 పి: 72.

ఈ శాసనంలో కర్తలిద్దరున్నా క్రియ ఏకవచనంలో కన్పి స్తున్నందువల్ల ప్రౌఢవ్యాకరణకర్త స్వీకరించిన ఏకవచనాంత మైన మహద్బహు కర్తృక క్రియకు ఉదాహరణంగా చెప్పవచ్చు. కాని హనుమకొండ శాసనంలో కర్త బహువచనంలో క్రియ ఏక వచనంలో కన్పిస్తున్నాయి

"దీని(న)డుపువారు దేవరకాపయి సుఖంబుణ్ణు వాణ్ణు"

కార్పస్ 2-6 పి. 25.

అట్లే గౌరవసూచకంగా కర్తకు బహువచనం వాడినా క్రియ ఏకవచనంలో ఉన్న వాక్యాలు, కర్తను ఏకవచనంలో తెలిపి క్రియను మాత్రం గౌవరసూచకంగా బహువచనంలో వాడిన వాక్యాలు కూడా నాటి శాసనాలలో కన్పిస్తాయి. ఇవికూడ శాసనలేఖకుని అజ్ఞత లేక అశ్రద్ధవల్ల ఏర్పడియుంటాయి.

ఎల్కుర్తి శాసనంలో

"తలారి భైరయ నాయంకులు వైజనాథదేవరకు....

... మఱుతురు చేను ప్రవిత్తి ధారపోసెను"

సెల్. ఎపి. ఎ. పి. 17 పి. 46.

"శ్రీ శార్ఙ్గ పాణి దేవమహారాజులు శ్రీ ఛాయాసోమనాథ దేవుని అంగరంగభోగానకు ధారాపూర్వ కమిచ్చిరి.... కరణము దిండిమరాజు సోమయదేవుని దీపానకు ధారా పూర్వకముగా నిచ్చిరి. కార్పస్ 2 34 పి 98.

## భిన్న పురుషలో ఉన్న వాక్యాలు

నాటికాలమందలి కొన్ని శాసనాలలో కర్త ప్రథమ పురుషైక వచనాన, క్రియ ఉత్తమ పురుష బహువచనంలోఉన్న వాక్యాలధి కంగా కన్పిస్తాయి ఇది శాసన లేఖకుని అనవధానతవల్ల జరిగిందని చెప్పలేము. ఈ శాసనాలన్నీ దాతలే స్వయంగా వ్రాసినవికాబోలు. లేక దాతలే శాసనాలు స్వయంగా వ్రాసినట్లు ఆ శాసన రచయితలు వ్రాసియుండవచ్చు. కడపజిల్లాలోని నందలూరు శాసనం కాకతి ప్రతాపరుద్రుడు నెలందలూరి మహాజనాలతో స్వయంగా మాట్లాడి ఐదూళ్ళను సర్వమాన్యంగా ఇస్తూ ప్రతాపరుద్ర చక్రవర్తి శాసన విషయాన్ని వ్రాసినట్లు ఉత్తమ పురుషలో కన్పి స్తుంది. అదే విధంగా మాచేడు కటుకూరు శాసనాలలో[43] మాచేటి అష్టాదశప్రజ మూలస్థానము మల్లేశ్వరదేవరకు కేశవదేవరకు నగరికి

బెట్టెడు సిద్ధాయంలో కొంత తాము స్వయంగా ధారపోసినట్లు ఉత్తమ పురుషలో చెప్పబడింది. ఈ శాసనాలందు మాచేటి అష్టాదశప్రజలు "మేము నగరికిం బెట్టెడు సిద్ధాయము పుట్టుబడిలెక్కను

....ఆ చంద్రార్కర్క ముచెల్లున(ట్లు)గాను పన్ను విడిచి ధారపోసినాము "అని తెలుపుకొన్నందువల్ల మాచేటి "అష్టాదశ ప్రజాను" అనే పదం మేము అనే పదానికి

వివరణగా కనిపిస్తుంది, ఇటువంటిదే నాగులపాటి శాసనం.[44] అందు "మా తండ్రి కాట్రెడ్డిగారికి మా తల్లి పారసానమ్మ-గారికి మాకుంబుణ్యముగా.... అంగరంగభోగాలకు బెట్టితిమి, అని కలదు. వాక్యము మొదటనున్న "శ్రీమతు నామయంగారు" అనే పదం తరువాతి ఉత్తమపురుషకు వివరణ ఈ విధంగా దాతలే స్వయంగా శాసనము వ్రాసినట్లున్నా ప్రజాసామాన్యానికి తెలియాల్సిన దాత పేరు ప్రథమ పురుషలో ఉన్నందువల్ల పాఠకునికి కొంత ఇబ్బంది కలుగుతుంది.

కాని కొందరు శాసన లేఖకులు ఉత్తమపురుషలో ఉన్న సర్వనామాన్ని తెలుపక కేవలం ప్రథమ పురుషలో ఉన్న దాత పేరు తెలిపినందువల్ల పాఠకుడు అయోమయ పరిస్థితికి గురియౌతున్నాడు. ఈ విధంగా పాఠకునికి అయోమయాన్ని కల్గించే వాక్యాలు వరంగల్లు జిల్లా రామన్నపేట శాసనం[44] మొదలైన శాసనాలలో కన్పిస్తాయి.

"పువుల ముంమడింగారు చంద్రుప(ట్ల) సోమనాథదేవరకు ....వృత్తి ధారాపూర్వకముగా నిస్తిమి"

—భారతి, మే 1974 పు 4

"....ఎల్లయరెడ్డింగారి అన్న వొల్లయరెడ్డింగారు శ్రీ శ్రీ త్రిపురాంతకదేవుని.... సర్వమాన్యముగా నిస్తిమి"

—ద-హిం-శా- 10 497 పు 268.

ఇంకా కొన్ని శాసనాలలో దాత పేరు తర్వాత తమకు తమ తల్లి దండ్రులకు పుణ్యముగా అని తెలిపి క్రియమాత్రం ఉత్తమ పురుషలో కన్పిస్తుంది. నాగనూరు నాగులపాడు[45] మొదలైన పెక్కు శాసనాలలో ఇట్టి వాక్యాలు కన్పిస్తాయి.

ఒక విభక్తికి బదులు వేరొక విభక్తిగల వాక్యాలు:-

కొన్ని వాక్యాలలో ప్రథమా విభక్త్యర్థంలో షష్ఠీ విభక్తి కన్పిస్తుంది. నన్నయ భారతంలోనూ కర్తృపద ప్రథమకు షష్ఠీ విభక్తి వాడబడినట్లు అవధానిగారు తమ సిద్ధాంత వ్యాసంలో నిరూపించినారు. అట్లే కాకతీయులనాటి శాసనాలలో కర్తృపదప్రథమకు షష్ఠీవిభక్తి కన్పిస్తుంది.

"బొడ్డమ మల్లెనాయకుండు మారభేటం దననిల్పిన మల్లేశ్వర దేవరకు"

కార్పస్ 3 కె. ఎమ్. 12 పి. 25.

శ్రీ మద్వెక్కం(టిను) మల్ల రెడ్డి దనయెత్తించిన గుడిన్ని ....దన కట్టించిన మైల సముద్రము పిఱుంద

కార్పస్ 4 25. పి. 55

పమ్మి శాసనంలో కర్తృ పదముకాని ప్రథమకుకూడ షష్ఠీవిభక్తి కన్పించుచున్నది.

"రాజులు దీపరంబాల కిచ్చిన మోదాలకు మేయనిచ్చిన

కార్పస్ 8 కె ఎమ్ 16 పి. 32.

కాని మొరిపిరాల శాసనంలోని వాక్యంలో శాసన రచయిత పొరపాటు వలననే షష్ఠీ విభక్తి కన్పించుచున్నది.

"కేతిరెడ్డికి పుణ్యవతియైన వల్లసనికి సుపుత్రుండైన బొల్లిరెడ్డికి దమ్మక పత్నియైన బొల్లసానికి వంశవర్ధనులైన కొడుకులం బడసె"

ఈ విధంగా నాటి శాసనాలలోని వాక్యాలు ఆనాటి వ్యవహారానికి ప్రతిబింబాలుగా అనేక విధాలుగా కన్పిస్తున్నాయి.

## అధో జ్ఞాపికలు

1. సిద్ధాంత కౌముదీ-శ్రీ రాజస్థాన సంస్కృత కాలేజీ గ్రంథ మాల మీర్‌ఘాట్-1939 పు 21. 2. తర్కసంగ్రహం-శబ్దప్రకరణం- 3. సిద్ధాంత ముక్తావళీ-శబ్దఖండం- పు 373. 4. కావ్యప్రకాశ-చౌఖాంబా సంస్కృత సీరీస్, బనారస్ 1926 పు 13. 5. సాహిత్యదర్పణం-నిర్ణయసాగర్ ప్రెస్- బొంబాయి 1936 పు 27. 6. ప్రౌఢవ్యాకరణము- వావిళ్ళ- మద్రాసు 1959 పు 267. 7. గురుబాల ప్రబోధికా-ప్రథమకాండ-వాగ్వర్గ-పు 123. 8. జార్జి-ఓ-కుర్మే-ఇంగ్లీష్‌గ్రామర్ భా 3 పు 97. 9. కడపజిల్లా శాసనాలు-142 పు 209. 10. కార్పస్-3 ఖమ్మం-16 పు 32. 11. సెలెక్ట్ ఎప్పిగ్రాఫ్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్-23 పు 70. 12. కరీంనగర్‌జిల్లా శాసనాలు-25 పు 65. 13. కార్పస్ భా-4-59 పు 113. 14. కరీంనగర్‌జిల్లా శాసనాలు- 30 పు 89. 14-ఎ ప్రౌఢ వ్యాకరణం-వావిళ్ళ-పు 292. 15. వరంగల్లుజిల్లా శాసనాలు-37 పు 101. 16. కార్పస్-4-24 పు 53. 16-ఎ కార్పస్-3-ఎం. ఎన్ 31 పు 69. 17. కరీంనగర్‌జిల్లా శాసనాలు-30 పు 89. 18. రామారావుగారు, చేకూరి-తెలుగువాక్యం-పు 1 19. ఫౌవర్-హెచ్-డబ్ల్యు-మాడరన్ ఇంగ్లీష్ యూసేజ్ పు 674-676. 20. ఆంధ్ర

వచన వాఙ్మయం-పు 46. 21. తెలుగు భాషా చరిత్ర-పు 96. 22. నన్నయ భారతం- పు 857-859. 23. తెలుగు భాషా చరిత్ర-పు 169. 24 ఆంధ్రశబ్ద చింతామణి-క్రియా-సూ-12, 19, 20. 25. ఆంధ్రభాషా భూషణం-ప- 145, 146. 26. తెలుగు భాషా చరిత్ర-పు 135. 27. ఆంధ్ర మహాభాగవతం-స్కం-10 పూ-భా ప 1734. 28. ఆంధ్ర భాషాభూషణం-ప-154-161. 29. ఆంధ్ర శబ్ద చింతామణి, క్రియా-సూ44. 30. నన్నయ భారతం-పు 864. 31. ఆంధ్ర భాషాభూషణం-పద్య 154-156. 32. ఆంధ్రశబ్ద చింతామణి, క్రియా-సూ-44. 33. ఇంగ్లిష్‌గ్రామర్- పు 152. 34. తెలుగు వాక్యం-పు 98. 35. కాకతీయ సంచిక-మల్కాపురం తామ్రశాసనం-పు 80. 36. కరీంనగర్ జిల్లా శాసనాలు-పు 146. 37. ఎ పి. ఆంధ్రికా-4 మొదటిరేకు రెండవ భాగం పు 99. 38. కార్పస్ 2-6 పు 25. 39. సెలె. ఎ పి.- ఎ. పి.- 23 పు 70. 40. కార్పస్-3 వరంగల్-10 పు 140. 41. తెలుగుభాషా చరిత్ర-పు 97. 42. ఆంధ్ర శబ్దచింతామణి-క్రియా-22 పు 87. ఆంధ్ర భాషా భూషణం- పద్య 147 పు 32. 43. కార్పస్-3. వరంగల్-13, ఖమ్మం-7 44. కార్పస్-2-31 పు 95. 45. కార్పస్-3 కరీంనగర్-4 కార్పస్-2-29.

(అయిపోయింది)

---

# భారతి

## శ్రీ పి. బి. శ్రీనివాస్

(స) మఱలఁ గలిగె నీ సుమధుర దర్శనభాగ్య
మింతకన్న యోగమేమి కలదు??
ప్రాభవమ్ము మెఱయ, "భారతి!" రావమ్మ!
సాగి, కొనుము ప్రగతి నాగవలదు!!

(రి) నీదయా రసాల స్నేహ సుధాధారఁ
గ్రోలు మదికి, మధువికేల? తల్లి!!
కలఁతలెల్లఁ దీర్చు కమనీయ రచనకై,
కల్పనల నిధులిడు కల్పవల్లి!!

(గ) నిఖిల భువన జనని! నిత్యకల్యాణివై,
నడచు నడల లయలె నర్తనములు!
నలువరాణి! వాణి! వెలుఁగిడు సుకవుల
కృతులు, త్వత్సుకీర్తి కీర్తనములు!!

(మ) భవ్య రచనలెల్ల దివ్యాభరణములై,
నిన్నలంకరించు వన్నెలగును!!
మెచ్చఁ బామరులును, మేటి పండితులును,
నిత్యవిభవమెల్ల నీకెతగును!!

(ప) నీదుశైలి నీదె! నిర్మల రూపిణీ!
సర్వవినుత సుగుణ సన్నుతాంగి!!
రాగభావ సుధల రసవర్ష మదించు
మొయిలువమ్మ! విశ్వమోహనాంగి!!

(ధ) నీదురాక వలన, నిలువెల్లఁ బులకించె,
వేచియలసియున్న విబుధ తతికి!:
కావుమమ్మ! వఱలఁ గావ్యరసజ్ఞతన్
వృద్ధిసిద్ధులిడి విశుద్ధమతికి॥

(ని) స్వీకరింపుమాట వెలఁదుల భావప్ర
సూనములను; సకల శుభము లిడుము!!
విశ్వశాంతి కాంతి విమల దీప్తినిబెంచు
కళల కొసఁగి స్ఫూర్తిఁ గనుముయశము!!!

# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది?"

"పోయిందే!"




మేలుపరచబడిన **అమృతాంజన్** వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన **అమృతాంజన్‌తో** చాలా సులభంగా 'మర్దనా' చేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునుపటికంటే **అతి** త్వరితంగా ఉపశమింపజేయగలదు!

## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా- తిరిగి వికసింపజేయగలదు!

Amrutanjan Limited 

OBM 149 TG R

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

## మే - 1988

### మేషము (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి ఆదాయం బాగుండును. ఉద్యోగావకాశాలు మెరుగవుతాయి. ఆరోగ్యం, ధనలాభం, సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి; కలుగును. విద్యార్థులకు, వ్యవసాయదారులకు, వర్తకులకు మంచి అనుకూలమైన కాలం. అయినా శుభకార్య ప్రయత్నాలు ఫలించినట్లే అనిపించి వాయిదాపడును. ఆరోగ్యం బాగున్నా ప్రతి చిన్న పనికీ కించిత్ శ్రమ కలుగును. మొత్తం మీద సర్వులకు అభివృద్ధిదాయకంగా ఉండును. రావలసిన పైకము వాయిదాలుగా వచ్చి, అవసరంలేని ఖర్చులు జరుగును.

భరణి వారికి అన్నివిధాల అనుకూలంగా ఉండును. నెల చివరలో ధనలాభం, కుటుంబసౌఖ్యం మొదలగునవి జరుగును. ఎవ్వరు ఎన్నివిధాలా కుట్రలు పన్నినా, అన్నింటిని త్రిప్పికొట్టగలరు. విద్యార్థులకు పరీక్షలలో అనుకూలత, ఉద్యోగులకు ప్రమోషను, వర్తకులకు విశేషలాభం కలుగును. శుభకార్యములలో పాల్గొనుట, సువర్ణ వస్త్రాభరణ ప్రాప్తి కలుగును. అయితే గతంకన్న నయమని చెప్పవచ్చును. శరీరశ్రమ, వ్యవహారపు చిక్కులు కలుగును.

కృత్తిక 1 పా. వారికి ఫలితం తక్కువ, శ్రమ హెచ్చుగా నుండును. అనుకోని విధంగా ధనవ్యయం జరుగును. సంతానమునకై విశేషశ్రమ, ధనవ్యయం కలుగును ఆరోగ్యం బాగుండును. గృహమందు సుఖశాంతులు కుటుంబంలో శుభకార్యములు జరుగును. అయినను కావలసినవారితో మనస్పర్థలు కలుగును. వ్యయం మాత్రం హెచ్చుగా నుండును.

### వృషభము (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4 పా. వారికి 14వ తేదీనుండి కార్యవిఘ్నం, మానసికంగా ఆందోళన, శారీరకంగా శ్రమ, 23వ తేదీనుండి మరింతగా చిక్కులు కలుగును. ఆరోగ్యం కూడ అంతంత మాత్రంగా నుండును. ఎన్నోవిధాల శ్రమపడినా, ఫలితం మాత్రం అతి తక్కువగా నుండును. అతి వ్యయప్రయాసలతో పనులు నెరవేరుతాయి. అనుకోనివిధంగా ధనవ్యయం జరుగును. మూడవ వారం నుండి విద్యార్థులు, ఉద్యోగులు మొ॥ అన్ని వర్గాలవారికి వారి వారి ప్రయత్నాలు అనుకూల ఫలితాన్ని ఇవ్వగలవు.

రోహిణి వారికి శారీరకశ్రమా, ఆందోళన, పనికిమాలిన ఆలోచనలతో గడచును. వక్ర శని ప్రభావంవలన చాల చిక్కులు వచ్చి పడగలవు. శుభకార్యముల గురించి అధికంగా ధనవ్యయం జరుగును. సంతానముయొక్క అభివృద్ధికి చాల వ్యయప్రయాసలు పొందవలసి వచ్చును. కాని ఫలితం మాత్రం సామాన్యంగా ఉండును. ఉద్యోగులకు, విద్యార్థులకు సామాన్యంగా ఉండును. ప్రతి విషయంలోనూ అధైర్యం, పిరికితనం హెచ్చుగా నుండును.

మృగశిర 1, 2 పా. వారికి 11వ తేదీవరకు శారీరక శ్రమ, అతి వేడిమి కలుగును. మనోవైకల్యం, ధనవ్యయం, చిక్కులు కలుగును. ఆరోగ్యభంగం, ధనానికి తొట్రుపాటు, ఆత్మీయులతో, సాటి వారితో మాటపట్టింపులు, తాత్కాలికంగా ఏర్పడిన శత్రువులవల్ల ఇబ్బందులు హెచ్చు అగును. పనికిమాలిన ఆలోచనలు, ఆందోళన కలుగును. అధికశ్రమ, అల్పఫలం కలుగును. గురునకు జపం చేయుట మంచిది.

### మిధునము (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3పా)

మృగశిర 3, 4 పా. వారికి 11వ తేదీవరకు మనశ్చాంచల్యముండును. చిరాకు, ప్రధమ కోపం హెచ్చు. భార్యావర్గం వారితో మాట పట్టింపులు వచ్చును. ప్రతి వ్యవహారములోను త్రిప్పట, ధనవ్యయం, ప్రయాస తప్పదు. విద్యార్థులు, ఉద్యోగులు, వర్తక, కర్షక, కార్మిక వర్గాలను కొంత సామాన్యంగా ఉండును. అయితే అవసరములకు తగినంత ధనము లభించుచు, చిన్న చిన్న కార్యములు నెరవేరిపోవుచుండును. కాని మనస్సునకు తగినంత ఉత్సాహముండదు.

ఆర్ద్రవారికి 14 23 తేదీలమధ్య ధనవ్యయం, సోదరులతో మాట పట్టింపులు, అభిప్రాయ భేదములు వచ్చును. వ్యాకులపాటు, అనుకొన్న పనులు సకాలంలో నెరవేరక వాయిదాపడుట, కుటుంబంలో కలతలు, నలతలు మొదలగు చిక్కు ఫలితములు కలుగును. నెల చివరనుండి అనుకూలఫలం కలుగును. అనుకూల వాతావరణ మేర్పడుతుంది. 10-20 తేదీలమధ్య హెచ్చు నలత కలుగును.

పునర్వసు 1, 2, 3 పా. వారికి 24-30 తేదీలమధ్య శారీరక, మానసిక శ్రమ కలిగినా, ఆరోగ్యం బాగుండును. కుటుంబంలో సుఖ

శాంతులు, శుభకార్యములలో పాల్గొనుట జరుగును. అన్ని విషయములలో అసంతృప్తి హెచ్చుగానుండును. శుభకార్యములకై ధనవ్యయం హెచ్చుగానుండును. విద్యార్థులకు, వర్తకులకు, ఉద్యోగులకు, శ్రమతో కూడిన అభివృద్ధి, లాభము కలుగును. మాటలు జరిగిన చిన్న చిన్న సంఘటనలకు మనఃక్లేశం, బంధుమిత్ర వ్యతిరేకత, ధనమునకు తాత్కాలిక ఇబ్బందులు కలుగును. వృత్తి వ్యాపారులకు సామాన్య స్థితి కలుగును.

## కర్కాటకము (పునర్వసు 4 పా. పుష్యమి ఆశ్లేష)

పునర్వసు 4 పా. వారికి తరచు ప్రయాణములు, శ్రమ కలిగినా, అన్ని విషయాలలో సౌభాగ్యంతోపాటు లాభము కలుగును. కళత్రబంధు సౌఖ్యం కలుగును. ధనము పనికిమాలిన ఖర్చుల క్రింద జరుగును. విద్యార్థులు, ఉద్యోగులకు, వర్తకులకు, కర్షక, శ్రామిక వర్గాలకు అన్నివిధాల బాగుగా నుండును. కాని శ్రమ హెచ్చుగా నుండును. అతి కష్టంమీద శ్రమకు తగిన ఫలితం కలుగును.

పుష్యమి వారికి 20 వ తేదీవరకు శరీరశ్రమా, ఉష్ణాధిక్యమూ, నలతా హెచ్చుగా ఉంటాయి. తరచు ప్రయాణాలవల్ల శ్రమ కలిగినా, పుణ్యకార్యములు నెరవేరుతాయి. శుభకార్యములలో పాల్గొనుట జరుగును. తలపెట్టిన పనులు సకాలంలో నెరవేరవు. విద్యార్థులకు సామాన్య ఫలం. కర్షకులకు, ఉద్యోగులకు బాగుగా కలసివచ్చును. కాని శ్రమా, ఖేదమూ, త్రిప్పటా, తప్పదు. ధనవ్యయం జరుగును. 20 వ తేదీవరకు ప్రతి ప్రయత్నమునకు ఆటంకము కలుగును.

ఆశ్లేషవారికి 20 వ తేదీ తర్వాతనుండి శారీరక మానసిక ఆందోళన, పిరికితనం కలిగినా, అన్నివిధాల లాభం కలసివచ్చి, సుఖ సంతోషాలు కలుగును. వివాహాది శుభకార్య ప్రయత్నాలు నెరవేరుతాయి. సంఘంలో మంచి పలుకుబడి, పేరు ప్రఖ్యాతులు బాగుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వ్యవసాయదార్లకు, రాజకీయవాదులకు మంచి యోగదాయకమైన కాలం. ధనలాభం బాగుండును.

## సింహం (మఘ, పుబ్బ, ఉత్తర 1 పా.)

మఘ వారికి నెలంతా ఆందోళన, పనికిమాలిన ఆలోచనలతో గడచును. ధనవ్యయం కలుగును. శుభకార్య ప్రయత్నాలు జరిగి వాయిదా పడును. పిరికితనం, పాపభీతి హెచ్చి మనఃఖేదమును కలిగించును. చిరాకు, కోపం, పట్టుదల హెచ్చును. భార్యకు ఆరోగ్య భంగమగును. లగ్జరీ ఖర్చులు పెరుగును. దెబ్బలు తగులుట, పడుట, ఏక్సిడెంట్సు మొ॥వాని వలన అనారోగ్యం కలుగును. రాబడికి మించి ఖర్చులు పెరుగును. 20 వ తేదీ తర్వాత కొంత మేలు.

పుబ్బవారికి ఈ రాశి వారందరికి మనస్సునకు ఆందోళనముండును. శుభాశుభ మిశ్రఫలం కలుగును. భార్యకు నలత, అనారోగ్యం చేసి నిమ్మళించును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు, కర్షకులకు అనుకూలంగా ఉండును. శుభకార్యముల మూలకంగా ధనవ్యయం కలిగినను, సువర్ణ వస్త్రాభరణప్రాప్తి, ధనసంపదల అభివృద్ధి కలుగును. కాని శరీరశ్రమ హెచ్చు, తరచు శుభకార్యములలో పాల్గొనుట జరుగును.

ఉత్తర 1 పా. వారికి నెలంతా అన్నివిధాల బాగుండును. ఆరోగ్యవృద్ధి, కార్య విజయం. ధనలాభము కలుగును. పదుగురిలో మంచి పలుకుబడి, తర్వాత నెల అంతయు అన్ని రంగాలలో వారికి కార్య విజయము, ధనలాభము, ఉద్యోగాభివృద్ధి. వ్యవసాయ వ్యాపారములలో మంచి లాభము కలుగును. మొత్తంమీద అధిక శుభయోగఫలం కలుగును.

## కన్య (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, 3, 4 పా. వారికి మొదటివారంలో భార్యకు నలత చేసి నిమ్మళించును. రెండవ భాగమునుండి బాగుగా నుండును. ధనవ్యయం కలుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు, కర్షక, శ్రామిక వర్గాలకు విజయము, అభివృద్ధి, లాభము మొదలగునవి కలుగును. శుభకార్యములలో పాల్గొనుట జరుగును. కుటుంబంలో సుఖ శాంతులు కలుగును. ధనాదాయం పెరుగును. దైవ, పుణ్యకార్యములలో పాల్గొనుట, శుభములలో పాల్గొనుట జరుగును.

హస్త వారికి శారీరకంగా, మానసికంగా శ్రమతో, ఆందోళనతో, ఖేదంతో, పనికిమాలిన ఆలోచనలతో గడచును. పిరికితనం హెచ్చుగా నుండును. కావలసినవారితోను, బంధుమిత్రులతోను, మాటపట్టింపులు, విరోధము శుభకార్యములకై ధనవ్యయం జరుగును. ఏ పని తలపెట్టినా సకాలంలో జరుగదు. ఆర్థికంగా బాగుగా కలసి వచ్చును. శుభకార్య ప్రయత్నాలు ఫలించినా వాయిదా పడును. శనికి జపశాంతులు చేయించుట మంచిది.

చిత్ర 1, 2 పా. వారికి నెలంతా నానావిధముల చిక్కులతోను, పనికిమాలిన ఆలోచనలతోను గడచును శ్రమ, ఖేదము, త్రిప్పట, ధనవ్యయం తప్పదు. మానసిక శ్రమ, అధిక ధనవ్యయం, కుటుంబంలో కలత నలతలు హెచ్చుగానుండును. చిన్న చిన్న ఏక్సిడెంట్సు జరుగవచ్చును. విద్యార్థులకు, ఉద్యోగులకు సామాన్యముగా నుండును. ధనాదాయం బాగుగా నుండును.

## తుల (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.

చిత్ర 3, 4 పా. వారికి 11 తేదీవరకు కుటుంబంలో చిక్కులు, భార్యకు నలతా, అనారోగ్యం, సోదరీ సోదర వర్గంతో విరోధం కల

గును. ధనమునకు తొట్రుపాటు, ధనవ్యయం, పనికిమాలిన ఆలోచనలు కలుగును. చేతికందిన ఫలితం చేయిజారిపోవును. కావలసినవారు నమ్మించి, ద్రోహము చేయుదురు. భార్యావర్గమువారితో మాట పట్టింపులు వచ్చును. నిందలు, అపవాదులు భరించవలసివచ్చును. ఏ విషయమందును ఉత్సాహముండదు. ఆలోచనలు హెచ్చు. విద్యార్థులకు, ఉద్యోగులకు లాభం కలుగును.

స్వాతి వారికి 22 తేదీవరకు శారీరకశ్రమా, ఖేదమూ, ధన వ్యయమూ కలుగును. మానసిక వ్యథ కలుగును. కొన్ని వారంలలో అనుకొన్న పనులు త్వరగా నెరవేరగలవు. కాని విశేషశ్రమ తప్పదు. అవసరములకు ధనము సమకూడి, గృహనిర్మాణం, వివాహాది శుభ కార్యములు నెరవేరును. విద్యార్థులకు, వర్తకులకు, ఉద్యోగులకు, అనుకూలమైన కాలం. కాని కుటుంబంలో అప్పుడప్పుడు అశాంతి కలుగును. అధికార్లు, పెద్దలయొక్క స్నేహము లభించి, చివరలో ధనలాభం కలుగును.

విశాఖ 1, 2, 3, పా. వారికి 24 వ తేదీవరకు ఆరోగ్యం, కార్యవిజయం, ధనలాభం, శుభకార్యములలో పాల్గొనుట, బంధుమిత్రుల రాకపోకలు, కుటుంబంలో సుఖశాంతులు కలుగును. అవసరములకు తగిన ధనం సమకూడి, ఏదోవిధంగా పబ్బం గడచిపోవును. చివరి వారంలో స్వల్పంగా అశాంతి, భార్యకు నలత కలుగును. అన్ని రంగములవారికి నానావిధ సుఖసంతోషాలతో, ధనలాభముతో, అభి వృద్ధితో గడచును. మానసికంగా కించిత్తు ఆందోళన కలిగినను, వ్యవహారములు సక్రమంగా జరిగిపోవుచుండును.

## వృశ్చికము (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4 పా. వారికి 24 వ తేదీనుండి కుటుంబంలో నలత, భార్యకు అనారోగ్యం, కుటుంబంలో నలత, కొంత ధనవ్యయం కూడ కలుగును. అయినను విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకులకు, రాజ కీయ వాదులకు పూర్తిగా కాకపోయినను కొంత అసంతృప్తిగానే ఫల ముండును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి బాగుండును. కాని బంధువులతో మాట పట్టింపులు వచ్చును. మొత్తంమీద శుభాశుభ మిశ్రమఫలం కలుగును.

అనూరాధ వారికి ఇంతవరకు పట్టి పీడిస్తున్న శని బాధ తొలగినట్లే. కాని 14 వ తేదీనుండి శరీరశ్రమ హెచ్చు. శరీరంలో నలత చేయును. ప్రతి విషయంలోను మొదట చిన్న చిన్న ఆటంక ములు కలిగి, తర్వాత ఫలించును. అవసరములకు తగిన ధనం సమకూడి పనులు నెరవేరిపోవును. వర్తకులకు, విద్యార్థులకు, ఉద్యోగు లకు అనుకూలఫలం కలుగును. శుభగ్రహానుకూలత కలుగును. ఇంతవరకు వాయిదా పడుచున్న పనులు, కార్యములు ఒకటొకటే ఫలించును.

జ్యేష్ఠ వారికి గతంకన్న శుభఫలం హెచ్చుగానే ఉండును. అన్ని కొన్న పనులన్నీ సక్రమంగా నెరవేరును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. కాని వారిని గురించి వ్యయం హెచ్చుగా జరు గును. డాక్టర్లు, లాయర్లు, ఉపాధ్యాయులు, వర్తకులు మొ॥వారందరికి వారి వారి రంగములలో రాణింపు బాగుగానుండి, విజయం, గౌరవం, సంఘంలో మంచి పలుకుబడి, గౌరవము కలుగును. శుభకార్యానుకూలత, బంధుమిత్ర సమాగమం, అన్నివిధాల ధనలాభం చేకూరును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

మూల వారికి శుభకార్య ప్రయత్నాలకు ఆటంకం కలుగును. ధనవ్యయం హెచ్చుగా నుండును. బంధుమిత్రులతో అభిప్రాయ భేద ములు కలుగును. కుటుంబంలో మనఃస్పర్థలు కలుగును. ప్రతి విషయంలోను ఆందోళన, పనికిమాలిన ఆలోచనలు, మనఃఖేదం, శ్రమ, త్రిప్పట, శరీరంలో నలత, హెచ్చుగా నుండును. తనకు సంబంధము లేని పనులలో తలదూర్చి బాధపడును. ధనవ్యయం అధికముగా జరుగును. శనికి జపం చేయుట మంచిది.

పూర్వాషాఢ వారికి శారీరక మానసిక శ్రమ, ధనవ్యయం, అధికంగా జరుగును. శుభకార్యాదులకై వ్యయం జరుగును. ఏవో పనికిమాలిన ఆలోచనలు, ఊహలు కలుగుచుండును. ధనం మాత్రం ఏదో రూపంలో వచ్చుచుండును. విద్యార్థులకు, ఉద్యోగులకు, వర్తకు లకు, రాజకీయవాదులకు అనుకూలమైన కాలము. అయినను సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి, విద్యలలో కృషి, రాణింపు జరుగును. దైవభక్తి, సత్కార్యాచరణము, సద్గోష్ఠి కలుగును.

ఉత్తరాషాఢ 1 పా. వారికి 13 వ తేదీవరకు శారీరకంగా శ్రమ కలుగును. ధనవ్యయం జరుగును. శుభకార్య ప్రయత్నములు నెర వేరును. కావలసినవారితోను, భార్యావర్గం వారితోను మాటపట్టింపులు, విరోధము కలుగుచుండును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. శుభాశుభ మిశ్రఫలం కలుగును. రాజకీయవాదులకు అతి శ్రమమీద పదవి కలుగును. అధికారుల మెప్పు కలిగి కొన్ని పనులు నెల చివరలో ఫలించును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4 పా. శ్రవణం, ధనిష్ట 1. 2 పా.)

ఉత్తరాషాఢ 2, 3, 4 పా. వారికి 11వ తేదీవరకు శరీరంలో నలత, శారీరకశ్రమ, ఖేదం, వ్యయం కలుగును. బంధుమిత్రాదుల మూలకంగా ధనవ్యయం కలుగును. అవసరములకు తగిన ధనం సమకూడును. ప్రయాణములు ఫలించును. సంసార కుటుంబ సుఖం కలుగును. ఉద్యోగ వ్యవహారములు అనుకూలంగా ఉండును. మొత్తం మీద నెలంతా బాగుగానే ఉండును. రాజకీయవాదులకు, విద్యార్థులకు, వర్తకులకును మేలు కలుగును.

శ్రవణం వారికి శరీర శ్రమ హెచ్చు. ఆందోళన, చిక్కులు, ధనవ్యయం కల్గును. బంధుమూలకంగా ధనవ్యయం కలుగును. పనికి మాలిన ఖర్చులు పెరుగును. పనికిమాలిన ఆలోచనలు అధికం. అహర్నిశలూ మానసికంగా ప్రతి విషయంలో అనుమానాలు, ఎదుటి వారి మీద అకారణముగా ద్వేషం పెంచుకొనుట, ఎదుటివారిచే మాట పడి, తనలో బాధపడుట జరుగును. వృత్తిధర్మంచేత త్రిప్పట, జరుగును. శనికి జపం చేయుట మంచిది. అనుదిన ఖర్చు వచ్చాలకు లోపం కలగదు.

ధనిష్ట 1, 2 పా. వారికి 20 వ తేదీవరకు శ్రమ, ఖేదము, త్రిప్పట, ఉష్ణాధిక్యము కలుగును. సోదరులతో మాట పట్టింపులు, బంధువులతో విరోధము కలుగును. శుభకార్య ప్రయత్నాలన్నీ శ్రమ మీద నెరవేరును. చిరాకు, మూర్ఖత్వం, పట్టుదల హెచ్చును. రాజకీయంగా పలుకుబడి పెరుగును. విద్యార్థులకు, ఉద్యోగులకు. వర్తకులకు కొంత బాగుగానుండును. అధికశ్రమ, అల్పఫలం కలుగును.

**కుంభం** (ధనిష్ట 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా.)

ధనిష్ట 3, 4 పా. వారికి శుభఫలాలు కలిగినను, 20వ తేదీ వరకు ఉష్ణాధిక్యము, శరీరశ్రమ, ఖేదము కలుగును. ఆందోళనము, చిన్న చిన్న దెబ్బలు తగులుట, ఏక్సిడెంట్సు వలన అనారోగ్యం కలుగును. ధనవ్యయం హెచ్చుగానుండును. విద్యార్థులకు, వర్తకులకు కొంత సామాన్యంగాను, ఆ పిమ్మట విశేషంగా లాభము కలుగును. కర్షకులకు మేలు కలుగును. గురు కుజులకు జపం చేయించుట మంచిది.

శతభిషం వారికి 13 వ తేదీవరకు శారీరకశ్రమ కలిగినను, ఆరోగ్యం, ధనభాగ్యాదిలాభం, సువర్ణాభరణ ప్రాప్తి కలుగును. అన్ని రంగములలోను, అన్ని వర్గములవారికి లాభదాయకంగాను, శుభప్రదంగానుండును. మనస్సునకు సజ్జన సహవాసం వలన శాంతి కలుగును. ధనం బాగుగా కలసివచ్చును. వృత్తి వ్యాపారాదుల్లో ఆర్థిక లాభం, పదుగురికి ఉపకారం చేసే అవకాశం కలుగును.

పూర్వాభాద్ర 1, 2, 3 పా. వారికి శరీరశ్రమ హెచ్చు త్రిప్పట, అలసట ఉండును. లగ్జరీ ఖర్చులు పెరుగును. దర్పౌదార్యం, ఆడంబరం మొ॥వానికి అవసరంలేని ఖర్చులు పెరుగును. అట్టి ఖర్చులవల్ల విచారంగాని, బాధగాని కలుగవు. విద్యార్థులకు పరీక్షలలో ఉత్తీర్ణత కలుగును. ఉద్యోగులకు, వర్తకులకు మంచి కాలము. శుభకార్య ప్రయత్నములు విశేషశ్రమ లేకుండగనే ఫలించును.

**మీనము** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4 పా. 14వ తేదీవరకు శరీరశ్రమ హెచ్చుగా నుండును. భార్యకు అనారోగ్యం కలుగును. ధనవ్యయం జరుగును. ఆర్థికంగా తొట్రుపాటు కలుగును. విద్యార్థులకు విద్యలలో అనుకూలత, ఉద్యోగులకు ఉద్యోగాభివృద్ధి, వర్తకులకు విశేషలాభం, కర్షకులకు మేలు కలుగును. శ్రమ హెచ్చు. ఫలితం తక్కువ. రాజకీయంగా పలుకుబడి పెరుగును. సత్‌వ్యయం జరుగును.

ఉత్తరాభాద్ర వారికి 20 తేదీవరకు శుభాశుభ మిశ్రఫలం కలుగును. శరీరంలో శ్రమా, ఖేదమూ, త్రిప్పటా, వ్యయప్రయాసలు కలుగును. ధనవ్యయం హెచ్చుగానుండును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. వర్తకులకు, ఉద్యోగులకు మాత్రం సుఖ సంతోషాలు, లాభము కలుగును. నూతన వస్తులాభం, సువర్ణాది లాభం, భూ గృహాది సంపాదనము జరుగును.

రేవతి వారికి ఉత్సాహం, ధైర్యం, ధనలాభము, కుటుంబంలో సుఖశాంతులు, మాటపలుకుబడి, గౌరవం బాగుగానుండును. శుభకార్యముల నిమిత్తం వ్యయం జరుగును. విద్యార్థులకు, ఉన్నతశ్రేణి, విజయం కలుగును, డాక్టర్లకు, లాయర్లకు, రాజకీయవాదులకు, హెచ్చుగా సుఖసంతోషాలు కలుగును. శుభకార్యములు నెరవేరి స్థిరాస్తి సంపాదన చేయుట జరుగును. ఈ రాశి వారందరికి ఈ నెల చాల అనుకూలంగా ఉండును.

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**

# శ్రీనివాస ప్రబంధం

గానట బీసటే చదివీ
గాధల్ని త్రవ్వుతూ
చీకట్లో తూగుతున్న
నా ఒద్దకు
"అగ్ని కిరీటపు ధగధగలతో"
"ఎర్రబావుటా నిగనిగలతో"
వికసించిన
"ఓ విద్యుత్తేజం"
వచ్చి
తట్టి లేపింది !
"బుగులుకొనే బుక్కా గుండాను చల్లి"
"వ్యాకరణాల సంకెళ్ళనుండి"
"ఛందస్సుల సర్ప పరిష్వంగాలనుండి"
నన్ను
విడిపించింది!
"నిద్దురమత్తుని వదలించే"
"పరిపూర్ణపు బ్రదుకిచ్చే"
నవకవన మాహాత్మ్యాన్ని గురించి తెలిపింది!
"కుక్క పిల్లా"
"అగ్గిపుల్లా"
"సబ్బు బిళ్ళా"
"అన్నీ కవితామయమేనోయ్"
"హీనంగా చూడకు దేన్నీ"
అని బోధ చేసింది
"మందారపువన్నెల ఇనోదయపు మహిమను"
"రెక్కవిప్పే రివల్యూషన్ విలువను"
విస్తరించి చెప్పింది!
నా హృదయంలో వాటిని
నిలువబెట్టింది!
నన్నో
"శివ సముద్రంగా"
"నయాగరాగా"
కెరలింప జేసింది!
"రసధుని! మణిఖని"
అది!
దాని గొప్పతనం
"అపరిమితం! అనుపమితం!

# నీ చూపుల బాణాలే ప్రియా !

మిన్ను మన్నులలోని
నక్షత్రగణం మొదలుకొని
గండుతుమ్మెదల గుంపువరకూ
సమస్త వస్తువుల్ని
ప్రాణుల్ని
హీనపరుస్తూ
వాటిని
నా నఖశిఖ పర్యంతం
అవయవాలకు
దిగదుడుపు గావిస్తూ
బానిసల్ని చేస్తూ
నాకు రెట్టింపు అందచందాల్ని
సమకూరుస్తున్నాయి!
నీ ప్రణయంలోని తియ్యదనాన్ని
రుచి చూపిస్తున్నాయి!
నీ పరాక్రమంలోని గట్టిదనాన్ని
చాటుతున్నాయి!
'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' అని
ప్రకటిస్తున్నాయి!
"........................!"

శ్రీ కె. కిశోరుబాబు
శ్రీ కె. అశోకుబాబు

శ్రీ పైల కృష్ణారావు

# దాశరథి కవితా విశ్వరూపం తిమిరంతో సమరం

దాశరథి మొదటి నుంచి ప్రజలనూ, దేశాన్నీ జాతీయోద్యమాన్నీ అంటి పెట్టుకుని కలాన్ని నడిపించిన వీరరచయిత. ఆయన జీవితమే పోరాటం. ఆయన కవిత్వం ఆయన జీవిత సంగ్రామానికి ప్రతిధ్వని. స్వాతంత్ర్యోద్యమంలోనూ, నిజాంకు వ్యతిరేకంగానూ, తెలుగువారి సమైక్యతకు గాను, చైనా, పాకిస్తాన్ దాడుల సందర్భంగానూ, స్వతంత్ర భారతంలో విచ్ఛిన్నకర శక్తులతోనూ అభివృద్ధి నిరోధకులతోనూ పోరాటం సాగించారు. భారత ప్రధానిచే తామ్రపత్ర సన్మానం అందుకున్న స్వాతంత్ర్య సమర యోధులు. పవిత్రమైన దేశభక్తులు. రాష్ట్రంలోనూ, కేంద్రంలోనూ అనేక గౌరవ సన్మానాలందుకున్న ప్రతిభా వంతులు. విదేశాలలో పర్యటించి ఖండాంతర తెలుగు ప్రజలకు వారధిగా నిలచినవారు.

హంతలు, నియంతలు ప్రపంచంలో ఎక్కడ ఉన్నా తన కవితా కత్తివాదరకు గురిచేశారు దాశరధి. ఏ దేశంలోనైనా రాచరికం, నియంతృత్వం అంతమై ప్రజాస్వామ్య శక్తులకు విజయం లభించినపుడు ఆయన కలం పురివిప్పి నాట్యం చేస్తుంది. విశ్వంలో వర్తమాన పరిస్థితి చూసి

"మానవత్వం గెలుస్తున్నది
దానవత్వం ఓడుతున్నది
అవనిలో హృదయాలలో గల
అంధకారం పీడుతున్నది" అని అంటారు. ప్రపంచంలో వర్గభేదం, వర్ణభేదం, మతోన్మాదం, ధనికవాదం పై ఆయన కలం స్పందించి అనేక రచనలు చేశారు. ఇవన్నీ అంతరిస్తేనే గాని తన తిమిరంతో సమరం అంతం కాదని ఈ సమరంలో పాఠకులంతా పాల్గొనాలని కోరుకుంటారు.

దాశరథి ప్రకటించిన కవితా సంపుటాలలో "తిమిరంతో సమరం" కలికితురాయి. ఈ కృతిని తన మాతృమూర్తికి అంకితమిస్తూ

"నను కని పెంచి సారుధిర నాళములన్ కవితామరంద వాహిని ప్రవహింప జేసి రసహీన మనోమరుభూమి పంద నందనములు నాటినట్టి కరుణామయి ఏ గగనాల నున్నదో
అనవరతానురాగమతి అమ్మకు ఈ కృతి అంకితంబగున్" అని తన ప్రగాఢ మాతృభక్తిని ప్రకటించారు. "అమ్మ మనసులా అనాథలను చూసి చెమ్మగిల్లునది" అని మాతృమూర్తి సహజమైన ఆర్ద్రతను మరోచోట కూడా ప్రస్తావిస్తారు.

జీవితమంతా ఊయెల లూపే కవితతో కైపెక్కిన కవి దాశరథి. ఆయన త్రికరణశుద్ధిగా కవి. మనసులో ఉన్నదే చెప్పారు. చెప్పిందే చేశారు. చెప్పిన తరువాత అంతటితో తన పని అయిపోయిందని సరిపెట్టుకోలేదు. తను చెప్పిన ప్రతిమాటా వ్రాశారు. వ్రాసిన ప్రతి భావాన్నీ జీవితానికి అన్వయించి చూపారు. స్వయంగా ఉద్యమాలలోనూ, పోరాటాలలోనూ, పాల్గొన్నవారు కావడంచేతనే తన మాటలు ఈటెలయ్యాయి. భావాలు బాణాలయ్యాయి. ఆయన కవిత్వం ప్రత్యక్ష పురాణమయ్యింది. అందువల్లనే ప్రతి రచనలోనూ తెలుగు 'వాడి'దనం కన్పిస్తుంది.

"తెలంగాణ రైతుదే ముసలి నక్కకు రాచరికమ్ము దక్కునే"
"మా నిజాంరాజు జన్మజన్మాల బూజు"

"నా తెలంగాణ కోటి రతనాల వీణ" అని తెలంగాణ చైతన్య ప్రదీప్తిని కోటి కిరణాలతో వెలయించినవారు దాశరథి.

"నా పేరు ప్రజాకోటి - నా ఊరు ప్రజావాటి" అనినట్టి సువిశాల భావుకులు, "రాక్షసినైనా మైత్రికి రానిత్తును భయం లేదు" అనగల స్నేహశీలి.

ఈ సంపుటిలో దాశరథి కవితా ధర్మ హర్మ్యానికి కాంతి కవాటం తెరిచారు విద్వాన్ విశ్వం గారు. విశ్వం గారన్నట్లు కవిత్వమంటేనే తిమిరంతో సమరం 'తమసోమా జ్యోతిర్గమయ' అనే ఉపనిషద్వాక్యానికి సాభిప్రాయం. తిమిరంతో సమరం. మొదటిది ఉపదేశప్రాయమైన సత్యం. రెండవది కార్యాచరణ రూపమైన సత్యం. మొదటిది ఆశయం. రెండవది ఆచరణ.

"ఆత్మప్రాసమీద ఒత్తు మనసుల నటులాగి రసపార పశ్యాసికి భంజక మౌతుందని; భావాలు, పదాలు కలిసి ఓ రసధునిని

ప్రబద్ధం చేయాలని" కవిత్వానికి సంబంధించి విశ్వం గారిచ్చిన కితాబు అక్షర సత్యం.

"అనాదిగా సాగుతోంది అనంత సంగ్రామం. మూఢత్వానికి, మూర్ఖత్వానికి తిరోగమనానికి ప్రతీక తిమిరం. ఈ తిమిరంతో సమరం చేసిన కవి దాశరథి. ఇది విజ్ఞానానికీ, అజ్ఞానానికీ అన్యాయానికీ, నీతికీ అవినీతికీ; విద్యకూ అవిద్యకూ మధ్యజరిగిన సమరం. అన్యాయాన్నీ, అక్రమాన్నీ ఎక్కడ ఎవ్వరు ఎదిరించినా వారిని బల పరుస్తానని ధైర్యంగా చెప్పిన కవియోధులు దాశరథి.

ఈ కవితా సంపుటిలో 47 కావ్య ఖండికలున్నాయి. ఇందులో బాలమయూఖ విజయం, చిరంజీవి శ్రీ నెహ్రూ, మధులహరి, సూక్తి ముక్తకాలు, గుండెలో కోటి దీపాలు, నటశ్రీ, ధీరమూర్తులు పద్య ఖండికలు. మిగిలినవి గేయ కవితలు. ధీరమూర్తులు వంగ అనువాదము. ఈ సంపుటిలో 'రావమ్మా శాంతమ్మా' అని ప్రారంభ కవిత మూలంగా కవిలో రక్తదప్పమైన శాంతికే ప్రాధాన్యమిస్తూ 'తిమిరంతో సమరం' అనే ముగింపు కవితతో కవి తన లక్ష్య సాధనకు చివరికి విప్లవగమ్యాన్నే నిర్దేశిస్తూన్నట్లు ధ్వన్యాత్మకంగా కూర్చారు.

ఈ గ్రంథమంతా దాశరథి అపారమైన దేశభక్తి, ఎల్లలులేని విశ్వమానతా వాదం, అచంచలమైన ఆత్మ విశ్వాసం, కండకల గుండెనిబ్బరం ద్యోతక మౌతాయి. అన్నిటిని మించి వారి హృదయ స్పందనను ఆచీతూచే జీవనాడియైన సమరశీల దృక్పథం గ్రంథ మంతా ప్రకాశమానమౌతుంది. ముఖ్యంగా తెలుగువారి వేర్పాటు వాదనలకు వారి గుండెలోంచి వెల్లువలా ఉప్పొంగే ఆవేదనను, సమ గ్రాంధ్ర సమైక్యతను చూశాక కలిగే హర్షాన్ని హృదయంగమంగా అభివర్ణించారు. ఒకరి రెండు పట్టులందే కాదు. అదను వచ్చినప్పు డల్లా రాష్ట్రకీర్తిగానాన్నీ, దేశభక్తి సంకీర్తననీ, దేశనాయకుల స్తుతినీ, విప్లవవీరుల చైతన్యాన్నీ, ప్రపంచ మానవకళ్యాణాన్నీ ఆకాశానికెత్తు తూనే ఉంటారు.

ఈ కావ్యంలో బానిసత్వం, మూర్ఖత్వం, నల్లడబ్బు, అజ్ఞానం, అధికారమదాంధకారం, ప్రాంతీయ తత్వం, రాచరికం, దౌర్జన్యం, నియంతృత్వం, అన్యాయం, అక్రమం, జరత్వం భాషా దురభిమానం లను నిరసించడం; విశ్వమానవ ప్రేమ, విశ్వశాంతి, అహింసా ప్రియత్వం, వసుధైక కుటుంబం, సమసమాజ, స్వాతంత్రియం, ప్రజాస్వామ్యం, సౌజన్యంలను కీర్తించడం కన్పిస్తుంది. అయితే ఈ భావాలన్నీ గతానుగతికంగా వస్తున్నవే ఐనా తనదైన బాణితో, వాణితో ఆధునిక పరిస్థితుల కన్వయిస్తూ వర్తమాన రాజ్యాలలోని సంఘటనలను విశ్లేషిస్తూ సంకుచిత పరిధుల్నిదాటి విశ్వజనీన దృక్పథంతో ఆయన కవితా విశ్వరూపం మనకు దర్శనమిస్తుంది

వాల్మీకి "మానిషాద ప్రతిష్ఠాం త్వం అగమః శాశ్వతీ సమాః యత్క్రౌంచ మిధునా దేక మవధీ కామ మోహితం" అనే శ్లోకంలోని కరుణాక్రోధమే దాశరథిగారి 'తిమిరంతో సమరం'లోనూ ఉంది. లోకం శోకంతో కూడిన తాదాత్మ్యమే ఇందులోనూ ఉంది. దాశరథి చేసే సమరం నైతికసమరం. ప్రయోగించిన ఆయుధం వజ్రాయుధ సదృశమైన కలం. ఎక్కడ అన్యాయం జరిగినా ఆయన కలం విల్లు క్రోధావేశంతో రక్తాక్షరాలు కురిపిస్తుంది.

పాకిస్తాన్ దాడిని ప్రతిఘటించే సందర్భంలో పెన్నుపట్టిన చేతితో గన్ను పట్టించిన ఈ హింసాఖగ్రత్తును ద్వేషిస్తారు. కురుక్షేత్ర సంగ్రామంలో విషాదయోగం తరువాత విజృంభించిన విజయుడిలా శత్రు నాశనానికి పెన్ను జేబులోపెట్టి గన్ను చేబట్టానని శాంతికాముకులైన భారతీయులకు పాకిస్తాన్‌తో యుద్ధం చేయక తప్పనిసరి పరిస్థితిని సమర్థించారు.

"తెల్లని మంచుకొండ పాదాలమీద ఎర్రని రుధిరాం పారాణి దిద్దడానికి నీలిమేఘాల చికురాలు ర్వాలే నింగిపాలాన కుంకుమ అద్దటానికి గన్నుతో సన్నాయి పాడడానికి స్వాతంత్ర్య కన్యాపాణి గ్రహణానికి వెళుతున్నాను సైనికుణ్ణి"

అని భారత ప్రతిఘటనను బలపరిచే చరణాలు హైందవాచారాల సమన్వయంతో కవితామృతాభిషేకాన్ని పొందినట్టివి. ఇక్కడ సూక్ష్మంగా గ్రహించాల్సిన విషయం దాశరథి శాంతిప్రియుడే గాని శాంతిపేరిట బానిసత్వానికి, అరాచకానికి ఎంతమాత్రం తల వొగ్గరనే విషయం. స్వాతంత్ర్యం ఆయన నర నరాలలోనూ, కణకణాలలోనూ సంలీనమై పోయింది. శాంతి, స్వేచ్ఛ ఆయన కవితారథానికి రెండు చక్రాలు. ఈ విషయం కావ్యమంతటా మనం గమనించగలం.

ప్రపంచాన్నే జయించాలనుకున్న విషపాతకుడు పరమ కిరాతకుడైన హిట్లర్‌తో యాహ్యాఖాన్‌ను పోల్చారు. "పెక్కు తలల రక్కసి ఒక్క తల మానిసికి ఓడిపోతాడు" అని రావణకథను గూర్చి ధ్వన్యాత్మకంగా చెప్పారు. "అరుణోదయం ఆలింగనం చేసుకుంది తూర్పును. ఆరాటపడుతున్న అవని ఆహ్వానిస్తోంది మార్పును" అని బాంగ్లాదేశ్ ప్రజలను భుజం తట్టారు. అమాయకుల రక్తధార అధికారుల గళాలపై వజ్రధారగా మారుతుందని భారతదేశ విజయానికి బాంగ్లాదేశ్ ఉదయానికి అసువు లర్పించిన అమరవీరులను తన కలంతో సలాం చేశారు. ప్రజాస్వామ్యం కోసం పోరాడిన ముజిబుర్ రెహమాన్‌కు జిందాబాద్ అని బాంగ్లాదేశ్ ఉద్యమాన్ని సమర్థిస్తారు.

'బాలమయూఖ విజయం' లో పాకిస్తాన్‌ని గూర్చి

"గదతో భానుమయూఖముల్ విరుగునా? ఖడ్గమ్ముతో శ్వేత వీ రదముల్ వ్రయ్యలు సేయగా బడునొకో? రంపాన ప్రత్యూష వా

యుదుకూలమ్ములు ముక్కలై విడునొకో? ఉన్మాది వాక్యమ్ములన్
మృధు కావ్యత్వము కానవచ్చునొకొ? యెంతే వ్యాఖ్య గావించినన్''
అని వారు ప్రశ్నించిన తీరు జిజ్ఞాసతో కూడుకున్నది. షాక్ వైఫల్యాన్ని సూర్య కిరణాలతో మిణుగుర్లా; రామబాణానికి గురియైన రావణునిలా సంప్రదాయ కవిసమయాలతో చెప్పారు. బాంగ్లాదేశ్ విజయానికి ముందు ముక్తి వాహినీ సైనికులను ఉత్తేజపరిచే గీతాలు పాడుతూ పాకిస్తాన్ సేనలతో పోరాడుతూ ప్రాణాలర్పించిన వీర గాయని షహిహా నుద్దేశించి "నీ గళమే రుద్రవీణ, నీ గానం అగ్నిసోన. ముక్తి వాహినీ రసాలమున కోకిల గాయనివే. వంగభూమిలో పారిన గంగాప్రియవాహినివే'' అంటూ ఆమె పవిత్రతను గంగాజలంగా ధ్వనింపజేశారు. ఆమె పాట ఈతెగ అభివర్ణించారు. ఎక్కడ దేశభక్తి జ్వాలలు రగిలితే అక్కడ గుండెలు పిరాణనంగా అర్పించగల స్వేచ్ఛాప్రియులు.

దీపావళి సందర్భంగా వ్రాసిన కవితలో మానవుడు దివ్వెల్ని మలిపి, తిమిరాన్ని ఊసుగొలిపి సహబమరణాన్ని హింసాపాశాలు కట్టి ఇప్పుడే ఈడ్చుకు వస్తున్నందుకు ఈసడిస్తూ, ప్రణయరంగమైన ధరణి రణరంగంగా మార్చినందుకు బ్రతుకను సింహాసనమున మృతిని కూర్చుండబెట్టినందుకు, రంబలుండగల మేడల బాంబులతో నింపినందుకు నరుడే నరకాసురుడని కలత చెందారు.

"మధువులు పారేచోట రుధిరాలను ధారవోసి
కవితలు వికసించుచోట కత్తులతో ...లు నాటి
నాకం వంటి ధరిత్రిని నరకం చేశాడు మనిషి'' అని

నిస్పృహ చెందారు. ఈ చీకటి విహ్వలధాత్రిని అతివేలంగా వర్ణించారు. దీపాలను హింసపై కోపాలుగను, కాంతికిరణాలుగను, శాంతిసుమాలుగను అతి నవ్యంగా ఉపమించారు.

దాశరథి వియత్నాంలో ఎడాపెడా తన్నులు తినే వీథి మానిసిపై జాలి కలవారు, నైలునదీ బాలురను 'దోస్తో' అని పిలువగలవారు, నల్లవాణ్ణి హత్యచేసే తెల్లవాణ్ణి తన కవితాస్త్రానికి గురి చేయగలవారు. విశ్వంలోని అశాంతినీ, అరాచకాన్నీ, హింసనూ ప్రేరేపించే మనస్సులోని విషవలయాలను తన కలంతో దండించారు. లోకంలోని జుగుప్సను, క్రౌర్యాన్ని, బీభత్సాన్ని, నైచ్యాన్ని నిర్మూలించమని మన కర్తవ్యాన్ని నిర్దేశించారు.

తెలుగు పరువు నిలపడం కోసం ఆంధ్రమాతకు ఆయన కూర్చిన అక్షర నక్షత్రమాలిక ఏనాటికీ వాడనిది. గోదావరి నురుగులలో, కృష్ణవేణి పరుగులలో, తుంగభద్ర తరగలలో మంజీర మెరుగులలో ప్రతిబింబిస్తూనే వుంటుంది. ఆంధ్రమాతను షోడశవర్ణ కళా మహాంధ్ర చంద్రబింబంగా, అస్తవ్యస్త సామాజిక వ్యవస్థా జలధిలో సమవాద దీపస్తంభంగా అభివర్ణించడంలో ఆయన కవితాపాటవం అభివ్యక్తమౌతుంది. ఆంధ్రమాతను ఎంతగా కీర్తిస్తారో, భరతమాతను, జగన్మాతను అంతగానే కొనియాడారు. ప్రాంతీయంగా, జాతీయంగా, అంతర్జాతీయంగా సాగుతూన్న ఉగ్రవాద బాధలను గూర్చి వ్రాస్తూ

"చంపి సంపెంగలు పరిమళాలు నింపుతాయంటున్నాయి దుర్విషప
భుజంగాలు
చంపితే శవాల కంపు తప్ప సంపెంగలు నింపలేరంటున్నాయి
ప్రశాంత తురంగాలు''

అని ఉగ్రవాద, అహింసావాద తత్వాలను సహేతుకంగా విశదీకరించారు. "కుళ్ళుపెదల ముళ్ళపొదల ముల్లులు మధురించాలి. విషనాగుల కోరలలో రసధారలు ఊరాలి'' అని ఆకాంక్షించారు. పని ఒక కళగా విశ్వసించినవారు గనుక పని విలువే పెరగాలని, మనీ విలువ తరగాలని కోరుకున్నారు. పనికి విలువ ఇవ్వని విధినైనా, నిధినైనా, అధికారాన్నైనా నిరసించారు "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన' అని గదా గీతా ప్రవచనం.

ఈ కావ్యంలో దాశరథి కవిత పందొమ్మిదివందల నలభై ఐదు రుచి అద్దింది. అణువులో అఖిల జగాన్ని చూడగల నిశితత్వం ఆయన నయనాల కబ్బింది. ఆయన భావనా విహంగాలు కోటి స్వర్గాలనందుతున్నాయి. రుద్రవీణా గాయికలు ఆయన కావ్యనాయికలు అయ్యారు. వాడిన వసంతవాటిక మరల పల్లవిస్తుందని నమ్మిన ఆశాజీవి. ఈయన కవితలో మరో విశిష్ట గుణం ఏ అంశాన్నైనా సంక్షిప్త పద చిత్రాలతో ముగించక పతితలను ఆకట్టుకునేందుకు ఆయా అంశాలను వర్ణనాత్మకంగా క్రమ విశ్లేషణ చేయడం.

ఈ కావ్యంలో శాంతిదేవి ఆగమనాన్ని అభ్యర్థించే ఖండిక ఒక్కటి చాలు దాశరథిని ఖండాంతర కవులమధ్య పీఠం వేయడానికి. అందులో ఆయన మహోన్నత భావనా విహంగం స్వదేశీ ఎల్లలు దాటి విశ్వాంతరాలంలోకి రెక్కలు చాచుకుని ఎగిరింది. "ఇరవయ్యవ శతాబ్దంలో ఇంచుమించు ముప్పాతిక గడిచిపోతున్నా పుచ్చిపోయిన కులాలతో, చచ్చిపోయిన మతాలతో తన్నుకు చచ్చే మమ్మల్ని చూచి ఖిన్నవై ఎన్నడూ రాననకోకు'' అని శాంతిదేవిని మారాం చేస్తారు.'' "మూర్ఖుల దుశ్చర్యలకు, నీచుల క్రౌర్యానికి భయపడి రానవకు. నీవు రానన్నా నేను ఒప్పుకోను. నిన్ను అణువు అణువునా చూస్తాను. నిన్ను మా యింటికి తీసుకుని వస్తాను'' అని భరోసా యిస్తారు. ఇక్కడ ఇల్లు అనేది ధ్వన్యాత్మకంగా ప్రపంచమే. నిజమైన కవికి విశ్వమే గృహము.

"నీవు రావని అబద్ధాలాడిన ప్రమోదుకు ప్రౌఢాంగనా పాద తాడనంతో దోహదం చేయించి పూలు పూయించి నీవున్నావనిపిస్తాను.''

అనేచోట దాశరథిలోని ప్రబంధ సాహితీపాటవం స్ఫురిస్తుంది. దోహద క్రియలలో పాదతాడన మొకటి గదా! "శాంతి లేదనేవారికి తన హృదయ కమలం చూపిస్తూనూ, శాంతి రాదనే రాతిని నాతిగా నాట్య మాడిస్తూనూ "శాంతి ఉందనిపిస్తానని చెబుతాను" పూలు పూచేంత సహజంగా, వెలుగు వచ్చేంత ఋజుమార్గంలో జనం బ్రతకాలి. బ్రతికి తీరాలి" అనగల స్వచ్ఛ మనస్కులు.

శాంతి ఉనికిని చెబుతూ "కౌగిలించుకున్న హృదయాలలో, కాంతినించుకున్న వదనాలలో, నవ్వులు పంచుకున్న నయనాలలో, కల్లా కపటం ఎరుగని పిల్లవాళ్ళ ఉల్లంలో, సింధువులు ఇముడ్చుకునే గాంధీజీ అడుగుల్లో, కత్తులను తుత్తునియలు చేసే కవీశ్వరుల కలం ముక్కులో, దేశం కోసం బలియైన అనామకుల ఆత్మలలో, చివరకు విధ్వంసన కారకుడైన శాస్త్రజ్ఞునిలోనూ నీవుంటావని తెలుసు నాకు" అని అంటారు. "బలాఢ్యులను ఎదిరించే బక్కవాని పట్టుదలతో శాంతి ఉంటుంద"నడంలో విప్లవాంతర్భాగమై ఉండేది శాంతియేనని ధ్వనింపజేశారు.

"రసాల రసపయోధివై, సుధామధుర పయోదమై, విరుల పెనుతుఫానువై, ప్రణయ నవకృశానువై, ఉర్వినిండా నిండిపో" అని శాంతిదేవిని అభ్యర్థించడంలో కవి భావుకతా స్రోతస్విని కట్టలు త్రెంచుకుని ప్రవహించింది. వారి భావోద్వేగం, పదునైన నుడికారం సంయమనం చెంది కవితను రసాప్లావితం చేశాయి.

నయనానందకరమైన నాగార్జునసాగరాన్ని వర్ణిస్తూ కృష్ణనాపి నిరుపేదల తృష్ణ బాపినట్టివారు విష్ణువుకంటే ఘనులంటారు. ఇది అలంకార ప్రీతితో వ్రాసినది మాత్రమే కాదు' గంగ విష్ణుమూర్తి పాదంనుండి ఉద్భవించినట్లుగా గదా సంప్రదాయం. ఆ ఆనకట్ట నిర్మాణాన్ని గూర్చి చెబుతూ జీవితంలోంచి కడగండ్లను దిగమ్రింగడం లోని క్షమను ధ్వనింపజేస్తూ

"తరచినప్పుడు అమృతధార తరలివచ్చునోయి
విషము మ్రింగ గలుగువాడె విశ్వేశ్వరుడోయి" అని

అంటారు. ఆ సాగరతీరంలో 'నాగార్జునుని చిరునవ్వులు నాట్యమాడ గలవని' చక్కని భావచిత్రం వేశారు. ఈయన మాటబొమ్మలు అనల్ప శిల్పశోభను ప్రదర్శిస్తూ సాహిత్య కళాలక్ష్మికి అలంకరిస్తుంటాయి. ఆంధ్రదేశంలో నవచరితకు నాందియైన నాగార్జున సాగరాన్ని క్షీర సాగరంతో పోల్చారు.

పురాణాలలోను, ప్రబంధాలలోను బాలేందు వక్రాలుగా, అనురాగ చక్రాలుగ, నక్షత్రాలుగ ఉపమింపబడిన పలాశ కుసుమాలకు శుక చంచువులు, కాషాయ చేలాంచలాలుగ పోల్చబడిన పలాశ ప్రసవాలకు కొత్త కవి సమయాలలో చెప్పారు. అవి ఈనాడు నియంతల దురంతాలకు బలియైన మహావీరుల గుండెలుగ యోధుల నరాలలో పరువెత్తిన త్యాగరుధిర నదీజలాల తరగలుగ, స్వాతంత్ర్య దాహగ్రస్తుల నిస్తుల మస్తిష్కాలలోని ఘంటల మారురూపాలుగ, క్రాంతిదీపాలుగ ఆయనకు కన్పించడంలో నవ్యత్వం చోటుచేసుకుంది.

మన ప్రాచీనాలంకారికులు చెప్పినట్టు దాశరథి విలక్షణమైన వ్యుత్పత్తి గల కవి. నవనవోన్మేషమైన ప్రతిభ గల కవి. కంద గల సంప్రదాయ పటిమ, గుండెలోంచి దూసుకురాగల అధునాతన భావోద్వేగము ఈ రెండింటినీ నిగ్రహించి సమన్వయించగల కవితాశిల్పమూ కలిగి ఉండడంచేత ఈ మూడూ ఆయన కవిత్వంలో త్రివేణీ సంగమంగా కలగలసి గొప్ప సౌందర్యాన్ని సంతరించుకున్నాయి. ఇందువల్లనే ఆయన ప్రతి కవిత అనల్ప శిల్ప సాలభంజికయై మన ముందు సాక్షాత్కరిస్తుంది.

ఆంధ్రదేశంలో ప్రాంతీయ వేర్పాటు వాదనల్ని నిరసిస్తూ 'అన్నదమ్ములు పోట్లాడి అమ్మను నరకడం తగద'ంటారు. 'నాడు అనుజుడు విడిపోతానంటే నేడు అగ్రజుడు వెళిపోతానంటే తగదంటు న్నది తమను గన్నతల్లి, ఆంధ్రమాత అమృతవల్లి. కుడికంటిని ఎడమ కన్ను పొడిచేనా? కుడిచేతిని ఎడమచేయి నరికేనా? ఒక దేహం ఒక గేహం మరిచావా?' అని తెలంగాణా, ఆంధ్ర ప్రాంతీయులైన తెలుగు వారికి ఒక్క తెలుగు ఒక్క వెలుగు కోసం ఉద్బోధిస్తారు. 'వలపుతో మనవలసిన జాతి కలతలతో విలసిల్లబోదు. గెలుపనుకుని ఓడుతున్న మనిషికి తెలుపు నలుపు తేడా తెలియదు.' అని అంటారు. ఆ తరువాత అఖిలాంధ్ర ప్రజావళి భుజం కలపడంతో సమగ్రాంధ్రను, సమైక్యాంధ్రను మెచ్చుకుంటూ

"విడిపోవుట చెడిపోవుట. విడిపోవుట పడిపోవుట.
కలిసియుంట గెలుచుకొనుట. తెలుగు విలువ తెలుసుకొనుట"

అని మరెప్పుడూ విడిపోవద్దని హెచ్చరిస్తారు.

ఆంధ్రావతరణోత్సవాన్ని పురస్కరించుకుని "గుండెను రెండుగ చీల్చే మొండితనం పనికిరాదు. మనసుల నేకం చేసే మంచితనం కావాలి" అని అదే విషయం మరోసారి ప్రస్తావిస్తారు.

"హరశూలం మనది. హరిచక్రం మనది. హరిహరులను మించినట్టి నరహృదయం మనది.

నరుడు అలనాడు వానరుడు. ఈనాడు నిశాచరుడు.

నరుడు కావాలి నిండైన నిశాకరుడు" అనడంలో కవి పరిణామ సిద్ధాంతాన్ని అన్వయించారు. మానవత్వాన్ని దైవత్వం కంటే మిన్నగా ఆరాధించిన అభ్యుదయ భావుకులు. ఆంధ్రజాతి ఒకటిగా ఉండాలని అభిలషించారు. తెలుగుజాతి ఏకంగా విలసిల్లడం కోసం బ్రతుకును బలిపెడతానని తన స్థిర నిశ్చయాన్ని ప్రకటిస్తారు.

కాలపు కత్తివాదర చేసే గాయమే మానవునికి ప్రాయమని అభిప్రాయపడ్డారు. ఆ గాయం కలిగించే వేదనలోనే తీయదనం ఉందని చెప్పగల తాత్త్విక సంపన్నుడు దాశరథి. బాధే సౌఖ్యమనే భావన కలవారు. గాయంనుండే సమస్తమైన లలితకళలు ఆవిర్భవిస్తా యంటారు. గాయాన్ని గులాబి మొగ్గగా, నవ్వే దివ్వెగా, తిమిరలతను ఛేదించే అస్త్రంగా, అమృతత్వాన్ని సాధించే కవిత్వంగా అభి వర్ణించారు. గాయం గేయంగా మారడమనేది వాల్మీకి 'శోకం శ్లోకత్వ మాగతః' అనేదానికి సాభిప్రాయం.

'ప్రణాలతో రణాలు' అనే కవితాఖండంలో ఆయన కవితాలత బహుముఖంగా అల్లుకుపోయింది. తిమిరలత అనే పదచిత్రం అద్భు తంగా ఉంది. వ్యాపించే గుణం తిమిరానికీ లతకూ ఉన్నాయి గదా. లోకంలోని ఈ చీకటికి కారణం మనిషిలోని కోరికలే అని సంప్ర దాయకంగా వస్తున్న తాత్త్వికాభిప్రాయమే ఆలంకారికంగా చెప్పారు. ఈ కవికి గాయాలు అసంఖ్యాకం. ఆ జాబితా చుక్కల చిట్టాను మించింది. గాంధీవధ, కెన్నెడీ హత్య, వియత్నాంలో పేలిన బాంబు, సూయజ్ కాలువ కిరుప్రక్కల లేచిన రణజ్వాలలు ఆ గాయాలలో కొన్ని. ఆయన గాయం మొక్కై లేచి ప్రమానై పెరిగి, ఆక్రమాన్ని చూస్తే నిప్పుపూలు పూస్తుంది. మానవత కనిపిస్తే కప్పురపు గాలి వీస్తుంది. ఆ గాయం "నిర్నిద్ర నీరవ నిర్భర నిశీధి వీధిలో కాల ముద్రల రుద్రాక్షలతో జపం చేయిస్తుంది." అని చెప్పడంలో వైదిక ధర్మాచరణ తత్పరత స్పష్టమౌతూవుంది. గాయాల జ్వాలలకు ముందుగా కవి యొక్క అహంకార అంధకారం ఆహుతైపోయింది గనకనే ఆయన కవిత 'కుంభగత ప్రదీప కళిక'గా ప్రకాశించ గలుగుతూ వుంది.

"గాయాల వజ్రాయుధాలతో అధికార మదాంధుల బధిర హృదయాలను బ్రద్దలు గొడతాను. దయాహీన మానవ మరు భూమిలో కవితాంబోధర గణాలతో కృపావృష్టి కురిపిస్తాను." అని అంటారు. యముణ్ణి ఓడిస్తానని కవి అన్నట్టుగానే అమర కవితలు వ్రాసి మృత్యుంజయుడయ్యారు.

భుజబలం, ధనబలం బలం కాదని, మనోబలం గల జనబలమే బలమని విశ్వసించారు. ఆయన కవితా అశ్వత్థవృక్షానికి వేళ్లు జనం లోనే అల్లుకుని ఉన్నాయి. నర కంఠాలను ఆశించే నరరాక్షసులపైని, నరరక్తంతో జలకాలాడే దురాత్ములపైకి తన కవితా వజ్రాయుధం ఎత్తారు. ఊరకే ఉద్రేకపడేవారు నిజ జీవితంలో నిద్రపోయేవారేనని తెలిసినవారు గనక

"హృదయాలలో నుండి ఎదగాలి క్రాంతి.
నయనాలలోనుండి నవ్వాలి కాంతి
బాంబుల రాసిపై పడరాదు క్రాంతి
స్థిర విప్లవానికి జీవం శాంతి" అని అంటారు. ఆయ

అభిప్రాయంలో ఆవేశంతో కూడిన విశృంఖలత్వం విప్లవం కాదు రక్తపాతం, పిస్తుల గుట్టలు విప్లవం కాదు. ఆలోచనతో కూడిన బా విప్లవం, సామాజిక చైతన్యమే విప్లవమని ఆయన నిర్వచనం.

"దానవుడు గెలిచేటి తరం గడిచింది. మానవుడు వర్ధిల్ల వేళ వచ్చింది!!" అని గుండె నిండుగా యుగధర్మాన్ని ప్రకటిస్తారు.

దని తన జీవితమంతా మహోన్నతాశయాలను, ఆదర్శాలను వెలయించారు. తను నమ్మిన సిద్ధాంతాలు వమ్ము అయిపోతూంటే; తన నాటిన మల్లెతీగ తననే కాటేస్తుంటే; తను కట్టిన ఆశాసౌధం నిలువున కూలిపోతుంటే; తను ఊహించిన భవిష్యద్దేవతే ప్రవర్తమాన రాక్షసిగా అవతరిస్తుంటే నిట్టూర్చారు. అయినా అంతలోనే తేరుకుని

"పైకి ధరణిలా కనబడతాను. లోన జలధిలా పరుగెడతాను.
నేను గన్ను చేపట్టాలంటాను. కాని పెన్నుతో కలలు కంటాను"

అని తన శాంతిలోలుపతనే ఉద్ఘాటిస్తారు. ఆయనలో కలిగిన నైరాశ్యం తాత్కాలికమైనది; యాదృచ్ఛికంగా కలిగినదని ఋజువు చేస్తూ

"నా నరాల్లో అగ్ని చల్లారలేదు. త్రేతాగ్ని జ్వలిస్తోంది చైతన్యాన్ని వరిస్తోంది" అని సర్దుకుంటారు. తననితాను ఎవరినని విచికిత్స చేసుకుంటూ అవనికై అసువులర్పించే అమరజీవితో పోల్చు కుంటారు.

'చిరంజీవి శ్రీ నెహ్రూ' అనే పద్యఖండిక ఒక చక్కని ఎలిజీ. భావకవితా శాఖలలో స్మృతి కవిత్వమనే శాఖకు చెందుతుంది. ఇందులో కవి తన కవితామృతాన్ని పోసి జవహర్‌లాల్ నెహ్రూను చిరంజీవిని చేశారు. ఇందులో ప్రతి పద్యం ఒక ప్రగతి సూక్తం. కొన్ని పద్యాలు పద్యాంతాల శైలిని సంతరించుకున్నాయి. మచ్చుకు నెహ్రూగారు కనిపించే తావులను గూర్చి చెబుతూ

"రైతు హలాన, సత్కవి కలాన, సముద్ర జలాన, శాంత సం
జాత బలాన, ధర్మతరు సత్యఫలాన, ఇలాతలాన, జీ
మూత పథాన బాలకుల పుష్పరథాన, వసంత కోకిలా
గీతి విధాన ప్రీతి కరిగించుచు తోచెద వెల్లవేళలన్" అని

అంటారు. ఆ మహనీయునిపై కవికున్న భక్తిభావం మహోన్నతమైంది.

"ఎచట పేదయున్న నచట నీవుందువు నీవు లేనిచోట భావి లేదు
నీవు లేవటన్న నేనేల నమ్ముదు అణువు అణువు నింపుకొనెను నిన్ను"

అని తన భక్తిభావాన్ని ప్రకటిస్తారు. ప్రతి పద్యమూ ఆణిముత్యం, అనర్ఘ రత్నం.

"కాల మహాపథమ్ముల చకాచక నీవు ప్రయాణమై చనన్
తెరిన నీ పదాంకములు దీపములై భయదాంధ కారపున్
వేళల ధాటి జూపెడిని విశ్వమహా ప్రజకున్ వికార కం
కాళ భయంకరమ్ము యిన కానన సీమలు నందనాలుగాన్" అనే

పద్యము కవి ఊహాశాఖలతకు ఒక చక్కని ఉదాహరణ. ఇందలి ఉత్ప్రేక్షలు మహా ప్రబంధ ఊహావిన్యాసాలను తలపిస్తున్నాయి.

హింసనుండి సమ సమాజ హంస ఉద్భవించునని ప్రగాఢ విశ్వాసమున్నవారు దాశరథి. అందువల్లనే "యుద్ధాలను కోరువారి ఊపిరి స్తంభించనీ, తామ్ము పేర్చుకున్న బాంబుల గుట్టక్రింద తామే నలిగి చావనీ" అని కోపంతో శాపనార్థాలు పెట్టారు.

పిల్లి కూతను సంగీతంగా, పిచ్చిగీతను చిత్రలేఖనంగా, బూతు వ్రాతను నవ కవిత్వంగా, గంతులేసి నాట్యంగా అనుకరించి అశక్తులయీ ఉద్భ్రాంత యువశక్తిని కొత్తదనం పేరుతో రిక్తదనం పెంచ వద్దని హెచ్చరించారు.

"తరగలు శబ్దాలుగ, ఇరుదరులు కర్తాకర్మలుగా, ప్రవాహం క్రియగ, చేపలు అర్థాంతరాలుగ, ఇసుక ధ్వనిగ చేసుకొని నది నాతో మాట్లాడినది" అని చెప్పడం చమత్కారవహము. అలాగే జాబిల్లిని యువతీ యువకులలోని ఆకలిగ, జంటలకు మిత్రునిగ, విరహిణులకు గూండాగా చమత్కరించడం అలంకారప్రాయం. మానవుడు చంద్ర మండలంపై కాలూనడంతో చేజిక్కిన జాబిల్లిని చూస్తూ "నీలో ఆ వట భూజమ్మేది? నీలో ఆ ముసలమ్మేది? గంతులేస్తూ తిరిగే రంగుల సారంగమ్మేది?" అని మూఢ నమ్మకాల్ని, బూజు పట్టిన కట్టు కథల్ని భౌతిక దృక్పథంతో ప్రశ్నిస్తారు. "అందరాని జాబిల్లిని అందుకునే వేళ అవనిపైన ఈ అశాంతి అవతరించదేల?" అని సూటిగా సంఘ విద్రోహుల్ని ప్రశ్నిస్తారు. పచ్చ కాగితాలు చూసి పరవశించేవారినీ, పేదల కన్నీటిలోన ఈదులాడేవారినీ, ధాన్యానికి బదులు సైన్యానికి ప్రాధాన్యత యిచ్చేవారినీ ఎద్దేవా చేస్తారు. మనిషి మరో మనిషిని ద్వేషించని మార్గం వెదకమంటారు. దాశరథిని జాతీయ అవార్డు యిచ్చి జాతీయకవిగా గుర్తించినా అంతర్జాతీయ పురస్కారాన్ని పొందే అర్హత గల అంతర్జాతీయ కవి.

'ఎప్పుడూ బాంబుల చర్చేగాని సంబరాలు లేనేలేవు. చావుల చరితలేగాని పూవుల కథలే లేవు. గొంతు కోసి గెంతునొకడు ముక్కు కోసి మెక్కునొకడు రక్తంతో స్నానంచేసి శక్తిలాగ ఆడెనొకడు. ఒక్క తల్లి పిల్లలమని మక్కువ లేనే లేదు' అని వసుధైక కుటుంబ భావనని వ్యంగ్యంగా ఉద్బోధిస్తారు. శాంతిని వధించిన వారిని సత్యాన్ని హత్య చేసినవారిని లొంగదీస్తానని శపథం చేస్తారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం రాగానే స్వర్గతుల్యమౌతుందని, కులం శిలమౌతుందని, మతం శతమౌతుందని, ధనం మాట చెల్లదని, జనం మాట చెల్లునని హింస బిక్కచచ్చి, హంస రెక్క విచ్చునని కవి ఎన్నో కలలు కన్నారు. ఆ తరువాతనే జరిగిన పదవెరుగని పదవి లేని పరమ సాధు గాంధీహత్య, భాయీ అనే చైనాదాడి, తోడుగా ఉంటాననే పాకిస్తాన్ యుద్ధం ఆకాసన్నంటుతున్న ధరలు, తెలుగు వారిలో కలహాలు ఇలా అయన కలలన్నీ కల్లలుగా మారి కవిని కలచి వేశాయి.

"మనశ్శాంతి లేనినాడు మనిషి మనకి దేనికీ
స్నేహ సుధలు లేనినాడు జీవితమది ఎందుకు?" అని

వాపోతారు. భగవంతుని తలపించే పరమోత్తమమైన మతం యము నింటికి తరలించే అతి హీనమైన మతమైనందుకు మిక్కిలి పరితపించారు. ఈ ప్రపంచాన్ని ఏకం చేసే మహాసూత్రాన్ని వివరకు రమగొన్నారు.

"ప్రతి ఎదలో మహాత్ముడే ప్రతిష్ఠితుడు కావాలి
అతని అడుగుజాడలందు అఖిల జగము నడవాలి
అతడొకడే ఈ జగతికి ఆశాజ్యోతి
అతడే ఈ కవి గళంలో ఆనందగీతి" అని గాంధేయమార్గమే

ప్రపంచానికి ఎప్పటికైనా శరణ్యమని భావిస్తారు. ఈనాటి ప్రపంచ క్లిష్ట సమస్యలకు వేదనలకు అశాంతికీ, అస్థిరతకూ మహాత్ముడే సూటి జవాబని ఉద్ఘోషిస్తారు.

'తిమిరావృత మహావనికి తేజోరాశి మహాత్ముడు
అసత్య కాననసీమకు సత్యాన్వేషి మహాత్ముడు" అని

అంటారు. ఈయన పద్యకావ్యాలు గొప్ప సంప్రదాయ పాటవము, నవ్యతా నినాదము, సంతరించుకొన్నాయి. మధులహరి ఉగాది సందర్భంగా చెప్పింది. పద్యాన్నైనా, గేయ కవితలనైనా తనదైన విశిష్ట శైలిలో శక్తివంతంగా చెప్పగల కవి సవ్యసాచి. గేయాన్ని శ్రుతి పేయంగా చెప్పినట్టే పద్యాల్ని హృద్యంగా చెప్పగల దిట్ట.

'దాశరథి రచనలో భావావేశం వల్ల అలవోకగా సాగివచ్చే పదరచనా ప్రౌఢి అంటే పదబంధాలను భావావేశాలి వ్యక్తికి బహిస్సాధనంగా ఉపయోగించుకునే నేర్పు' అని దీనినే డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు వివరించారు.

దాశరథి సంస్కృతాంధ్రములలో పారమెరిగినవారు. ఉర్దూ ఆంగ్లములలో అభినివేశం గలవారు. పుష్కలమైన వ్యుత్పత్తి, నిరంతరాభ్యాస సాధన సంపత్తి గలవారు గనకనే తన కవితలు ఆధునికాంధ్ర సాహిత్యంలో చిరస్థాయిగా వెలిగే మణిదీపాలు. "పికాంగ నారావము వీను సోకగనె ప్రాణము లైదును లేచివచ్చినట్లై వెతలన్ని

వ్రాసినట్టులై నవయవ్వన మావహించినదని కొంటెగా చెప్పగల రసజ్ఞులు. కోకిల కలస్వన ప్రభావం అందరకూ అనుభవైక వేద్యమే గదా.

'ఆ హేమంతము లం మవశిశిర మర్కోటల్ ...'' అనే పద్యం ఎత్తుగడ పోతనగారి 'ఆ తేరారథికుండు ఆహేయములు...'' అనే పద్యాన్ని తలపిస్తుంది. ఉగాదిని తెలుగింటి మోహినిగా సంభావిస్తూ

"ఆకలి మంటలార్పగల అంబుధరమ్మయి నీవు భారత
క్ష్మా కమనీయ సీమలను సస్య సమృద్ధ మొనర్చి మా యసం
ఖ్యాకుల కాకలిం దొలచి హాయిని కూర్తువుగాక నేడు నీ
రాక తమోమయావనికి రాక సుమా! రమణీయ రూపిణీ' అని

సుఖశాంతులు కోరుకుంటారు. 'నా కుగాదినాడు నవసరమ్ము నందు నవనవాభ్యుదయము నాట్యమాడు. ఈ అశాంతి ధరణి ఎన్నడో ఒక నాడు శాంతి నందుననుట భ్రాంతి కాదు' అని ఆశాభావం ప్రకటిస్తారు.

'గుండెలో కోటి దీపాలు' దీపావళి సందర్భంగా వ్రాసినది.

'ప్రథమ సంధ్యను తళతళలాడు తమ్మి చరమసంధ్యను వెల వెల చనును సుమ్మి ఉదయ సాయం సమయముల నొక్కరీతి లేత కెంజాయ విడువక ప్రీతి గూర్చు నేత్ర జలజమ్ములనురాగ పాత్ర ములు' అని చెప్పగల మృదుల భావుకుడు. అలాగే 'శ్రావణ పయోద మాలికలు గ్రీష్మకాలంలో కన్పించవు. కాని నీ నీల చికురాళి నిత్య వర్షరుతు హర్షాన్నిస్తుంది' 'నిండు పున్నమి నెలకొక్కమారే గానీ ఉల్లిపొరవంటి వస్త్రములతో నీ నడుము నిత్యపూర్ణిమా నిభృత నభము' అని మనోజ్ఞంగా చెప్పారు.

'మల్లెపూలలోని చల్లని గంధమ్ము పూలశౌరు నందె పొందగలము
నీదు నిస్వసనము నిత్యవాసంతికా మల్లికా సుగంధ మండితమ్ము'
'అమృత కణము కొరకు అసురులు సురలు ఘోరాజి సలిపి
యిడుమ లందినారు
మదన రథము చేయు మధురనాదము వోని పలుకు నీది అమృత
మొలుకు సతము'

మొదలైన పద్యాలలోని కవితామృతము రసికైకవేద్యము. 'నటశ్రీ' అను పద్య ఖండములో

'హృదయ హిమాచలాగ్రమున కెక్కి హుటాహుటి నాట్యమాడుచు
న్నది శివరూపమే. ప్రణవనాదము లోకము మేలుకొలుపు చు
న్నది 'యమునింటి కాసరము నక్కిన దెక్కడనో. నశించు చు
న్నది మరణా నలమ్ము కరుణా తరుణాంబుదవారి ధారలో' అనే

పద్యధారలో దాశరథి ఆర్ష విజ్ఞానము ప్రస్ఫుటమౌతూంది.

"ప్రథిత నటరాజ పదఘాత భవము నీడ గగనమే చంచరీక
సంకాశమయ్యె
చిందు చైతన్య మకరంద బిందు చయము తారలై తోచె బ్రహ్మాండ
తోరణమున''

అను పద్యంలో ఆయన ఊహావల్లిక తీగలు సాగినది.

"నిర్మల నభసీల శంకర శిరశ్శిఖరీకృత జూట జూట నిర్గళిత సురాపగా జలతరంగ పరంపర దోగజాలినన్ కలల పౌలాలు పండును'' అని భావానుగుణమైన ఓజస్సుతో చెప్పారు.

"సగమున పూరుషత్వమును సామ సతీత్వము గొన్న స్వామియే
జగమున పూరుష ప్రకృతి సంగరహస్యము బోధ చేయ జా
లు గురువు, వల్లకాటి యొడిలోపల చల్లని మల్లెమొగ్గ వి
చ్చ గలదటన్న సత్యమును చాటిన ఆది నదేశు గొల్చెదన్''. అనే

పద్యము ధారాశైలికి నన్నయ "ఆదిజుడైన బ్రహ్మ యుదయంబున... కాస్పదమైనవాడు'' అనే పద్యానికి. ఊహా వైచిత్రిలో పెద్దన 'అంకముజేరి శైల తనయా...' అనే పద్యానికి సరసన నిలువదగ్గ పద్యము.

'చైతన్యధార' కవితలో వసంతాగమనంతో కుర్చీ కుసుమించి నట్లు, బల్ల పల్లవించినట్లు మోడు చిగురిస్తుందనీ; పది తలల దానవుని వధ వలన మనిషికే విజయమనీ; రామప్ప, ఎల్లోరా శిల్పాల వలన శిలలకు హృదయం ఉందనీ; స్పెయిన్‌లోని తోర్కాకవి మాట బొమ్మల వలన మనిషి మృత్యువుని జయించగలడనీ చేతనా స్వరూపాన్ని విశ్లేషించడం జరిగింది.

"మనిషీ-మనీ-పనీ'' కవిత గొప్ప సామాజిక స్పృహ గల కవిత. చలిలో, ఆకలితో, కడుపు కోతతో వరి కోతకు కాలువ వద్దంట కదిలి వెలుతున్న వ్యవసాయ కార్మికుని కన్నీరే కృష్ణ కాలువని ఉత్ప్రేక్షించారు.

"డబ్బు లేని నీ పాలిటి బెబ్బులి ఈ లోకం
ధనవంతుల యిళ్ళముందు శునకం ఈ లోకం
కష్టించని వారికి కట్టలు కట్టలు ధనం
కష్టించే వాడికి ముష్టిగింజలే ఘనం'' అన్న లోకం తీరు

నగ్న సత్యం. మనీ విలువ తరిగి పని విలువ పెరగాలంటారు.

మనిషికి విలువిచ్చే మంచిరోజు ఓటుతో వస్తుందని ఒకరు, తూటాతో వస్తుందని మరొకరు అంటూంటే కవిమాత్రం "నిన్ను నీవు తెలుసుకుని నీ కన్నులు తెరుచుకుని విజృంభించినపుడదే విప్లవ మని శాంతి విప్లవయోధునిగా దాశరథి సామాజిక చైతన్యమే విప్లవమని నిర్వచించారు. "పొదుగునుండి కారే రుధిరంతో కాలధేనువు జాలిగా చూస్తోంది. పాలు పితికే శక్తి లేని పాపాలపుట్టలు రక్తం పితికారు.

రాలిన ప్రతి రక్తకణం పలాశమై లేచి రుధిరసుమం పూసింది" అని అంటారు. 'పరిపక్వం కాని అండాన్ని పగులగొట్టిన వినతలా సిద్ధంగా లేని ప్రజావళిని సిద్ధాంతాల విషాదాంతంలోకి లాగలేరు.' అని ఆంధ్ర ప్రదేశ్‌లో మొదటిసారిగా విఫలమైన నక్సలైట్ ఉద్యమాన్ని ఉద్దేశించి చెప్పారు.

సంక్రాంతి సందర్భంగా వ్రాసిన కవితలో సమకాలీన సాంఘిక స్థితిగతులనే కవితా దర్పణంలో ప్రతిబింబింప జేశారు.

'మంచు ముసుగు తీసేసి జ్వాలాచేలం ధరించి అంచనకలతో కేళీవిలాసంగా వచ్చిన జ్వాలాసుందరి పెదవిని హాలాచషకంగా భావించుకోమన్నారు. ఆమె ఆలింగనంలో నలిగిన హేమంతకాలం ఓడ్చిన కన్నీటి చుక్కలు ఈ తుహినకణాలు" అని రమ్యమైన భావ చిత్రం ప్రయోగించారు. మంచు ఉరులను త్రెంచుకుని, మహా తిమిరంను దూసుకుని, గగన హంసికా గరుదంచలముల ఎగసి, ఆనలకేతనం చేతగాని అరుదెంచేదే భవితవ్యమని భావిస్వరూపాన్ని రేఖామాత్రంగా చిత్రీకరిస్తారు.

భవిష్యత్తు మహారాజులా మదగజంమీద వస్తే దుర్నిరీక్ష్య హర్మ్యాగ్రమై అమాంతం లంఘించి ఆ గజాన్నీ, గజారూఢున్నీ అంతం చేస్తానని శిథిల వ్యవస్థపై ధ్వజమెత్తారు. నల్లధబ్బుతో కుబేరునిలా; తన మాటే వేదమనుకునే నియంతలా కత్తికి కనకాభిషేకం చేస్తూ భవిష్యత్తు రారాదంటారు. నందనవన సుగంధంలా; నవరసమయ ప్రబంధంలా; వయస్వినీ వయః పయస్సరస్సులో విరిసిన సౌందర్యార విందంలా భవిష్యత్తు రావాలంటారు. అనేక నగరాలలో అధోగతిలో ఉన్న అనాథలకు అభయహస్తంలా అనంత జనపదాలలో అతి కష్ట జీవితం గడిపే అభాగ్యులకు అండదండగా భవిష్యత్తు రావాలని ఒక వంక తన సౌందర్యదృష్టి మరోవంక సామాజిక స్పృహలో తన కవితా నాణెమునకు బొమ్మా బొరుసుల్లా చిత్రీకరించారు. "శ్రమజీవుల బుద్ధి జీవుల సమసమాజ స్వప్నాన్ని సత్యం చేయగల నిత్యం చేయగల అత్యంత శక్తిస్వరూపిణి కాత్యాయని నా భవిష్యత్తు ఆ కాత్యాయనిని వరించే కాలకింకరుణ్ణి నేను." అనగల సామ్యవాద స్వాప్నికుడు. తను కవీశ్వరుడు గదా ఈశ్వరునిగా ధ్వనింపజేశారు. ఆయన కవితే కాత్యాయని.

వర్షంతో హర్షించవలసిన ధరణిపై వహ్ని కురుస్తున్నందుకు, సౌరభం వెదజల్లవలసిన సుమలత సర్పమై కరుస్తున్నందుకు, దూరాన బాంబుల కంచు చెంబులు నాగరికతాసోపానం ఒక్కొక్క మెట్టుమీద నుంచి జారిపడి బర్బరత్వపు ఆవరణలో పేలుతున్నందుకు మానవ జాతి మారణహోమపు మంటల్ని చూసి కలత చెందారు. కవి ఎంత పోరాట దృక్పథం ఉన్నవారైనా కవి సహజమైన సౌందర్యారాధన భావం "చందమామను చావగొడితే చల్లదనం రాదు. కలువభామను కాలరాస్తే చెలువము ఇక మిగలదు" అనడంతో మనకు కనిపిస్తుంది.

'జ్యోతిర్నయనాలు' కవితలో 'ఓ దీపావళీ దివ్యాంగనా. లాక్కుపోయిన నా రెండు కండ్లను ప్రమిదలుగా చేసి వాటిలో నీ చిరు నవ్వును జ్యోతిగా వెలిగించుకోవా' అని ప్రాధేయపడతారు. ఈ దేశపు కలుషిత రాజకీయాలు చూసి "గూండాల తండాల దెబ్బలకు నా గుండె ముక్కలై పోయిందని" వాపోయారు.

ఈ లోకం మారాలని ఆశించారు. మార్చాలని ప్రయత్నించారు. ఎన్నటికీ మారకపోయేసరికి "చీకటి రోకటితో చితుకగొట్టించు కోవడం కంటే దీపాంగన మంటల ముగ్గుల్లో పడి బుగ్గయిపోవాలనే" తీవ్ర నైరాశ్యానికి గురియయ్యారు. వెనక్కి పోతూ ముందుకు పోతున్నా మనే అజ్ఞానం ప్రబలింది. సమిష్టివాదం సమసిపోయింది. వ్యష్టివాదం తిష్ట వేసింది. అందువల్ల సమాజంలోని నైరాశ్యమే కవి వాక్కులోనూ ధ్వనించింది. సాహిత్యం సమాజానికి దర్పణం కదా.

"నాకు కావలసింది రెండు కళ్లు. కరగగల కళ్లు. వెలగగల కళ్లు. ఆ కళ్లకోసం లక్ష దీపావళులు దాటి వెళతాను." అని భంగ్యంతరంగా శాంతి, అభ్యుదయములనే ఆకాంక్షిస్తారు. నమ్మిన సిద్ధాంతాలకు వమ్మయిపోయిన అజ్ఞాతయోధునిపై కవికి సానుభూతి ఉంది.

నింగి ఆవులించి వేలను కౌగిలించినవేళ మహీ మహాకాశాన్ని చుంబించినవేళ చైతన్యం వినిపించే గీతం రాజీవ గీతం కవిత. 'అంతా నడిచే దారిని వదిలేసి అంతులేని అడవిలో పడిపోయి వింత మూలికలు కనుగొని, ముళ్లు గుచ్చుకుని రాళ్లు కొట్టుకుని మూలిగేకాళ్ళ రక్త రాజీవగీతం రమణీయ చైతన్యోపేతం.' అని నూతన మార్గాన్వేషకులపై సానుభూతి కురిపిస్తారు. నింగీ నేలా పొంగిపొరలే విశ్వాబ్ది తీరం పట్టు కోవాలనేది కవి ఉబలాటం. నక్షత్రాల నందుకునే పక్షిపక్షాల పయనం ఆయన కవనం.

"డబ్బు రుబ్బురాయి కింద నలిగే డాబుసరీ సమాజం కన్న
రెక్కాడితే డొక్కాడే నిరుపేదల నిండుగుండె మిన్న" అని

కవి శ్రమజీవుల పక్షంవైపే మొగ్గు చూపారు.

"గడియారం నడవని పాతకోట గోడకన్న
సూర్యుణ్ణి ఉరికించే ఫ్యాక్టరీ కూత మిన్న" అని కాలం

చెల్లిన వ్యవస్థపై పారిశ్రామిక విప్లవం తీసుకువచ్చిన అభ్యుదయాన్ని హర్షించారు.

"కోటి కిరణాలున్న సూర్యుణ్ణి గుటుక్కున మింగేసే చీకటి
మనిషిలోని అజ్ఞానపు చీకటి మనసులోని అహంకారపు చీకటి
నీ ముందు నిజాన్ని నీకే కనపడనివ్వదు. నీలోని లోపాన్ని నిన్నే
చూసుకోనివ్వదు"

ఆని చీకటి తత్వాన్ని తెలుపుతూ దాన్ని మటుమాయం చేసే జగజ్జ్యోతి 'మానవతావాదం. మీద మనిషి ప్రీతి' అని చీకటిని పారద్రోలే ఉపాయమూ కనుగొన్నారు.

'ప్రతి ఇసుక కణం నుండి ద్రాక్షాలత పొటమరించు
ప్రతి చీకటిరేయి నుండి భానుబింబమవతరించు
ఫిరంగీల పైన శాంతి పతంగాలు వాలగలవు
ఆనాడూ ఈనాడూ మానవుడే గెలిచాడు. దానవుడే ఓడాడు'

అని శాశ్వతమైన ప్రపంచ సత్యాన్ని చెప్పారు. 'నైలునదీ బాలులతో' అనే కవిత దాశరథి హృదయానికి అద్దం పట్టింది. "దోస్తో! పగిలిన పానపాత్రలో, తెగని మౌనయాత్రలో, ఎన్నడూ గమ్యం చేరని ఈ నడక ఎన్నాళ్లు' అని నైలునదీ బాలుల దుర్భర జీవితాన్ని గుర్తుచేస్తూ ఉత్తేజ పరుస్తారు.

స్థూల ప్రపంచంనుండి సూక్ష్మతత్వాన్ని దర్శించగల ద్రష్ట; సూక్ష్మతత్వం నుండి స్థూల ప్రపంచాన్ని సృష్టించగల స్రష్ట మహాకవి దాశరథి.

"మీ దేశం వేరైనా మీ వేషం వేరైనా మీ మనస్సు మా మనస్సు కలసి భావి ఉషస్సు" అంటారు. ఎంత స్వచ్ఛమనస్కులు.

'మానవత కాపాడుటకు మసి యయ్యే మానవులు. మీరే మా దేవుళ్ళు మీ గుండెలు మా గుళ్లు" అనగల మానవతావాది.

"బొగ్గు గనుల పుష్పాలు మొగ్గలు తొడిగే రీతిని
పాతాళం నుండి గంగ పైకెగసే రీతిని
వెనుకబడిన మీనుండి విజృంభించును చండి"

హృదయం లోంచి కవిత్వం దూసుకుని వస్తే ఎలా గర్జిస్తూ ఉంటుందో, ఉరుముతూ ఉంటుందో ఆయన కవితలు చదువుతూ వుంటే అనుభవానికి వస్తూంటుంది మనకు.

ఆయః పిండాలవంటి పదాలైనా ఆయన భావాగ్నిజ్వాల ధాటికి కరిగిపోయి ఆయన కలంలోంచి ప్రవహించి నిప్పుపూలు పూస్తాయి.

మహాత్ములైన బుద్ధుడు, ఏసుక్రీస్తు, మహాత్మాగాంధి, మహమ్మదు ప్రవక్తల మాన్యతను జీర్ణించుకున్నవారు.

"పిరికివాడు కత్తిపట్టి నరుకుటకై వస్తాడు
మూర్ఖుడు హింసించబోయి ముందు తాను చస్తాడు
రజస్తమో గుణాలతో విజయం సాధించె నెవడు?
సత్త్వగుణంలో నిజమగు సత్తువ వున్నది తెలియుడు"

అనడంలో భగవద్గీతలోని గుణత్రయ విభాగ చర్చ మనకు స్ఫురణకు తెస్తుంది.

"నీలి నీలి మేఘాలై, నైలు తరంగౌఘాలై, తుపానులై, కృశానులై, దూకే సెల ఏరులై సాగిపొండి భాయ్యో" అని నైలునదీ బాలలను ఉత్తేజపరుస్తారు. ఇక్కడ ఉద్యమరూపం ఒక క్రమం పాటించబడింది.

కూడు లేని కోట్ల ప్రజలు గోడు గోడు మంటూంటే కోట్ల ధనం ఆయుధాల కొరకు ఖర్చు చేయడం నిరసించారు. ప్రపంచంలోని అజ్ఞానం, అనాగరికత, స్వార్థం చూసి "మనిషింకా అంధకార మహాజలధి నున్నాడు. అందులకే నిశాచరుల ఆటలు కట్టించలేదు." అని ఇంకుతూన్న మానవుణ్ణి మేల్కొలిపి తిమిరంతో సమరం చేయమని, తుపాకులను హతం చేసి కృపాకీల వెలిగించమని ఉద్బోధిస్తారు. ఆయన శాంతి విప్లవానికి ఆయుధం కృపాకీలే గదా. ప్రపంచంలో అగ్రరాజ్యాలు యుద్ధోన్మాదంతో కృషి జీవనానికి అల్ప ప్రాధాన్యత నిచ్చి సైన్య సమీకరణకు అధిక ప్రాధాన్యత నివ్వడం చూసి

'సైనికులే సైరికులై సాగు చేయవలెనేల' అని చురక తగిలిస్తారు.

దేశభక్తి, విశ్వమానవతావాదం, శాంతి సమర దృక్పథం గల అద్యతనాంధ్ర కవులలో అగ్రగణ్యులు దాశరథి. వాడి వేడి గల కత్తివాదర దాశరథి అవిచ్ఛిన్నమైన కవితాధార. పోరాటం ఆయన కవిత్వ జీవలక్షణం. ప్రత్యక్షంగా పోరాటాల్లో పాల్గొన్న వ్యక్తి అవడం చేత ఈ లక్షణం. సహజసిద్ధమై మరింత నైశిత్యం పొందింది. ఎవరినైనా ఎదిరించగల గుండె గలవారు. విశ్వమానవ వాద విజయశంఖాలు సమసమాజాలయ ద్వారాలలో మ్రోగించారు. అరుణారుణ కవితా శకలాల తోరణాలతో కవితాలోకాన్ని ఆనందభవనంగా కలకలలాడించారు. ఇలా తిమిరంతో ఘన సమరం జరిపి అమరుడైన కవి దాశరథి.

దాశరథి కవితా విశ్వరూపంలో ప్రదర్శితములైన అనేక పదబంధాలు భావచిత్రాలు, బహుభంగులు బహురీతులైన అలంకారాలు ఈ వ్యాసంలో ఉదాహృతములైన కవితాచరణాలలో దర్శించాం. అవిగాక మచ్చునకు మరికొన్ని కొత్త ప్రయోగాలు:- మంచుకంచుకం, కాంతివల్లికలు, మరణ నిశ్శబ్దం, కాలరథం, మువ్వన్నె జెండా నవ్వులు, సమర మేఘాలు, పూలసంద్రం, మోదుగుజెండా, రుధిరసుమాలు, పయ్యెద పతాకం మొ॥

పదబంధాలు:- కరుణారుచి, వివాదాల మడతలు, కవిత్వాల రగ్గు, రాజకీయ రాజీవం, దేహపు దేహళి, మ్రోడుల మేడలు, దీపాల రంగవల్లికలు, మంటల ఎర్రగోరింట్ల నీడలు, కాలపు పూలపాన్పు, సుమపథం, శక్తివంటి హృదయం, అరుణ కిసలయ దీపాంకురాలు మొ॥నవి.

భావచిత్రాలు:- చల్లని వెన్నెలతో చేసిన తెల్లని దుస్తులు; అక్షియుగము మన్మథుని అమ్ముల పొత్తరలు, జలబిందువులో విద్యుత్ కలశములు, రుధిరంతో వసంతాలాడడం, శిరాతలాలను ఈదుకుంటూ రావడం, గంగాజల తరంగమే గానమై పొంగడం, రూపం మౌక్తికమై నిలచియుండడం, ముళ్లు మల్లెలై చిరునవ్వడం, ద్వారబంధాలందు

ప్రేమల తోరణాలు కట్టడం, సంశయాలు మౌనంగా హింసించడం, చెలిమి నీడల్ని పాకనివ్వడం, మమతల మ్రిఊడల్ని దిగనివ్వడం, హృదయాలు అల్లుకోవడం మొ॥

సున్నిత హాస్యరస స్ఫోరకములు :

'మారినపుడు అదె కాలం. మారనిది శునకివాలం'

'తుపాకుల నోళ్ళు మూయిస్తాను. బాంబుల చెంపలు వాయిస్తాను'

'బొల్లి గద్దల వలె యుద్ధ విమానాలు'

'జాకెట్టు వదలి రాకెట్టు తొడిగేశారు'

'పడతులకు పైట చెరగులే భారమాయె'

'అణ్వస్త్రం వివస్త్రయై అవమానం పొందాలి' మొ॥

పిట్టపై బ్రహ్మాస్త్రం, రావణకాష్ఠం, కళ్ళలో ఇల్లు కట్టుకోవడం, అడుగులకు మడుగులొత్తడం మొ॥ జాతీయాలు; 'నీ రాక తమోమయా వనికి రాక' మొ॥ శబ్దాలంకారాలు ఉన్నాయి.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారన్నట్లు "ఆధునికాంధ్ర సాహిత్యక్షేత్రంలో భావ చైతన్యస్రవంతి మూడు పాయలుగా చీలి ప్రవహిస్తోంది. ఒకటి. సంప్రదాయ చైతన్యధార. దీనికి నాయకుడు కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. రెండు. సాయుధ విప్లవ చైతన్యధార. దీనికి నాయకుడు మహాకవి శ్రీశ్రీ. మూడు. శాంతి విప్లవ చైతన్యధార. దీనికి నాయకుడు మహాకవి దాశరథి. ఇందులో మొదటి రెండూ రెండు తీవ్రవాదాలు. వాటిని సమన్వయిస్తూ అభ్యుదయాన్ని వరించే మధ్యేమార్గం దాశరథిది. ఆయన మధ్యేమార్గపు మార్గాన్వేషణ "తిమిరంతో సమరం". తిమిరమనే రావణునితో సమరం చేసిన దాశరథి, అక్షయ రసమయ కవితాస్త్రాల శరథి, శాంతి విప్లవ కవితారథ సారథి, పాండితీ ప్రతిభా విలసితమైన ధీ మహాకవి దాశరథి. ఆయన మాటల్లోనే చెప్పాలంటే ఈ సంపుటియందలి ప్రతి కవితా ఒక కిరణం. ఒక ప్రగతి చరణం.



# మృషానంద లహరి

నువ్వెక్కింది మంచు పడవ
నువ్వు చూస్తున్నది మబ్బుతున
ఒకటి నిన్ను ఒంటరి తనపు నట్టేట ముంచుతుంది
మరొకటి నీ కళ్ళలో శూన్యాన్ని గుచ్చుతుంది.
ఇది విలోమయానం-
చేరకుతోటల తీయదనం నుంచి
చెదువేపల వెగటు వాసనల్లోకి!
ఇది పరిణామ విరుద్ధం-
విజ్ఞానం వికటించటం
అజ్ఞానం వికసించటం!
శిల్పిచెక్కిన అనల్పశిల్పం
తిరిగి శిలాకృతినే ధరిస్తుందా?

రసభావస్పర్శతో కావ్యాలైన అక్షరాలు
జీవ రహితాలైన ఎముకల గుట్టలౌతాయా?
చందన శైత్యానుభవాన్ని కాలదన్ని
జంబాల దుర్గంధాన్ని మైనలదుకోవటం
ఆసురమా? భాసురమా?
చేతిలో ఉన్న దీపాన్ని విషనిశ్వాసంతో ఊదే:
చీకటిలో కాలుజారిపడటం
ప్రమాదమా? ప్రమోదమా?
ఆత్మ జిజ్ఞాస మొలకెత్తవలసిన వేళ
ఆత్మనే చితిమీది కెక్కిస్తున్నావు
ఆ మంటలు చూస్తూ వికృతంగా నవ్వుతున్న నువ్వు
పసితనపు వసంతాలనుంచి బహిష్కరింపబడుతున్నావు!

# అశ్రుపాతం

మింటిపైన ఒక్క చుక్క
కంటికొనల ఒక్క చుక్క
ఒకటి అందరాని గాథ
ఒకటి అంతులేని బాధ!
గుండెకూన విడిస్తే
కన్నతల్లి కరుగుతుంది
ఒక వేదన రగిలినపుడు
కావ్యం జాల్వారుతుంది!
కన్నీరే మున్నీరై
ఉప్పెనలా ఎగసినపుడు

మనసులోన బడబానల
కీలలు రేగిన చప్పుడు!
అంతర లోకాలేవో
అశ్రువులై వెలికివచ్చి
బహిర్లోక తైక్ష్ణానికి
ఆవిరులై పోతున్నవి!
కాలుజారి ఒక తారక
శూన్యంలో రాలుతుంది
కాగిన కన్నీటి చుక్క
అక్షరమై పేలుతుంది!

**శ్రీ కొంపెల్ల రామకృష్ణమూర్తి**

# పరస్పరం

## శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

'ఇదిగో, నిన్నే!' భార్యని గట్టిగా పిలుస్తూ-

'ఎక్కడా? కత్తి ఎక్కడా?'- అని అరుస్తూ దూకుడుగా వచ్చాడు చలపతి. బుసలుగొట్టాడు పాములా చలపతి. కళ్ళు ఎర్రగా ఉన్నాయ్; రక్తంవేడిగా పరుగుల్దీసింది; నరాలు చిట్లి పోయేటట్లున్నాయ్; ముక్కుల్లోంచి గాలి; ఆవిర్లు గ్రక్కుతూ వేడిగా వాడిగా వస్తూవుంది. చలపతి ఆవేశంతో పూనకం వచ్చినట్లు వూగిపోయాడు. కోపంతో గాడిపొయ్యిలోని నిప్పుల్లాగా మండి పోయాడు. అవమానం; ఆవేశం; కోపం; ఉద్రేకం!

ఆపరిస్థితిలో చలపతికి కళ్ళు సరిగ్గా కన్పడలేదు గానీ ఆకత్తి ఎదురుగానే ఉంది!

'కత్తి! కత్తి!' అంటూ పొలికేకలు పెట్టాడు చలపతి చిందులు తొక్కుతూ.

'ఏమిటా దూకుడూ! ఏమయిందిప్పుడూ!' అనుకుంటూ-గేదద్గరనుంచి వచ్చింది చలపతి భార్య సావిత్రి. 'అదిగో కత్తి మీ ఎదురుగానే ఉందిగా' అంది ఆక్షేపణగా.

'ఇదిగో! ఈపూట ఆ రామయ్యగాడ్ని పొడిచి పారేస్తాను!' రంకెలు వేశాడు. చలపతి-'నిజంగానే!'

'అతన్తో మీకెందుకూ? అసలే అతను 'కూనీకోరు' గందా! ఇంతకీ వుప్పుడు ఏమయ్యిందీ?' అంది.

'అయితే - ఆడు కూనీకోరయితే-నువ్వు ఏంజెయ్యమంటావు, ఇప్పుడు?!' అని కళ్ళు ఎర్ర జేశాడు. ఉరిమినట్లుచూసి, కత్తిని అందుకుని ఎదురుగావున్న బండకేసిపాముతూ కసిగా సాన బట్టసాగాడు చలపతి. సావిత్రి ఏదోవాగుతూవున్నా, ఆమాటలను వినిపించుకునే పరిస్థితిలో లేడు చలపతి. ఇవాళ ఏమయినాసరే అటోఇటో తేలిపోవాలి- అన్నదే ఆవకేవక్క ఆలోచన!

* * *

చలపతి ఇంటికెదురుగానే వూరు చెరువు వుంది. ఆచెరువు గట్టుమీదే వూడలు దిగిన మర్రిచెట్టు వుంది. చలపతి ఇంటిప్రక్కనే గణపతి ఇల్లూవుంది. గణపతి చలపతికి అన్నే! ఆ అన్నదమ్ములకి ఏనాడూ పడదు. ఎప్పుడూ తగువులూ పంచాయితీలూ. పెద్దలు సంపాదించి, ఇచ్చిన ఆస్తిపంపకాలప్పుడే, గొడవలు పడి దెబ్బలాడుకున్నారు. అప్పుడు మొదలయిన స్పర్థ, రోజు రోజుకీ పెరుగుతూ వచ్చిందేగానీ ఏ కొంచమయినా తగ్గనే లేదు.

ముదనష్టపోళ్ళు ఆ పితృాదులు చేసిన పాపమే ఇది-ఆరెండు ఇళ్ళు ప్రక్కప్రక్కనే తగలడి చావాలా? సావిత్రి తోడికోడలు పేరు సక్కుబాయి. సక్కుబాయికీ, సావిత్రికీ అసలే పడదు! తగూలాటలప్పుడు ఆడాళ్ళకున్న తెలివితేటలు మగాళ్ళ కుండవు. గిల్లి కజ్జం తెచ్చుకుంటారు-స్త్రీలు. గొడవలుపడి అంతటితో వూరుకోరు. మా మగాళ్ళ చెవులో జోరిగల్లాగా పోరు పెడతారు. వాళ్ళకి వున్నవీ లేనివీ కల్పించి చెప్పి రెచ్చగొడతారు. అప్పుడు బుజాలెగరేస్తూ దున్నపోతుల్లాగా ఎగబడతారు మగవీరులు. ఆ తర్వాత రామరావణయుద్ధ మవుతుంది- ఈ యుద్ధాలు భయంకరమయినవి. పగల్ని సెగల్లాగా ఎగదోస్తాయి. అంతటితో మరి ఆగదు అది!ఆ సెగలు సంవత్సరాలు గడిచినా చల్లారవు. కునారిల్లుతూ కడుపులోనే నిప్పుల్ని దాచుకునే వుంటాయి. ఆ రావణ కాష్ఠాలు యుగయుగాలుగా మండుతూనే వుంటాయి. మంటలు గనపడక పోవచ్చు. కాని వాటి వునికి తెలుస్తూనే వుంటుంది!

రాగవయ్య గణపతికి స్నేహితుడు గణపతి ఎందులో వేలుపెట్టినా నేనూవున్నానంటూ ముందుకువస్తాడు రాగవయ్య. అందుకే చలపతికి రాగవయ్యఅంటే మంట. అసలు 'తనకి' ఏమిటీ సంబంధం! అన్నదమ్ముల మధ్య రాగవయ్య కల్పించు కోవటం ఎందుకూ? రాగవయ్యకి ఇంతింత కండలూఆపీ దున్నపోతులాగా వుంటాడు. దెబ్బలాటలంటేచాలు,ఆబోతులాగా ఎగేసుకుని వస్తాడు. ఆ మధ్యన గొడవలో ఒకరిద్దరి బుర్రలు బ్రద్దలు గొట్టి జైలుకికూడా వెళ్ళివచ్చాడు. రాగవయ్యని చూసుకునే గణపతికి అంతఇది! లేకపోతే వాడ్ని - ఆ 'అన్న మహానుభావుడ్ని' చలపతి సులువుగా రెక్కలు మెలేసి వంగదీసి, ఎప్పుడో పాతాళాన్కి అణగదొక్కి వుండేవాడు. నల్లినిలా నలిపి పారేసేవాడు! గణపతిబుద్ధి మంచిదిగాదు. తమ్ముడు అన్న ఇదిలేదు! పైగా కుళ్ళు, స్పర్థా! అతనికి పనీపాటా అసలేలేదు. తినికూర్చునే సోమరిపోతు. లిటిగెంటు! దొంగ!! ఎప్పుడూ ఆ రాగవయ్యగాడ్ని పెట్టుకుని, ఆ మర్రిచెట్టు మొదట్లో కూర్చుని వుంటాడు, గణపతి వాళ్ళకి తోడు మరికొందరు కేతిగాళ్ళు! వూ వక పే కబుర్లు! గుసగుసలూ, నవ్వులూ, వాళ్ళదొంగ చూపులు! చలపతివంకే, చలపతి ఇంటిమీదనే వాళ్ళదృష్టిఅంతా. మరేం పనిలేదు.

అసలు చలపతి బయటికి వస్తేచాలు; వాళ్ళ చూపులన్నీ చలపతిమీదే.

అటువంటప్పుడు ఎవరికి మాత్రం కంపరంగా వుండదూ!? సహనానికి హద్దుంటుంది గదా!

'ఒరే! నా ఇంటి ఎదర చేరి ఏమిట్రా ఆ వెధవ వేషాలూ?'–అని అరిచాడొకసారి చలపతి గాలిలోకి. అంతే. కానీ ఆ మాటవిని ఎగిరి పడ్డాడు రాగవయ్య.

'చలపతిగా! బక్క వెధవా! బొక్కలిరగదీస్తానురా జాగ్రత్త!' అని హెచ్చరించాడు రాగవయ్య.

'బొక్కలిరగదీస్తావా? ఎందుకురా?!' అన్నాడు చలపతి రోషంగా.

'పిచ్చి పిచ్చిగా వాగినందుకురా బుద్ధిలేని గాడిదా'

'అసలు నిన్నెవరన్నారిప్పుడూ? నీకు నాకు ఏమిటీ సంబంధం?'

'అయితే నిన్ను మాత్రం ఎవరన్నారిప్పుడూ? నీ కెందుకురా, ఆ వుక్రోషం?'

'వుప్పుడు బొక్కలిరగ దీస్తానన్నది ఎవర్నిమరి? నన్నుగాదా?'

'అవునా! నిన్నే. అంతేగాదురా, పిచ్చి పిచ్చిగా వాగావంటే – కత్తితో కసాపిసా పొడిచి పారేస్తాను. ఎవర్రా నీకు దిక్కు?' అని రాగవయ్య అన్నాడు. గణపతి నవ్వాడు కోతిలాగ.

'ఎవరిదిక్కు వాళ్ళకి వుంటార్లే. అట్లా విర్రవీగకు దేముడుంటాడు.'

'ఒరే! నోర్మూసుకుని మర్యాదగాపో, అట్లా చెయ్యకపోయావా, ఇప్పుడే నీకు తగినశాస్తి జరుగుతుంది రొరే, పింజారీ వెధవా! అడంగి రేకుల నాయాలా !!'

'ఛీ! మీతో నాకెందుకు?' దుర్మార్గులారా, పాపంవూరికే పోదు అనుభవిస్తారు'

'ఛీ ఛీ! నీవుమాత్రం పరమ పాపిష్టి ముండాకొడుకువి గాదూ?

'అయినా నీతో నాకెందుకూ' అని లోపలికి వచ్చాడు చలపతి ఎంతో దుగ్గపడినా ఏంచెయ్యలేక. 'ఏమిటా గొడవా?' అంటూవచ్చింది సావిత్రి తోకలాగా.

'ఏదోలే' అన్నాడు చలపతి, కండవాతో మొహానికి పట్టినచెమట తుడుచుకుంటూ.

'ఆ రాగవయ్య అనవసరంగా నిన్నుపట్టుకుని అంతంత కూతలు కూస్తే బాగాతినివచ్చి, 'ఏదోలే' అంటారెందుకూ? అసలు ఎలా వూరుకో బుద్ధయిందీ?!' అంది.

'నువ్వు అంతావిన్నావా?! అయినా – ఆడవాళ్ళకి మీ కెందుకూ మగాళ్ళ గొడవలు ?'

'అబ్బో! పెద్ద మగాళ్ళు! కనపడుతూనే వుందిగదా!'

'ఇదిగో! పిచ్చి పిచ్చిగా వాగావంటే తింటావు.' తిక్కరేగి అన్నాడు చలపతి. ఉక్రోషంతో గొణుగుతూ లోపలికి వెళ్ళింది సావిత్రి సావిత్రిది వూరుకునే తత్వంగాదు. పేనులాగా కొరుకుతూనే వుంటుంది. ఏ విషయాన్నీ పట్టుకుంటే వదిలి పెట్టదు.

కుంపటి పొగలాగా బయట,వాళ్ళు!

చెవులో జోరీగలాగా, లోపల ఈమె!! ఇంటిప్రక్కనే మహాతల్లి సక్కుబాయి వదినమ్మ!!! అట్లా రోజూ ఏదోవకటి.గణపతైతే నోరుతెరచి ఏమీ అనడు.అతనికి తనంటే భయం.వాడిదిపుట్టుకలోనే వళకాలు అవిటి. పైగా బక్కప్రాణం.అందువలన తనముందు ఆగలేడు. అందుకే–చెయ్య దల్చుకున్న పనిని , చీమచాలా చేసేసి ఏమీ ఎరగనట్లు వుంటాడు. అదేమని అడగితే పెద్దనోరు పెట్టుకుని సక్కూబాయిమీద పడుతుంది. మొగుడు మీద ఈగవాలనివ్వదు. రాగవయ్య సక్కుబాయికి బంధువు.

ఆ రాగవయ్యగాడు గనుక మధ్యలో లేకుండా వుండినట్లయితే చలపతి గణపతిని ఎప్పుడో పచ్చడిలాగ బాది తగిన బుద్ధిచెప్పి వుండేవాడు. నోరెత్తకుండా చేసేవాడు.

ఈమధ్యన తగిన శాస్తి జరిగింది రాగవయ్యకి. పాపం ఊరికే పోతుందా ? ! ఆ దుర్మార్గపు రాగవయ్య పాపం పండింది. దేవుడనే వాడులేడూ ! తగినబుద్ధి చెప్పడూ ? రాగవయ్య బండికి వరిగడ్డికట్టుకుని బెజవాడలో అమ్ముకుని వస్తానని వెళ్ళాడు.కర్మగాలి మానికొండ దగ్గరలారీకి కొట్టుకుని బండిబోల్తాపడింది. బండిమీదవున్న రాగవయ్య వరిగడ్డి అడుగున పడిపోయాడు. దాదాపు అయిదారు గంటలు అలాగే వుండిపోయాడు. బయటికి దీసి బెజవాడకి తీసుకెళ్ళి హాస్పటలో చేర్పించారు.

అప్పుడు రాగవయ్య మూడ్నెల్లు హాస్పటల్లో వుండి చచ్చి బ్రతికాడు. కాని కాళ్ళుచచ్చుపడ్డాయి. కర్రపట్టుకుని నడవాల్సిన పరిస్థితి ఏర్పడింది. అయినా వాడిపొగరు తగ్గలేదు.

పోన్లే! ఎవరిపాపం వారిది ! మనమెందుకు లోటుచెయ్యాలీ అనుకుని ఆ సమయంలో బెజవాడవెళ్ళి రాగవయ్యని పలకరించి ధైర్యం చెప్పివచ్చాడు చలపతి. సాటి మనిషికి తన ధర్మం తను నెరవేర్చాడు అంతేగానీ ఏదో ఆశించి గాదు. మనుషులకి కష్టాలువస్తాయి. ఆ సమయంలో సానుభూతిని తెలిపి చాతనయిన సహాయం చెయ్యటం సాటిమానవుల కనీస ధర్మం. అదే చేశాడు చలపతి. చాతనయిన సహాయం గూడా చేశాడు.

అయినా రాగవయ్యకి తనపయిన కనీసపు కృతజ్ఞతాభావమన్నా లేదు. స్పర్థనీ మానలేదు రాగ్గాడు! అసలు ఈరోజు జరిగింది ఏమిటి? అందులో న్యాయం అన్యాయాల పాలు ఎంత ? పళ్ళుపటపట కొరు

కుతూ కత్తిని బండకేసి నూరుతూ పొగలుసెగలు కక్కాడు చలపతి. ఆ ఆలోచనల్లోనే కూరుకుపోయాడు. రగిలి కుమిలిపోయాడు.

* * *

అందమయిన నల్లని కారునలుపు! పెద్దపెద్ద తెల్లని కన్నులు ! అందమయిన కుదుమట్టుమయిన వళ్లు. ఆరోగ్యంగా మిసమిసలాడుతూ వున్న శరీరం. వాకిట్లో కదులుతూవుంటే లక్ష్మీదేవి నడయాడినట్లు అన్పిస్తుంది. ముద్దుగా మురిపెంగా పెరిగింది. ఇంట్లోపుట్టి దొడ్లో పెరిగింది. ఏడ్నెల్లక్రితమే కట్టింది అందంగా పుబ్బుగా అయింది పొదుగు. ఈనిన్తరువాత నాలుగు లీటర్లకి తక్కువ ఇవ్వదు పూటకి! లక్ష్మి అని పేరుపెట్టుకుంది సావిత్రి. ఆప్యాయంగా పెంచుకున్నారు, దాన్ని బిడ్డలాగా!

అసలు మనుషులకే బుద్ధినిలకడగా వుండడంలేదు. ఈ రోజుల్లో అటువంటింది పశువు దానికి ఎక్కడ్నించి వస్తుంది ఇంగితం ? ! జ్ఞానం వుండదుగదా!

బాగా ఏపుగా పచ్చగా ఎదిగి వచ్చాయి బెండ మొక్కలు. నీళ్ళుపోసి ఎరువులువేసి పెంచుకుంది సక్కుబాయి. పచ్చగా పూత- చెట్లనిండా. ముమ్మరంగా పిందెలూ వచ్చాయి. ఆ తెల్లవారుఝామున, లక్ష్మి కట్టుదాడుని తెంచుకుని ఆకలిమీద అడ్డుగా వున్న కర్రల్ని పడదోసుకుని వెళ్ళి సక్కుబాయి పెంచుకున్న బెండ మొక్కలమీదపడి తిని, ఛిన్నాభిన్నం చేసింది. సర్వనాశనం అయింది. కాదంటానికిలేదు.

అప్పుడే న్రిదలేచిన గణపతి ఆ భయంకరమైన దృశ్యాన్ని చూసి కడుపు మండగా పళ్ళు పటపటా కొరికాడు. లావుపాటి ఒక దుడ్డుకర్రని తీసుకుని, లక్ష్మినిగొడ్డునుబాదినట్లు కసిదీరేటట్టు బాదాడు. శరీరంఅంతా కదుములుకట్టి వీపుమీద ఎర్రగా తేలినవాతలతో కళ్ళ నీరు గారుస్తూ మూగగా రోదిస్తూ, న్రిదలేవగానే కనపడిన లక్ష్మిని చూసి చలపతి కడుపు రగిలింది. గొడ్డునయినా వకఆలోచన లేక మానవత్వం మరచి అట్లా రాక్షసంగా ప్రవర్తించిన వాళ్ళమీద నానా రకాలుగా బూతులుదిట్టూ రంకెలు వేశాడు చలపతి. ప్రాణసమానంగా ఎంతో జాగ్రత్తగా పెంచుకున్న బంగారం వంటి బెండమొక్కలని- అట్లా సర్వనాశనం చేసిన ఆ ముదనష్టపు గొడ్డునిపెంచి, అల్లా దేశం మీద వదలినవాళ్ళని శాపనార్థాలు పెడ్తూ పెద్ద గొంతుకతో అందు కుంది అవతలనుండి, సక్కుబాయి. ఈరోజు ప్రొద్దుటిపూట మాట మీద మాటపెరిగింది, ఇద్దరి మధ్యావాదనలు వేడిగా వాడిగా నడిచాయి. శాపనార్థాలు వాడిగా బాణాల్లాగా కురిశాయి.

వావివరసలు మరిచిన తిట్లు జడివాన జల్లుల్లాగా కుమ్మరించ బడినయ్.

ఆవేశం కట్టలు తెంచుకుంది. రోషం పెల్లుబికింది.

కోపం బుసలు గొట్టింది.

ఉచితానుచితాలు అడ్రసు లేకుండా పోయాయ్!

అప్పుడు ఆసమయంలో రాగవయ్య అక్కడికి రావటంజరిగింది. అదికేవలం యాదృచ్ఛికం! సరిగ్గా అప్పుడే ఆమాట వదిలాడు చలపతి. దీనికంతటికీ కారణం ఆ కుంటి లమ్డి కొడుకు! వాడ్ని నాయెదుటికిరానీ. వాడికి వంట్లో చీమూ నెత్తురూవుంటే బరిలోకి రమ్మను. వాడ్ని ఖూనీ చేయకపోతే నాపేరు చలపతికాదు- నేను సూర్పని సుబ్బయ్యకొడుకునీ గాదు. ప్రతిజ్ఞచేశాడు చలపతి. వాస్తవానికి ఆమాటలు వుద్దేశింప బడింది గణపతికి; నిందితుడు గణపతి.

కానీ అవి అప్పుడే అక్కడికి వచ్చిన రాగవయ్యకి సూటిగా తగిలాయ్. 'ఒరే! ఎంట్రాచలపతీ వళ్ళు ఎలావుందిరా ?' అని అందు కున్నాడు రాగవయ్య.

'ఒరేయ్! పిరికి సన్యాసి ! నేను అన్నిటికీ తెగించిన వాడ్నిరా వుత్తపుణ్యానికి నన్ను ప్రొద్దున్నే పట్టుకుని ఎంతమాటలన్నావురా గాడిద కొడుకా ! రేయ్ ! ఇవాళ నువ్వోనేనో తేలిపోవాలి. రా రా పొడిచి పారేస్తాను. ఇవాళ రక్తం వరదలయిపారాలి. ఈ పూట ఈ వూళ్లో శవంవెళ్ళాలి. అంటూ వీధిలో నిలబడి పెచ్చరిల్లిన ఉద్రేకంతో గావుకేకలు పెట్టాడు రాగవయ్య; చలపతి మాటల్ని విన్పించుకోనేలేదు.

అప్పుడు చుట్టుప్రక్కల వాళ్లు న్రిదలేచి వీధిలోకి వచ్చి చూడటం సాగించారు. ఆడవాళ్ళు ప్రహరీ గోడలమీద తలలుపెట్టి చూస్తూ ఆనందించ సాగారు.

అప్పుడు ఆ క్షణాన రాగవయ్యతో కలబడటం క్షేమంగా అన్పించలేదు చలపతికి. అవటానికి అవిటి వాడయినా రాగవయ్యలో బలం జవం ఇంకా తగ్గలేదు. పైగా రైడింగులకీ దొమ్మీలకీ అలవాటు పడిన మనిషి రాగవయ్య. అన్నిటికీ తెగించిన వాడితో బరిమీద కలబడ్డం ఎవరికీ శ్రేయస్కరం గాదు. తెగించి దేనికయినా సిద్ధపడటం అందరికీ సాధ్యమయ్యే పనిగాదు-రాగవయ్యవంటి దుర్మార్గులకితప్ప.

అట్లా రాగవయ్య-ఇంటిముందు వీధిలోనిలబడి బూతులు తిట్టున్నా ఇవన్నీ ఆలోచించే - పిల్లిలాగా లోపలికి వచ్చాడు చలపతి. కాసేపు అల్లరిచేసి చలపతిని నీచంగా దూషించి తనదార్ని తను సాగి పోయాడు రాగవయ్య. సర్దుమణిగాక తలుపు ఓరగాతీసి రాగవయ్య వున్నాడో పోయాడో చూడపోయాడు చలపతి. వాకిట్లోనుంచుని సక్కు బాయితో కబుర్లుచెప్తూ - తన గురించే అపహాస్యంగా 'చతురు' వేసి- కోతిలాగా నవ్వాడు గణపతి. పరమసంతోషం గణపతికి! దుర్మార్గుడు గదా!చలపతికి-గణపతి అలా తననిచూసి నవ్విన మీదట-

వక్కసారిగా భగ్గుమంది గుండె; లావా వెళ్ళగక్కిన అగ్ని పర్వతంలాగా భుగభుగమంది; కుతకుత వుడికింది; గడ్డివామి అంటు

కున్నట్లు భగభగలాడింది; మనస్సు గిలగిల లాడింది. తనని గురించి అందరూ నవ్వుకుంటున్నారు. నగుబాటుకు గురయిన ఈ బ్రతుకు అసలు ఎందుకూ అన్పించింది. ఛీ అనుకున్నాడు - చలపతి. పవురుషం లేని బ్రతుకు అసలు బ్రతుకేకాదు. ఇవాళ భస్తే రేపటికిరెండు - అను కున్నాడు.కాకిలాగ నూరేళ్ళు బ్రతికి ఏంలాభం? అయితే వాడ్నిచంపాలి· లేకపోతే తను చావాలి. ఏదోవకటి జరగాలి.

అంతేగాని- ఇంత నికృష్టంగా అవమానం జరిగాక దాన్నిభరించి దిగమింగి బ్రతికి వుండటం అనవసరం అనుకొని స్థిర నిశ్చయానికి వచ్చాడు చలపతి.

'ఎక్కడ? కత్తి ఎక్కడా?' అని అరిచాడు, అందుకే, గావుకేకలుపెట్టి.

* * *

చలపతి- కత్తికి పదును పెట్టడం అయ్యింది. చేతికి ఆనించి కదిపితేచాలు కస్సుమని దిగబడేటంత వాడితేలింది. వక్కవేటు చాలు. బస్. అంతే!

'ఇదిగో,నేను పోతున్నా! అన్నాడు చలపతి సావిత్రిని వుద్దేశించి.

'ఏమిటీ? అంటూ లోపల్నుంచి వచ్చింది సావిత్రి.

'ఇవాళ నేనో ఆ రాగవయ్యగాడో తేలిపోవాలి, వాడ్ని ఈకత్తితో పొడచిచంపి పారెయ్యటాన్కి పోతున్నాను. కాదంటే, వాడి చేతిలో నేనే చస్తాను! గొంతెత్తి భీషణప్రతిజ్ఞ చేశాడు చలపతి. రౌద్రంతో వూగిపోయాడు. సాగిపోవాలిని నాలుగడుగులు వేసాడు. అగి వెనక్కి తిరిగి చివరిసారి చూపు అన్నట్లుగా భార్యని ఆపేక్షగా చూసాడు. విషయం అర్థయిన సావిత్రి ఏడుపు మొదలెట్టింది. ఏడుస్తూనే చలపతి చుట్టూ చేతులు చుట్టింది. అతన్ని కదలనీకుండా పట్టుకుంది.

'ఇటువంటివి మనకు వద్దు' అని లబలబ లాడింది.

'మీకేమైనా అయితే నేనేమయి పోవాలి! నా పసుపు కుంకుమలు ఏంగాను! దేవుడా! ఇటువంటి దుందుడుకు పనులు వద్దు. ఆ రాగవయ్య అసలే మంచివాడు కాదు. దుర్మార్గుడు, ఖూనీకోరు. నాయనా! శ్రీరామ చంద్రా! నా సంసారాన్ని కాపాడు.'-అని మొత్తుకుంది. చలపతి చేతిలో నుండి కత్తినిలాగి అవతల పారేసింది! శోకాలు తీసింది. చలపతికి పిచ్చి కోపం వచ్చింది.

'ఛీ' అని ఛీత్కరించి, కోపం ఆపుకోలేక-సావిత్రిని వంగదీసి వకబాదు బాదాడు చలపతి. చలపతికి భార్యమీద ప్రేమ మెండు. అందువలన దెబ్బతగలకుండా-శబ్దం వచ్చేటట్లు 'చప్పిడి బాదు'నే బాదాడు. దెబ్బ ఏం తగలలేదుగాని- అదంతా చూస్తూ-

-గోడ మీద తలపెట్టిన సక్కుబాయి భళ్ళున నవ్వింది. అది గమనించి భగ్గుమని బొగ్గుల పొయ్యిలాగా మండింది సావిత్రి; మొగుడు కొట్టినందుకు కాదు- -

నా మీద చెయ్యి చేసుకుంటావా? ఇకనీతో సంసారం చెయ్య లేను, పుట్టింటికి పోతాను! అని శపథం చేసి, వున్నపాటున బయలుదేరి బస్సుకోసం వంతెన దగ్గరకి సాగిపోయింది సావిత్రి; కన్నీరు పమిట చెంగుతో తుడుచుకుని, రోషంగా బుసలుగొట్టూ. ఆ దెబ్బకి కుదేలయి, జాపగార, తలపట్టుకుని కూర్చున్నాడు చలపతి. ఎన్నడూ లేనిది ఎంత పని చేసాడు తను!

అయోమయంగా అన్పించింది. కారణాలు పారణాలు అంతు బట్టటంలేదు!

జరిగిందేమిటి? జరగబోతున్నది ఏమిటి?! కార్యకారణ సంబం ధాలు అసలు ఏమైనా వున్నవా? చాలా సేపయ్యాక- ఆవేశం చల్లారి పశ్చాత్తాపం చోటుచేసుకుంది. పాతికేళ్ళుగా ఆ ఇంటి లక్ష్మిలా మసిలిన సావిత్రిలేని ఆ ఇల్లు ఒకఇల్లు గాదనీ, ఆమెలేకుండా తనజీవితం గడ వటం దుర్భరమనీ అన్పించింది చలపతికి. ఉద్రేకంతో వుచితానుచి తాల్ను మరచి తనే తప్పు చేశాడు. అందువలన సావిత్రికి క్షమాపణలు చెప్పి తిరిగి తీసుకురావాలని నిశ్చయించుకొని- వంతెన దగ్గరకు బయలు దేరాడు చలపతి.అప్పుడే అసంగతి అందరికీ తెల్సిపోయింది!ముదనష్టపు వూరుగదా! పైరుగాలి పెరపెరా వీవసాగింది. దానికి బుద్ధిలేదు; దూకుడు

ఎదురుగా- కర్ర ఆనించుకుని నడిచి వస్తున్నాడు రాగవయ్య!

దగ్గరయ్యారు రాగవయ్య, చలపతి. చలపతికాళ్ళు ఆగిపో యాయి. బిర్ర బిగుసుకుపోయి తీక్షణంగా రాగవయ్యవంకే చూస్తూ నిల్చిపోయాడు చలపతి. ఆ చూపుల్లో ఎన్నో అర్థాలు! ఆస్థితిలో చల పతిని-లిప్తపాటులో గమనించాడు రాగవయ్య - నవ్వాడు.

'ఒరే! చలపతీ! చెల్లెమ్మ వంటరిగా వంతెన దగ్గర బస్సుకోసం ఎదురుచూస్తూ కూర్చుంది. మగాడు తన ప్రతాపాన్ని చూపించాల్సింది, తనని నమ్ముకున్న ఆడదాని మీదకాదురా. నా దృష్టిలో నువ్వూ గణ పతీ ఇద్దరూ సమానులే. కాకపోతే-పెద్దాచిన్నా అన్నది మరచి గణపతి మీదకి మాటమాటికీ ఎగిరిపడే నీ దూకుడును తగ్గించటానికే నేను అట్లా కల్పించు కోవలసి వచ్చింది. అంతేరా! సావిత్రి అట్లా పుట్టింటికి వెళ్ళి పోవటం మనూరికి మనకి గౌరవప్రదం కాదు. నేను గణపతిని కూడా మందలిస్తానులే. బజార్నపడి చీటికీ మాటికీ దెబ్బలాడు కుంటే ఎవ్వరి పరువూ నిలవదు! అయినా రక్తంపంచుకుని పుట్టిన అన్నదమ్ములు గదా! మీకు ఇదేం తెగులురా?! వెళ్ళు. వెళ్ళి చెల్లెమ్మని బ్రతిమాలి పిలు చుకునిరా' - అని చలపతిని హెచ్చరించాడు. రాగవయ్య, అనునయ పూర్వకంగా. రెండుక్షణాలు ఆగి- మళ్ళీతనే--

'ఒరే! నేనూ, నీ విషయంలో తొందరే పడ్డాను.తర్వాత కొంచెం ఆలోచిస్తే నాకే అన్పించింది. అదంతా మర్చిపో వెళ్ళిరా.' అని సాగి పోయాడు రాగవయ్య. చమర్చిన కళ్ళుతుడుచుకుంటూ గబగబ వంతెన వయిపు అడుగులు వేసాడు చలపతి; తలను దున్నపోతులాగా వూపి, రాగవయ్య మాటలని ఆమోదిస్తూ.

# శతాంజలి

## శ్రీ బయిరెడ్డి సుబ్రహ్మణ్యం

పండిత ప్రకాండులు, విమర్శకాగ్రేసరులు, కవివతంసులు, యోగీశ్వరులు, పూజ్యపాదులు, కీర్తిశేషులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి మహోదయుల శతజయంతి సందర్భ శతాంజలి.

సీ॥ నీ పుత్త్రులున్నారు నీకుఁ గృతజ్ఞతా
పాత్రులై సార్థక పుత్త్రులగుచు
నీ శిష్యులున్నారు నీ కీర్తి దశదిశల్
ప్రకటింప శక్తిసంపన్నులగుచు
నీ మిత్రులున్నారు నేఁడు ప్రార్థన వేళ
లందు నిన్ హృదయంబులందుఁ గనుచు
నీ భక్తులున్నారు నిండు క్షేమమ్ముగా
విగతరోగార్తులై సుగతి గనుచు

తే॥ నీవు నాటిన బీజముల్ నేఁడు-మూఁడు
పూవు లారుకాయలు బళీ! ప్రోదియగుచు
శత జయంతి సుధీ! నమస్కారశతము
కరుణగైకొను వేటూరి గురువరేణ్య!

---

# నిశీధి నీరాజన

## శ్రీ శివకుమార్

దరిద్రుల శరీర నిర్మల ఘర్మ జలఫలం
ధనికుల శీతలీకరణ ఆకాశ హర్మ్యం
గణనకు రాని అపార కాలధన ధర్మం
కఠిన శిలాహృదయాన్ని కరిగించవు మౌనబాష్పాలు
నల్దిశలా దుర్గంధ దురాశా ఫలాలు
గ్రామ దేవాలయంలో మానభంగ హత్యలు
మత పోరాటాల నెత్తురు మరకలు
రాజకీయ రాక్షస కళాఘాత నిహతుని
నయనాల్లో ఘోర భయంకరాక్షరాలు
చరిత్రపుటల్లో చెరగని మచ్చలు
అశ్లీల పత్రికల అనృతగాథలు
దేహం ఆధ్యాత్మిక పుణ్య పంకజం
మనసు భౌతిక పాప పంకిలం
సంగచ్ఛధ్వం సంవదధ్వం*
సహపయం సహజీవనం
సర్వభూతహితం సుమనోధర్మం
లోకం పూర్ణ వికసిత ప్రేమపద్మం

* ఋగ్వేదం (10-191-2)

శ్రీ ఎన్. వేణుగోపాల్

# చారిత్రక అవసరంగా విప్లవోద్యమ కవిత

## తెలుగు విప్లవ కవిత ప్రారంభ దినాలు - ఒక పరిశీలన

( గత సంచిక తరువాయి )

కవిత్వం మీద శ్రీకాకుళ విప్లవోద్యమ ప్రభావం మౌఖిక కవితా రూపమైన పాటలోను, మధ్యతరగతి కవితారూపమైన వచన కవితలోను కూడ ప్రతిఫలించింది. ఉద్యమం కొనసాగిన ప్రాంతంలోని సవర జాతాపు గిరిజనులను సమీకరించే అవసరం కోసం పాటలను ఆశ్రయించిన నాయకత్వం శ్రీకాకుళ విప్లవోద్యమ కవిత్వంలో తొలి అధ్యాయాల్ని రచించింది.

"కొండజాతి పేదరైతా
కొండమీద నీది బ్రతుకు
కండలన్నీ పిండి చేసుకొని
ఓ గిరిజన రైతా
పంటలన్నీ పండించెదవెంతో
పండినట్టి పంటలన్నీ
పదియు రూకలకు నీవు
పాడు చేయుచుంటివేమోయి
ఓ గిరిజన రైతా - నీదు బ్రతుకు నీరుగారెనూ
వర్తకులు వడలు బలిసి
గుర్రుమనుచూ నిన్నుచూచి
కన్నులెర్ర చేయుచుండెదరో
ఓ గిరిజన రైతా - నన్నుజూచి నవ్వుచుండెదరో
ఏమి భయము లేదు నీకు
ఎర్రజెండా నీడకు రావోయ్
బాధలన్నీ బాసి పోవునురా
ఓ గిరిజన రైతా - నీదు కష్టములు తీరునురా"[14]

అనే పాట పాడేసరికి గిరిజనులలో సంచలనం వచ్చేదని, వారిని సంఘటిత పరచడానికి పాటలు ఉపయోగపడేవని సత్యం రాశాడు. అదే విధంగా "నిదుర లేర ధీరుడ-కొండజాతి వీరుడ" అనే పాటతో సభ ముగించే వారమని కూడ ఆయన రాశాడు. ఈ రెండు పాటలను కట్టినవాళ్లుగాని, రాసిన వాళ్ళుగాని ఎవరో తెలియదు. రెండో పాట శీర్షికే తప్ప మొత్తం పాటకూడ లభ్యం కాలేదు. ఐతే శ్రీకాకుళ విప్లవోద్యమ కవిత్వానికి ప్రథమ సూచికలుగా వీటిని గుర్తించవచ్చు.

ఉద్యమం విస్తరిస్తున్నకొద్దీ కొన్ని వివరించవలసిన అవసరం, దాన్ని హృద్యంగా చిత్రించి మరింత ఎక్కువ విస్తరణను సాధించడం అవసరమవుతుంది. అందుకే పాటల అవసరం పెరిగింది. ఉద్యమ కార్యకర్తల నుంచి పాటలు రావడం మొదలయింది. స్వయంగా వెంపటాపు సత్యం పాటలు రాశాడు. చాల మామూలు పదాల్లో విప్లవోద్యమ అవసరాన్ని గిరిజనులకు వివరించాలని ఆయన పడిన తపన ఆయన పాటలన్నిట్లో కనిపిస్తుంది. 'కదలి రండి' 'లేవరా! లేలేవరా-వీరుడా' 'తొలివిజయం' 'కొండజాతి సింగములు' పాటలు శ్రీకాకుళ ఉద్యమంలోని అనేక ఘట్టాల్ని స్పష్టంగా, మనసుకు హత్తుకునేట్టుగా చిత్రించాయి. 'మావో సూక్తులు' వంటి గేయాలలో విప్లవ ప్రజానీకానికి ఏ శాస్త్రీయ దృక్పథం ఉండాలో ఆయన ప్రబోధించాడు. అలా ఒకవైపు ఒక మహత్తర ప్రజా ఉద్యమానికి పునాదివేస్తూనే ఆయన ఆ ఉద్యమ కవిత్వానికి కూడ పునాది వేశాడు ఆ రకంగా కవికీ, కార్యకర్తకూ మధ్య, మేధోశ్రమకు శారీరక శ్రమకూ మధ్య ఉన్న కృత్రిమ విభజన రేఖలను చెరిపివేసి వెంపటాపు సత్యం తెలుగు సాహిత్యంలో ఒక అరుదైన సాంప్రదాయాన్ని నిలబెట్టాడు.

వెంపటాపు సత్యం కన్న ముందునుంచీ కవిత్వంతో శ్రీకాకుళ ఉద్యమాన్ని అందుకోడానికి ప్రయత్నించిన వాడు సుబ్బారావు పాణిగ్రాహి. వెంపటాపు సత్యం ఉద్యమ అవసరాలకోసం ఉద్యమంలో నుంచే కవిత్వంలోకి తొంగిచూడగా, సుబ్బారావు పాణిగ్రాహి సాహిత్య రంగంలో నుంచి ఉద్యమ కర్తవ్యాలు స్వీకరించాడు. ఇద్దరూ రెండు రంగాలలోనూ అసమాన ప్రతిభను ప్రదర్శించారు.

సుబ్బారావు పాణిగ్రాహి 1967 చివరికే శ్రీకాకుళం ప్రజా ఉద్యమ గాథను జముకుల కథగా రాశాడు. 1968 అక్టోబర్ నాటికే ఆయన గేయ సంపుటి 'అగ్నికణాలు' ప్రచురితమైంది. స్వయంగా

**కళాకారుడు** కావడం, ఇంగ్లీషు- హిందీ, ఒరియా, బెంగాల్ భాషల పరిచయం ఆయనను విలువైన సాంస్కృతిక సైనికుడిగా మలిచాయి. ఆయన కవిత్వంలో సాంప్రదాయిక ఛందస్సు కొంతా, కఠినపద ప్రయోగం కొంతా ఉన్నప్పటికీ ఆయన కవిత్వపు ప్రధాన లక్షణాలు దూరదృష్టి, ఆశావాదం, లోతయిన అవగాహన

'అగ్ని కణాలు' గేయ సంపుటిని ఆయన "కరకు కాంగ్రెస్ ప్రభుత్వ పోలీసుల తుపాకీ గుండ్లకు ఛరియై నేలకొరిగిన శ్రీకాకుళం జిల్లా గిరిజన విప్లవ వీరులకు" అంకితం చేశాడు ఈ అంకితం "అశ్రు పూరిత నయనాలతో కాదు"నీ, వాళ్ళ "ఆశయాలు సాధించి తీరుతా మనే ఆత్మ విశ్వాసంతో పిడికిలిబిగిస్తూ"నని ఆయన ప్రకటించాడు.[15]

"ఎగిరిందీ ఎర్రజెండా! కదిలిందీ ప్రతికొండా। గిరిజన సంఘా లెలిశాయీ। దుర్జనుల కెదురు నిలిచాయీ"[16] అని శ్రీకాకుళ ఉద్యమాన్ని ఆయన ఈ సంపుటిలో చిత్రించాడు. "కలకత్తాలో వేయు। సరికొత్త నీకేక। కంపనం పుట్టింది। మా శత్రువర్గాలు। బిత్తరై పోయాయి। మాకోటి వర్గాలు। జేజేలు కొట్టాయి"[17] అని నక్సల్బరీ ఉద్యమానికి జేజేలు పలికాడు.

సుబ్బారావు పాణిగ్రాహి శ్రీకాకుళ విప్లవోద్యమానికి అవసరమైన తక్షణ సమస్యల మీద కవిత్వం రాస్తూనే, బైటి ప్రాంతాల ప్రజల్ని ఉద్దేశిస్తూ విప్లవపు సాధారణ స్వభావాన్ని చిత్రిస్తూ కూడ కవిత్వం రాశాడు. ఆయన రాసిన సాధారణ స్వభావంగల గేయాలలో 'ఎరుపు', 'తూర్పు జెండా' 'మేం కమ్యూనిస్టులం' ముఖ్యమైనవి.

"ఎరుపంటె కొందరికి భయం భయం
పసిపిల్లలు వారికన్న నయం నయం
సూర్యునిలో తొలికాంతి మెరుపు మయం
ఎరుపులోని ఆనందం అతి రమ్యం ॥ఎరుపంటె॥
ప్రకృతిలో పూలు ఎరుపు మందారం
స్త్రీల నుదుటి తిలకం ఎర్రని సింధూరం ॥ఎరుపంటె॥
ఎరుపు రంగు ఎన్నటికీ కాదు అపాయం
అపాయాన్ని తప్పించే ఒక సదుపాయం ॥ఎరుపంటె॥
మనలోనే ఎరుపున్నది మరచి పోకుమా
మనరక్తం ఎరుపు ఎరుపు తీసి చూడుమా ॥ఎరుపంటె॥
ఎరుపులోనె మెరుపుండి పోరాడే శక్తుంది
శ్రమజీవుల హక్కులకై ఎలగెత్తే అరుపుంది ॥ఎరుపంటె॥[18]

అంటూ పాణిగ్రాహి ఎరుపుకు విశ్వవ్యాప్త స్వభావం ఉన్నదని ప్రదర్శించాడు.

సమకాలీన సమాజ చిత్రణ, నిద్రలో ఉన్నవారి మేల్కొలుపు, జన చైతన్య విస్ఫోటనానికి ఆహ్వానం, ఇప్పటికే ఆ చైతన్యాన్ని సంతరించుకున్న ప్రజల ప్రశంస, అమరవీరుల సంస్మరణ, సాధారణ భావనల వివరణ మాత్రమే పాణిగ్రాహి కవితాక్షేత్రంలో ఉంటే ఆయన పూర్తిగా ఉద్యమకవి అయి ఉండేవాడు కాదు. కేవలం ఒక వ్యాఖ్యాతగా కూడ ఆ లక్షణాలన్నీ గల కవిత్వం రాయవచ్చును. కాని సుబ్బారావు పాణిగ్రాహి ఉద్యమ కారుడు. ప్రజలతో మమేకమైన కవి పోరాట ప్రజానీకంతో తాదాత్మ్యం చెందుతున్న కవి. బైటినుంచి ప్రజల గురించి రాసినట్టుగా కాక, ప్రజలలో నుంచి ఒకడుగా, ప్రజా గళాన్ని ప్రతిధ్వనించక తప్పదు. అందుకే ఆయన కవిత్వంలో 'హెచ్చరిక' కూడ భాగమైంది.

"దిక్కు-మొక్కు-లేని జనం ఒక్కొక్కరు అగ్నికణం
సింహకంఠనాదంతో వస్తారిక కాచుకొండి
కోట్ల గొంతు లొక్కసారి గర్జిస్తయ్ గర్జిస్తయ్
సీట్లమీద కూర్చుండే మంత్రులార ఖబర్దార్!
ప్రజాస్వామ్యవనే ముసుగు తగిలించే మీ పాలన
సజావుగా పరిసమాప్తి జరగు రోజులొస్తున్నాయ్"[19] అని

ఆయన హెచ్చరించాడు.

ఉపాధ్యాయులను ఉద్యమకారులగా, కవులుగా మార్చిన శ్రీకాకుళ విప్లవోద్యమం. కవులను ఉద్యమ కారులుగా, ప్రచారకులుగా మార్చిన శ్రీకాకుళ విప్లవోద్యమం నిరక్షరాస్యుల సృజనాత్మక శక్తిని కూడ వెలుగులోకి తెచ్చింది. నిర్బంధం ఫలితంగా పందలాది మంది గిరిజనులు అరెస్టయి విశాఖపట్నం జైల్లో మగ్గిపోయారు. ఆ జైలులో వెలువడిన కవిత్వంతో, సత్యం, పాణిగ్రాహి రాసిన కొన్ని కవితలు కలిపి 'శంఖారావం' కవితా సంకలనం ప్రచురితమైంది. ఈ సంకలనంలో వెంపటాపు సత్యంపై 'విప్లవజ్యోతి' అనే సంస్మరణ గీతాన్నీ, పంచాది నిర్మలపై 'అరుణతార' అనే సంస్మరణ గీతాన్నీ నిరక్షరాస్య గిరిజనులే కట్టారు.

'శంఖారావం' సంకలనంలో ఎక్కువ గీతాలు అమరవీరుల సంస్మరణ గీతాలే. పంచాది కృష్ణమూర్తి, సుబ్బారావు పాణిగ్రాహి, వెంపటాపు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం, పంచాది నిర్మల, చాగంటి భాస్కరరావు, ఎం. వి. రమణమూర్తి, బిక్కి రాములు, చిన్నం నాయుడు, అప్పారావులను సంస్మరిస్తూ రాసిన పాటలు ఇందులో ఉన్నాయి. 'శ్రీకాకుళం లోన చిందింది రక్తమ్ము'. 'ఈ విప్లవాగ్నులు ఎటిదని అడిగితే' వంటి ప్రసిద్ధమైన పాటలు కూడ ఈ సంకలనం లోనివే. చివరికి ఈ సంకలనం లోని కవులు విప్లవ రాజకీయాలను వివరించేందుకు సీసపద్యాలను కూడ వాడుకున్నారు. శ్రీకాకుళ ఉద్యమం సాంస్కృతిక రంగంలో సాధించిన విజయానికి శంఖారావం సంకలనం తొలి ప్రతీక.

మరొకవైపు 1969 నాటికే శ్రీకాకుళ విప్లవోద్యమం వచన కవితలో ప్రతిధ్వనించడం మొదలయింది. 'తిరుగబడు' కవులు

శ్రీకాకుళాన్ని వచన కవితలో మొదటిసారిగా గుర్తించారు. ఐతే వాళ్ళు కూడ బహిరంగంగా శ్రీకాకుళం పేరు ప్రస్తావించలేదు గాని వాళ్ళ కవిత్వానికి నేపథ్యంగా ఉన్నది శ్రీకాకుళ మేనని అర్థమవుతుంది.

"తిరుగుబాటు తత్వం మానవ స్వభావంలో ఉన్నది. ఈనాడు మేల్కొంటున్న ఈ దేశంలో అక్కడక్కడా రాజుకుంటున్న ప్రజా పోరాటాలే అందుకు నిదర్శనాలు. ప్రజలు గెలుస్తారు. పరిపాలకులు తమ బూజు పట్టిన సాలెగూళ్ళలో చస్తారు. ఏ శక్తీ జనశక్తిని ఎదిరించలేదు. ఏ యుక్తీ యువరక్తాన్ని ఎంతోకాలం చల్లార్చలేదు.

"అరణ్యాల్లో, కొండకోనల్లో, చెట్లల్లో, పొదల్లో కార్చిచ్చులా రాజుకుంటున్న ఈ జ్వాలల్ని పంచడానికే మాయీ తిరుగుబాటు హస్తాలను అందిస్తున్నాం. మాతోపాటు ఈ దేశంలో విప్లవం రావాలని నిజాయితీగా భావిస్తున్న వెన్నెముకా, ముందుచూపూ గల యువకు లందరినీ అందుకే తిరుగబడదాం రమ్మంటున్నాం. పదను పెట్టిన కత్తి అంచుమీద రక్తాక్షరాలతో ఇదే మా పిలుపు. అందుకొని కదలండి"[20] అని 'తిరుగబడు' కవులు దేశ యువతకు పలికిన సమరాహ్వానం కవిత్వంలో వెలువడి కవిత్వాన్ని జాజ్వల్యమానం చేసింది

"యిక జాగుచేయక జూలు దులుపు
నీతోపాటు అడవి అడవంతా కదుల్తుంది
వొళ్ళు విరిచి చేసే నీ ఆకలి గర్జనకు
ఉప్రకృతి పలుకుతుంది
ఇంక జైత్రయాత్రకు కదులు
నిద్రమత్తు వదులు
నువు విశ్రమిస్తున్నావని నమ్మి
ఈ అరణ్యాన్ని ఎక్కడి కక్కడికి
కొల్లగొంటున్న క్రూర మృగాల మీదికి లఘించు
చీకట్లలోకి సెర్చిలైట్లలా ప్రసరించే
నీ కళ్ళు చిట్లించు
సముద్ర గర్భంలోంచి
కెరటాల హోరు లేపగల
నీ కంఠీరవత్వాన్ని నిరూపించు
ఒక్కసారి యీ అరణ్యమంతా
ఒక జాగృత కోలాహల జీవమై
స్వాగతం పలికేలా కదలిరా

ఈ సోమరి గుహను వదలి రా"[21] అని ప్రజను నిద్రిస్తున్న సింహంతో పోల్చి తిరుగబడు కవులు మేల్కొల్పు గీతాలు పాడారు. తామే ప్రజలయి "ఇరవయ్యేళ్ళ అవమానంతో కాలి కాలి ప్రేలుటకు సిద్ధంగా ఉన్నామని, ట్రిగర్ మీద వేళ్ళతో రమ్మని" యువతరాన్ని పిలిచారు. రాజ్యం మీద, విద్యావ్యవస్థ మీద, మతం మీద, దేశభక్తి పేరుమీద ఊరేగుతున్న పాలక భక్తిమీద ధిక్కారాన్ని ప్రకటించారు. తిరుగబడక తప్పదని పిలుపిచ్చారు.

"నిన్నటి సంధ్యారాగంలో నేను వినిపించిన విజయగీతం
ఇంకా ప్రతిధ్వనిస్తూనే వుంది
మానవాళికి పంపిన నా సందేశం
ఇంకా మారు మ్రోగుతూనే ఉంది
మానవజాతి తన మనుగడకై చేస్తున్న సంఘర్షణ
ప్రతిచోట కనబడుతూనే వుంది
చైతన్య జీవుల చేతనాన్ని నేను
విశ్వైక జీవుల విశ్వాసాన్ని నేను
వెలుగు రేఖను నేను, వేగుచుక్కను నేను
మానవతను నేను, మంచిని నేను
రేపటి అరుణోదయంలో నా ప్రభాతగీతం వినండి
చీకటి పొరల్ని చీల్చుకుని వస్తున్న
ఉషఃకాంతిలో స్నానం చేయండి
నేను చిందిన రక్తం ఈ సంధ్య
నేటి నాస్వప్నం రేపటి ఉషస్సు"[22] అని ఆశను ప్రకటించారు.

"ఇప్పుడే మలుపు తిరగాలో ఆ మలుపు తిరిగాం
ఇప్పుడే పిలుపు వినాలో ఆ పిలుపు విన్నాం
లే లే
లేవవేం లే.........
ముఖంపై ఎర్రదాలు తెచ్చుకొని
హృదయాన్ని జోదులై విప్పుకొని
లేవవేం - లే
తరుణమిది
మరణమో
విప్లవ సమూజావతరణమో
తేల్చుకో, లే లే-"[23] అని తెలుగు కవితను మేల్కొలిపారు.

అంతకు కొంచెం అటూ ఇటూగానే

"కాలచక్రం గిరగిర గిరగిరా తిరిగింది
వర్గపోరాటం కళాకారుని మార్గమైంది"[24] అని చెరబండ రాజు.

"ఇవాల్టి కావ్యానికి ఛందస్సు–ఉద్యమం
కవిసమయం–తిరుగుబాటు
విప్లవం ఈనాటి కావ్యానికి స్పందన"[25] అని.
"విప్లవ కలాలు విప్లవాన్ని రాయడానికి
పదునవుతున్నాయ్

యువగళాల నాళాల్లో నెత్తురు
విప్లవాన్ని పాడాలని ఉరుకుతున్నది"[26] అని వరవరరావు తెలుగు కవిత ప్రవేశించిన కొత్త క్షేత్రాన్ని వివరించి ఉన్నారు.

1970 ఫిబ్రవరిలో విశాఖపట్నంలో శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా "విశాఖ విద్యార్థులు" విసిరిన 'రచయితలకు సవాల్'లో "స్పానిష్ విప్లవంలో ప్రాణాలు పోగొట్టుకున్న సాహిత్యకారుడు క్రిస్టోఫర్ కాడ్వెల్‌లాగా తను రాసిన ప్రతి పద్యం గిరిజనుల నోటి ఊతపదంగా చేసి శ్రీకాకుళ విప్లవ పోరాటంతో వీరమరణం చెందిన సుబ్బారావు పాణిగ్రాహిలా సాహిత్యాన్ని జీవితాన్ని మార్చే శక్తిగా మీరెందుకు చెయ్యలేరు?"[27] అనే ప్రశ్న 1966 నుంచి వెలువడుతున్న ఇటువంటి ప్రశ్నలన్నిటికీ శిఖరాయమానంగా బలంగా, సూటిగా తెలుగు సాహిత్యం ముందుకొచ్చింది.

ఈ ప్రశ్నకు సమాధానంగానే తెలుగు సాహిత్యంలో విప్లవ శిబిరం సంఘటితమైంది

"కసితో స్వార్థం శిరస్సు గండ్రగొడ్డలితో
నరకగల్గిన వాడే నేటి హీరో
ప్రజల గుండెల కొండల్లో మాటుకాసి
ట్రిగర్ నొక్కగలిగినవాడే ద్రష్ట
ప్రజను సాయుధం చేస్తున్న రివల్యూషనరీ నేటి కవి"[28]

అని హీరో, ద్రష్ట, కవి అనే పదాల్ని నిర్వచిస్తూ 'విప్లవకవులు' 'మార్చ్' వెలువరించారు. 1970 జులైలో ప్రచురితమైన ఈ సంకలనంలో,

"నిన్న నక్సల్‌బరీలో వీచిన గాలి
నేడు శ్రీకాకుళంలో వీస్తున్న గాలి
రేపు దేశమంతటా వీచనున్న గాలి"[29] అని ప్రకటించారు.

అదే విధంగా శ్రీకాకుళ గాలి సాహిత్యరంగమంతా వీచి, ఆ ఉద్యమ స్ఫూర్తితో, సుబ్బారావు పాణిగ్రాహి ఆదర్శంగా విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. విప్లవ రచయితల సంఘం తొలి రోజుల్లో విప్లవ కవుల సంఘం అనిపించేంతగా కవిత్వాన్ని ఆదరించింది. సంస్థగా విరసం అన్ని ప్రక్రియల పుస్తకాలను ప్రచురించినప్పటికీ, కవుల సంఖ్యరీత్యా, కవిత్వంలో పెరిగిన ప్రమాణాల రీత్యా విప్లవోద్యమంలో కవిత్వానికి అత్యధిక ప్రాధాన్యత లభించింది. నిర్మాణరీత్యా విరసం సభ్యులయినా, కాకపోయినా విప్లవ రాజకీయాలపట్ల, ప్రజల విముక్తి పట్ల అనుబంధాన్ని ప్రకటిస్తూ ఎందరో కవులు ముందుకొచ్చారు.

విరసం మొదటి ప్రచురణ 'ఝంఝ' మహాకవి శ్రీశ్రీ కవితలనుంచి తొలిసారిగా కవిత్వం రాస్తున్నవాళ్ళ కవితల వరకు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలవారి కవితలకు చోటు కల్పించింది. "కలంతో కాలాన్ని గెలిచి, కదనంలో నేలకొరిగిన శ్రీకాకుళ గిరిజనోద్యమ కవి సుబ్బారావు పాణిగ్రాహి అరుణామర స్మృతికి" ఈ సంకలనం అంకితమైంది. కలంతో కాలాన్ని గెలవడానికి, కదనంలో ముందుకు సాగడానికి తెలుగు కవిత ప్రకటించిన సంసిద్ధతకు ఈ సంకలనం అద్దం పట్టింది. 'ఝంఝ' కవితా సంకలనంలోని 'నరుడో, భాస్కరుడా! పాట ఒక నూతన ధోరణికి, ఒక నూతన అవసరానికి చిహ్నంగా గుర్తిస్తున్నారు. అంటే విప్లవోద్యమ కవిత తన వేళ్ళను వెతుక్కుంటూ సాగి మళ్ళీ పాటలో తనను తాను ఆవిష్కరించుకుంది సామాజిక రంగంలోలాగానే సాహిత్య రంగంలో కూడ శ్రీకాకుళ విప్లవోద్యమం విస్తరణ అట్టడుగు వర్గాలకు చేరడం అనే రెండు పరిణామాలకూ దారితీసింది. "నరుడో! భాస్కరుడా!" నుంచి ఈ దశాబ్దంలోని గోండు పాటలదాకా విప్లవ సాహిత్యోద్యమం మొత్తంగానే మౌఖిక ప్రక్రియల అవసరాన్ని గుర్తించేటట్లు చేసింది శ్రీకాకుళ ఉద్యమం.

ఇలా 'నరుడో! భాస్కరుడా!'తో ఒక కొత్త మార్గానికి ప్రాతిపదిక వేసిన శివసాగర్ కవిత్వంపై శ్రీకాకుళ విప్లవోద్యమ ప్రభావం చాల ఎక్కువ. ఆయన కవితల్లో ఎక్కువ భాగం శ్రీకాకుళ ఉద్యమ తక్షణ, ప్రత్యక్ష ప్రేరణతో వచ్చినవే. ఆయన వెంపటాపు సత్యంను సత్యంగా అభివర్ణించి 'సత్యం చావదు (డు)' అని రాశాడు.

"అది జనం! అది ప్రభంజనం!
అది ఖడ్గసంగీతం! అది యుగసంకేతం!"[30] అని ఆయన సత్యాన్ని కీర్తించాడు. మేరిమి, ఉద్దమాల, కురుపాం సంగమొలస కొండల్లో సాగిన పోరాటాన్ని వివరించి, అక్కడ అమలైన దుర్మార్గ నిర్బంధంవల్ల కలిగిన భయభీతావహాన్ని, నిరుత్సాహాన్ని జయించేందుకు "గుండెలోని ఆశ ఎర్రజెండాగా" ఎగరేసేందుకు, కళ్ళలోని కాంతి బాట వెలిగించేందుకు, చీకటిలో మిణుగురులు చూడడం తెలిపేందుకు ఆయన "ఏటికి ఎదురీదు వాళ్ళమురా" అని ప్రజలకు ఆశ్వాసాన్ని పలికాడు. 1971 నాటికి శ్రీకాకుళ అపజయంతో అసిరి, విప్లవ ద్రోహ వీలునామాపై నిర్లజ్జగా సంతకం చేసిన ఒడ్డి పెద్ద రిస్తూ శివసాగర్ వినిపించిన లేఖ 'ఉద్యమం నెలబాలుడు' శ్రీకాకుళ ఉద్యమ స్ఫూర్తినీ, పటిమనూ పాఠకుల కళ్ళకు కడుతుంది

శ్రీకాకుళ విప్లవోద్యమం రేకెత్తించిన ఆశల్ని స్థాపించిన దృక్పథాన్ని పునాదిగా పెట్టుకుని రాష్ట్రం నలుమూలల నుంచి కవిత్వం రావడం 1970 నాటికే మొదలై 1972 నాటికి స్థిరపడింది. ఈ కవిత్వం ఆయా ప్రాంతాల తక్షణ ప్రజాసమస్యలను, ఆ సమస్యలపై ప్రజల పోరాటాలను చిత్రించింది. అంతటితో ఆగకుండా అంతర్జాతీయ రాజకీయ, సామాజిక వేదికలమీద జరుగుతున్న

మార్పులకు విప్లవకవిత ప్రతిస్పందించింది. స్వేచ్ఛ, ప్రజాసామ్యం, ప్రజావిముక్తి, విప్లవ, సమానత్వంవంటి భావనలను నిర్దిష్టంగానూ, సాధారణ స్థాయిలోనూ కవిత్వీకరించింది. ఆ కవితా సంకలనాల ద్వారా కవితా సంపుటాలద్వారా అప్పటి ప్రగతిశీల యువత ఆలోచించిన అంశాలన్నిటినే గుర్తించవచ్చు. వీటిలో లేని ఆకాలపు ప్రధాన అంశాలులేవు. కేవలం 1969 నుంచి 1972 దాకా వచ్చిన డజనుకు పైగా కవితా సంకలనాలతో, సంపుటాలతోనే ఆ కాలపు సామాజిక చరిత్రను అర్థం చేసుకునే అవకాశం కలగడం ఆ కవిత్వానికి గల సామాజిక నేపథ్యపు గాఢతకు చిహ్నం.

*

శ్రీకాకుళ విప్లవోద్యమం 1971 నాటికి అపజయం పాలయినా 1978లో ప్రజ్వరిల్లిన కరీంనగర్, ఆదిలాబాద్ రైతాంగ పోరాటాలలో పునర్జీవించినట్లు, ప్రస్తుత ఉత్తర తెలంగాణ, మన్యం రైతాంగ పోరాటాలలో విస్తరిస్తున్నట్లుగానే విప్లవోద్యమ కవిత్వం కూడ నిరంతర ధారగా కొనసాగుతూవస్తోంది. విప్లవోద్యమ కవిత్వానికి ఈ శక్తినిచ్చిన ప్రధాన లక్షణం దాని చారిత్రక ఆశావహదృష్టి.

"ఇప్పటికిది చితుకు మంటలాగే ఉంది
ఇంకొక్కింతలో చూసుకోండి
ఘోరారణ్యాన్ని గనగనా మండించివేస్తుంది
ఇప్పటికిది పల్చటి మబ్బు మసకగానే ఉంది
ఇంకాస్సేపటికి చూసుకోండి
భూనరకాన్ని ముంచెత్తే పుష్కలావర్తకం అవుతుంది
ఇప్పటికిది చల్లని చిరుగాలిగానే ఉంది
ఇంకొంచెం ఆగి చూడండి
శిఖరాలనూ అగాధాలనూ ఏకంచేసే ప్రభంజనం అవుతుంది
ఈ చిన్నవిత్తనంలో మహావటవృక్షం వేచి ఉంది
ఈ నీటిబొట్టులో ప్రళయ సాగరం పొంచి ఉంది
సాహసి సంకల్పమే వజ్రహాసంగా రూపొందుతుంది"31

అని కె. వి. రమణారెడ్డి 1971 లో ప్రకటించిన ఆశావహదృష్టి వాస్తవికమైనదని తర్వాతి చరిత్ర రుజువు చేసింది. విప్లవోద్యమ కవిత్వంలోని ప్రధానమైన బలం ఈ ఆశావహ దృష్టే. ఈ ఆశావాదానికి మూలం విప్లవ కవులకు ఉన్న గతితార్కిక చారిత్రక భౌతిక వాదంలోని విశ్వాసమే. చరిత్ర పురోగమన శీలమైనదని, చరిత్ర అభివృద్ధి క్రమానికి నియమాలున్నాయని, నిజంగా చరిత్ర నిర్మాతలు ప్రజలేనని విప్లవకవులు విశ్వసిస్తారు. కనుకనే వారి కవిత్వంలో ఈ ఆశావహదృష్టి ప్రస్ఫుటమవుతోంది. నిరాశామయ పరిస్థితులు కల్పించడానికి వ్యవస్థ ప్రయత్నిస్తున్నప్పుడు ప్రజలు తమ ప్రవాహ శీలతను, పురోగామి స్వభావాన్ని కాపాడుకోవడానికి, భౌతికరూపం ధరింపజేయడానికి ఈ ఆశావహ దృష్టి అవసరం, విప్లవ కవిత ప్రారంభ దినాల నుంచి ఈ లక్షణాన్ని పుణికి పుచ్చుకున్నది.

ఆశను కల్పించడంలో భాగంగా ఆశాశత్రువులను తెగనాడాలి. నిరాశ కల్పించడానికి ప్రయత్నిస్తున్న శక్తులను అపహాస్యం చేయాలి. ఆ శక్తుల కాగితపు పులి స్వభావాన్ని బహిర్గతం చేయాలి. బహుశా ఈ కారణాల వల్లనే విప్లవ కవిత అత్యధికంగా నిర్బంధం గురించే వచ్చింది. అణచివేత ప్రతిఘటనను రేకెత్తిస్తుందని ప్రబోధించడం, దమనకాండకు చలించి పోగూడదని ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ వారికి ఆశ్వాసాన్నివ్వడం, వారి ముందడుగుకు ప్రోత్సాహాన్ని అందించడం ఈ సంస్మరణ గేయాలలో - నిర్బంధ వ్యతిరేక కవిత్వంలో ప్రధాన భాగాలయ్యాయి.

ఆశను కల్పించడం, నిర్బంధాన్ని గెలిచేయడం అనే అవసరాలు అనివార్యంగా చరిత్రను వివరించడంలోకి, తత్వశాస్త్రాన్ని వివరించడంలోకి, సామాజిక క్రమాన్ని వివరించడం లోకి ఎదగక తప్పదు. ఆ రకంగా ఒక తక్షణ అవసరంతో ప్రారంభమైన విప్లవ కవిత సహజంగానే తాత్వికస్థాయికి ఎదిగింది. అంతర్జాతీయ పరిణామాలను ప్రతిధ్వనించడం మొదలైంది. ఈపరిణామాలు విప్లవకవితకు సాధారణ లక్షణాలను అందజేశాయి. ఈ లక్షణాలు విప్లవకవిత ప్రభావం సుదూర కాలానికి కూడ వ్యాపించేందుకు కారణమయ్యాయి.

ప్రజలలో గూడుకట్టుకొని ఉన్న మతభావాలను విమర్శించడం, ప్రజల మెదళ్ళ లోకి క్రమక్రమంగా ఎక్కించబడుతున్న అభివృద్ధి నిరోధక భావాల విషాన్ని తొలగించడం తన లక్ష్యాలుగా విప్లవ కవిత ఎంచుకుంది. ఆ క్రమంలోనే విప్లవ కవిత అంతరాల వ్యవస్థను ఖండించింది. కుటుంబ సంబంధాలలో కొనసాగుతున్న దుర్మార్గాన్ని ఖండించింది. స్త్రీ వ్యక్తిత్వ ఆకాంక్షను ప్రతిఫలించింది. మతం, కులం ప్రజలను విడదీసి, పాలకులకు సాధించి పెడుతున్న ప్రయోజనాల్ని వివరించింది. సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో రావలసిన విప్లవం ఎంత సమగ్రమైనదో, చూపింది. రివిజనిజం వక్రీకరిస్తున్న ప్రజా ప్రయోజనాలను సవ్యంగా పునర్నిర్వచించింది.

విప్లవకవిత విప్లవోద్యమం తరఫున ఇతోధికంగా యువతరాన్ని ఉద్యమంలోకి ఆహ్వానించింది. తాను సామాజిక బాధ్యతను గుర్తించి విప్లవ ప్రయోజనాలకోసం ఒదిగి పోవడమేకాక, ప్రజలందరిచే సామాజిక బాధ్యతను గుర్తింప జేయడానికి శాయశక్తులా ప్రయత్నించింది విప్లవకవిత. అంటే సమాజానికి, చరిత్రకు అవసరమైన పరిణామాలకు ఆహ్వానం పలుకుతూ, ఆ పరిణామాల సాధనలో తాను చేయగల కృషిని స్వచ్ఛందంగా అందించింది విప్లవకవిత. ఈ విధంగా చారిత్రక అవసరాన్ని గుర్తించి, ఆచరించడమే విప్లవ కవిత బలం. విప్లవకవిత

అనివార్యవమే ఇలా చారిత్రక అవసరంగా జరిగింది. అందువల్లనే అది అప్రతిహతంగా పురోగమిస్తోంది.

[విశ్వ విద్యాలయ నిధుల సంఘం సహాయంతో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయన శాఖ 1987 నవంబర్, 5, 6, 7, 8 తేదీల్లో నిర్వహించిన 'తెలుగు, హిందీ, తమిళ భాషల్లో ఆధునిక కవితా రీతులు' అనే జాతీయ సదస్సులో ఈ వ్యాసం తొలి ప్రతి సమర్పించడం జరిగింది.]

## పాద సూచికలు :

1. కార్, ఇ, ఎచ్., వాట్ ఈజ్ హిస్టరీ? పే. 68 2. అజ్ఞాత కవి, శంఖారావం, పే. 248 3. బాల గంగాధర తిలక్, దేవరకొండ, అమృతం కురిసిన రాత్రి పే. 96 4. పై. ఉ., పే. 175 5. పై. ఉ., పే. 176 6. వేంకటేశ్వరరావు కమ్మిశెట్టి, రాత్రి, పే. 2 7. పై ఉ., పే. 60 8. కేశవరావ్, రాత్రి, పే. 77 9. కేశవరావ్, ఉదయించని ఉదయాలు, పే. 50 10. ఆర్మద, ఉదయించని ఉదయాలు, పే. 6 11. రాధాకృష్ణ, పరిగి, రాత్రి, పే. 10 12. నగ్నముని, దిగంబర కవులు, పే. 254 13. సత్యనారాయణ, వెంపటాపు, శ్రీకాకుళం జిల్లా గిరిజనోద్యమ సంక్షిప్త చరిత్ర, పే 17 14. పై. ఉ., పే. 15 15. పాణిగ్రాహి సుబ్బారావు, ఎరుపు, పే. 13 16. పై. ఉ., పే. 22 17. పై. ఉ., పే. 54 18. పై. ఉ., పే. 14 19. పై. ఉ., పే. 39 20. తిరుగబడు, పే. 5 21. పై. ఉ., పే. 6 22. పై. ఉ., పే. 33 23. పై. ఉ., పే 52 24. చెరబండరాజు, దిక్సూచి, పే. 26 25. వరవరరావు, జీవనాడి, పే. 62 26. పై. ఉ.. పే. 61 27. సృజన, అక్టోబర్ 1980, పే. 48 28. శివసాగర్, ఉద్యమం నెలబాలుడు పే. 21 29. విప్లవ కవులు, మార్క్స్. పే. 34 30. శివసాగర్, పై. ఉ., పే. 25 31. రమణారెడ్డి, కె. వి., ఎర్రపిడికిలి, పే. 21.

## ఉపయుక్త గ్రంథాలు


అగ్నిమిత్ర (సంకలన కర్త), సమరం, కవితా సంకలనం, హనుమకొండ, 1972. ఎన్. కె. (సమీకర్త), బంగ్లాదేశ్, కవితా స్పందన, హనుమకొండ, 1971. కె వి. రమణారెడ్డి, (సంకలన కర్త), ఝంఝ, గేయ సంకలనం, విరసం ప్రచురణ, 1970. కె.వి రమణారెడ్డి, ఎర్రపిడికిలి, కవితలు, విరసం, తిరుపతి, 1972. కె.వి. రమణారెడ్డి, సూరీడు మావోడు, కవితాసంపుటి, ఝంఝ ప్రచురణ, 1986. గంగాధర్, ఎం. ఆధునిక తెలుగు కవిత్వంలో విప్లవ ధోరణులు - విశ్లేషణ, అముద్రిత సిద్ధాంత వ్యాసం, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్, 1986. చెరబండరాజు, దిక్సూచి, 1970, చెరబండరాజు ముట్టడి, హైదరాబాదు, 1972. జ్వాలాముఖి, ఓటమి తిరుగుబాటు, నవయుగ పబ్లిషర్స్, హైదరాబాదు, 1972. బాల గంగాధర తిలక్, దేవరకొండ, అమృతం కురిసినరాత్రి, విశాలాంధ్ర, 1984. దిగంబరకవులు, మూడు సంకలనాల ఏకైక సంపుటి, ఎం. శేషాచలం అండ్ కో., మద్రాసు, 1971. నారాయణరావు, వెల్చేరు, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, 1978. నిఖిలేశ్వర్, మండుతున్న తరం. నవయుగ పబ్లిషర్స్, హైదరాబాద్, 1971, రైతు కార్యకర్త (సేకరణ), అమరవీరుల జీవిత చరిత్రలు క్రాంతి ప్రచురణలు, 1987. వరవరరావు, జీవనాడి, స్వేచ్ఛంద కవితా సంపుటి, ఎం. శేషాచలం అండ్ కో., మద్రాసు, 1971. విజయలక్ష్మి. సి., విషాద భారతం, సంపూర్ణ వచన కవితా కావ్యం, అభ్యుదయ సాహితి, విజయవాడ, 1966. విజయలక్ష్మి. సి., కారుచీకటిలో కాంతిరేఖ కవితా సంకలనం, ప్రొలిటేరియన్ పబ్లికేషన్స్, విజయవాడ, 1984. శివసాగర్, ఉద్యమం నెలబాలుడు, కవితా సంకలనం, సృజన, హనుమకొండ, 1983. శివాజి నాయుడు అడపా (సంపాదకులు), రాత్రి, కవితా సంకలనం, అమరసాహితి, హైదరాబాదు, 1964. శ్రీశ్రీ, మరోప్రస్థానం, మరికొన్ని గీతాలు, విరసం, 1980. సత్యనారాయణ వెంపటాపు, శ్రీకాకుళ గిరిజనోద్యమ సంక్షిప్త చరిత్ర, సోషలిస్టు పబ్లికేషన్స్, విజయవాడ, 1974. సుబ్బారావు పాణిగ్రాహి, ఎరుపు, పాటలు, విరసం, 1972. సుధాకర్ ఎం. (కూర్పు) కొక్కొరోకో, బతుకు పాటలు, వరంగల్, 1971. సుభాష్ టి. (సంకలనకర్త), లే, కవితా సంకలనం, విప్లవ సాహితి, తిరుపతి. 1972. రక్తగానం, కవితా సంకలనం, చైతన్యసాహితి, అనంతపురం, 1972. తిరగబడు, స్వేచ్ఛంద కవితా సంకలనం, స్వేచ్ఛాసాహితి, హనుమకొండ, 1969. శంఖారావం, విప్లవ గేయాల సంకలనం, సోషలిస్టు పబ్లికేషన్స్, పెనుమాక, 1972. సృజన మాసపత్రిక సంచికలు.


ఇంగ్లీషు పుస్తకాలు :


బెనర్జీ, సుమంతా, ఇన్ ది వేక్ ఆఫ్ నక్సల్బరీ, సువర్ణరేఖ, కలకత్తా, 1980. కార్, ఇ. ఎచ్., వాట్ ఈజ్ హిస్టరీ?, పెంగ్విన్, హామండ్స్ వర్త్, 1981. సేన్, సమర్, ఇతరులు (సంపాదకులు): నక్సల్బరీ అండ్ ఆఫ్టర్, కథాశిల్ప, కలకత్తా, 1978.


(అయిపోయింది)

శ్రీ కొల్లూరు సూర్యనారాయణ

# సర్వసిద్ధి యుద్ధం

తెలుగునాటి ఉత్తరతీరప్రాంతాల్లో గణుతికెక్కిన చారిత్రక నగరాల్లో 'సర్వసిద్ధి' యొకటి. 'ప్లక్కి' విషయమునందలి, ప్రస్తుత విశాఖజిల్లాలోని శారద, వరాహానదుల మధ్యనున్న కనుమ ప్రాంతంలో నెలకొనివున్న యీ నగరం వేంగీచాళుక్యుల కాలంలో ఆవిర్భవించి మధ్యయుగ ఆంధ్ర రాజకీయాల్లో తనదైన వునికిని పెక్కుమార్లు నిరూపించుకొంది. వేంగీ చాళుక్యవంశ స్థాపకుడైన కుబ్జ విష్ణువర్థనుని కుమారుడు 'స్వభుజబలోపార్జిత సర్వసిద్ధి'యునైన జయసింహవల్లభుని (క్రీ॥ శ॥ 641-673) పేరిట వెలసిన నగరంగా భావింపబడుతోంది.[1] మధ్యమ కళింగాంతర్గతమైన యీ ప్రాంతం ఆంధ్రలో చేర్చబడినదీ కాలంలోనే. దండిమహాకవి వర్ణించిన ఆంధ్ర నగరం యిదే కావచ్చునని గతంలో కొందరు పరిశోధకులు భావించినప్పటికి[2] దానికి పెద్దగా ఆధారాలులేవు.

విజయసిద్ధి బిరుదాంకితుడైన కొక్కిలి విక్రమాదిత్యభట్టారకుడు మూడవ విష్ణువర్థనునితో కలహించి యీకళింగప్రాంతమునకు వలస వచ్చి, పర్వతప్రాంతములమధ్య సురక్షితముగానున్న యీప్రదేశము న్నాక్రమించెను. ముంజేరు శాసనాల్నిబట్టి వీరి పాలన యీ ప్రాంతాల్లో నాలుగు తరాలవరకు సాగినట్లు తెలుస్తోంది.[3] ఈ ప్రాంతంలో 'కొక్కిరాపల్లె' లాంటి గ్రామాల్ని తమ పేర్లతో నిర్మించి చిరస్మరణీయులైన వీరు యీ ప్రాంతీయుల జానపదగీతాల్లో అస్పష్టంగానైనా నేటికి నిలిచివుండటంలో[4] ఆశ్చర్యంలేదు. బహుశః యీ కొక్కిలి వారసుల పాలన తూర్పు గంగులచే నిలువరింపబడి వుంటుంది. అందుచేతనే క్రీ. శ॥ 848లో గుణగ విజయాదిత్యుడు వేంగీ గద్దెనెక్కేవరకు యీ గడ్డపై తిరిగి గంగుల పాలన కొనసాగింది. గుణగని కాలంనుండి మాత్రమే వేంగీ చాళుక్యులు "త్రికళింగాధిపతు"లమని ప్రకటించుకోగల్గారు. ప్రథమ చాళుక్య భీముని కళింకోట శాసనం యీ ప్రాంతాల్లోదే అయిన 'తిని' గ్రామ దత్తవిషయాన్ని పేర్కొంది.[5] పదవ శతాబ్దపు తొలిపాదంలో మొదటి వజ్రహస్తునికాలంలో తూర్పు గంగులు పుంజుకోవటం, దీనికి ప్రతిగా కొల్లభిగండ విజయాదిత్యుని ప్రయత్నాలు యీ ప్రాంతంలో అస్థిర రాజకీయ పరిస్థితిని చాటుతూ వేంగీ-కళింగ రాజ్యాలు రెండింటికి యీ ప్రాంతపు ప్రాముఖ్యతను తెల్పుతున్నాయి. ఈ ఘర్షణల ఫలితంగా, పన్నెండో శతాబ్దిలో ప్రాంతీయంగా ఒక చాళుక్యశాఖ ప్రభవించేవరకు యీ ప్రాంతం సుస్థిరంగా ఎవ్వరి పాలనక్రిందా కొనసాగలేకపోయింది.[6] వేంగీ చాళుక్యుల వారసులమని ప్రకటించుకొని పద్దెనమండుగురు పాలకులతో వ్యాపించి నాలుగు శతాబ్దులపాటు యిచ్చట పాలించిన ఎలమంచి చాళుక్యశాఖ సాంస్కృతికంగా, రాజకీయంగా యీ ప్రాంతపు కీర్తిప్రతిష్ఠల కెనలేని కృషి సల్పింది. సమర్థులైన యోధులు, పాలనాదక్షులు చాల మందివున్న యీ కోవ పాలకుల్లో గణుతికెక్కినవాడు రాయగండ గోపాల, ధరణీ వరహాది వివిధాలైన బిరుదాల్ని వహించిన విశ్వేశ్వర దేవుడు. సాహితీసమరాంగణాలు రెండింట యీ ప్రాంతపు ప్రతిష్ఠ గణనీయంగా పెరిగినదీతని కాలంలోనే.

క్రీ. శ॥ 1377-1407 మధ్యకాలంలో పాలించిన చాళుక్య విశ్వేశ్వరుని పంచధారల శిలాశాసనంలోను;[7] అతనికంకితముగా విన్నకోట పెద్దయచే వ్రాయబడిన "కావ్యాలంకార చూడామణి"లోను సర్వసిద్ధియొద్ద జరిగిన ఒక భీకర యుద్ధం వర్ణింపబడింది. శాసనంలో—

"గతి బాహుశక్తి భూమి [తి] మపి గణయత్సర్వ సిద్ధి పథ భగ్నం
సతి చిత్రభాను సాక్షిణి ధరణీ వరాహ దదావ దంధ్ర బలం॥"

అని చెప్పబడింది. ఇదే విషయం "కావ్యాలంకార చూడామణి"లో

"చతురుపాయ బహుశక్తి క్ష్మాపతి బాలవిడిచి చిత్రభాను సాక్షి
బాణ సర్వసిద్ధి పదమేది ధరణీ వరాహమునకున్ డి రాచకదుపు"

అని నిర్ధారించబడింది.[8] వీనిని బట్టి యుద్ధము సంభవించిన చిత్రభాను సంవత్సరమైన శక సం॥ 1324 (క్రీ॥శ॥ 1402)లో విశ్వేశ్వరుడు సర్వసిద్ధి యొద్ద ఆంధ్ర సైన్యముల నెదుర్కొని విజయాన్ని సాధించి నట్లు తెలుస్తోంది. ఇచ్చటి 'రాచకదుపు' ప్రయోగాన్నిబట్టి ఆ శత్రు సైన్యం ఏ ఒక్కరిదీ కాదని, కొందరి కలయిక అనీ, ఆ మూకి విశ్వేశ్వరునిచే పరాభవింపబడిరని గుర్తించవచ్చు. 'కావ్యాలంకార చూడామణి'లోని అనేక పద్యాలు విశ్వేశ్వరుని యీ విజయాన్ని ఘనంగా ప్రస్తుతించాయి. "బిరుదములు పెట్టుకొని తుది బిరుదార్థము నిల్పలేని బిరుసు నృపులతో" నిండిన "రాచకదుపు" జయింపబడింది తప్ప ఎదో నామ మాత్ర రాజులు కారట. ఇక యుద్ధ కారణం వా "అన్యపురదాహ ప్రౌఢి". ఈ భీకర యుద్ధం 'సర్వసిద్ధి'కి దగ్గరలోని

సముద్రతీరంలో జరిగినట్లు చెప్పటానికి 'కావ్యాలంకార చూడామణి'లో చాల ఆధారాలున్నాయి.[9]

విశ్వేశ్వరునిచే జయింపబడి పరాభూతులైన 'ఆంధ్ర' శత్రువు లెవ్వరై యుందురన్నది యీ సందర్భమున ముఖ్యమైన ప్రశ్న. శాసనాల్లోను, సాహిత్యంలోను కూడ యీ విషయం స్పష్టంగా లేక పోవటాన్నిబట్టి సమకాలీన రాజకీయరంగాన్ని దృష్టిలో వుంచుకొని యీ అంశాన్ని వేర్వేరుగా పరిశీలించాలి.

కాటయవేముడు తన బలాల్తో తూర్పు గంగులనుండి సరియైన ప్రతిఘటన లేని కళింగ భాగాల్లోకి చొచ్చుకుపోవటానికి ప్రయత్నించి చాలవరకు సఫలీకృతుడైనట్లు, ఒడ్డాది మత్స్యరాజులు, జంతర్నాటి గంగులపై సార్వభౌమాధికారం పొందినట్లు చెప్పటానికి ఆధారాలున్నాయి.[10] బహుశః ఆ పరిస్థితుల్లో ఒక యుద్ధమున యీ సామంతరాజుల కూటమి చాళుక్య విశ్వేశ్వరుని నాయకత్వమున సర్వసిద్ధి కడ రెడ్డి సైన్యముల నోడించి యుండును. తరువాత చాలకాలము వరకును యీ విజయమును మహత్తరముగా యీ వంశీయుల శాసనములు వర్ణించుటనుబట్టి యీ యుద్ధపు ప్రాముఖ్యత గుర్తింపదగినది. పెదకోమటి వేమ రెడ్డి వంటి ప్రబల శత్రువులతో చికాకుల నొందుచున్న సమయమున కాటయవేముడిట్టి పరాజయమందెనను కొనుట అసమంజసము కాదు. తమ ముత్తాతల నగరమైన రాజమహేంద్రవరమునకు వారసత్వము తమదిగనే యీ ఎలమంచిలి పాలకులు భావించుచున్నట్లు 'కావ్యాలంకార చూడామణి'లోని అనేగర ప్రస్తావన లనుబట్టి గ్రహించవచ్చు బహుశః ఆ తీరమందలి కొన్ని ప్రాంతములు కూడ విశ్వేశ్వరు డాక్రమించెనేమో పరిశీలింపవలసిన విషయము.[11] ఆక్రమించి యుండుటచేతనే 'నూతనక్ష్మానాథుండ'ని పించుకొని యుండును. ఈ విజయ ఫలితము లెంతకాలము నిలిచెనో చెప్పలేము. ఆ గెల్చిన ప్రాంతములపై నైనను వీరియాధిపత్యము బలముగానుండెనో లేదో తెలియదు. కాని యీతని 'అభ్యుదయ పరంపరల కకంపితస్థితి యావహిల్లునట్లుగా' షష్ఠ్యంతములలో కవి యాశీర్వదించెను.

విశ్వేశ్వరుడు జయించిన యీ 'ఆంధ్రేశ్వరులు', పిఠాపురపు ప్రాంతముల నేలిన కొప్పులపతు లగుదురేమోననికూడ అనుమానించుట కవకాశమున్నది. వారి దోనెపూడి శాసనమందు వారు తమను 'ఆంధ్రఖండ మండలాధిపతుల'మని ప్రకటించుకొనుటయే[12] యీ సందేహమునకు కారణము. పిఠాపురమును రాజధానిగా చేసుకొని పాలించిన యీ కొప్పులవారు నామయ నాయకుని అనంతరం అంటే క్రీ॥ శ॥ 1387 తర్వాత కన్పించరు. బహుశః పశ్చిమంనుండి వచ్చే ఒత్తిళ్ళు తట్టుకోలేక వీరు క్రమేణ తూర్పువకు కదిలివచ్చి తర్వాతి శదలో 'కొప్పులవారి కోట్రాము' కేంద్రస్థానం చేసుకొని వుండొచ్చు. క్రీ॥శ॥ 1388లో యీ కుటుంబానికి చెందిన ముప్పమదేవి, సింహాద్రి నరసింహనాథుని 'పగమెచ్చుగండభోగాని'కై అదులపల్లి (ప్రస్తుత అందులపల్లి)ని సమర్పించటం జరిగింది.[13] ఇది సర్వసిద్ధికి అతిదగ్గరలోనున్న చిన్నగ్రామం. ఈ దానం విశ్వేశ్వరుడు సర్వసిద్ధి-ఎలమంచిలి ప్రాంతాన్ని పాలిస్తున్నప్పుడే జరిగింది. ఈ రెండు పాలక కుటుంబాలమధ్య అంత సాన్నిహిత్యం వుందని చెప్పేదాఖలాలు కూడలేవు. సర్వసిద్ధియుద్ధం తర్వాత కొప్పులవారి వివరాలేవీ లభించక పోవటం కూడ యీ సందర్భంలో గమనార్హం. వీటి అన్నింటి దృష్ట్యా విశ్వేశ్వరునిచే జయింపబడ్డ ఆంధ్రేశ్వరులు కొప్పులపతులు కావచ్చు.

మరొక విధంగా పరిశీలిస్తే శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారూహించినట్లు[14], విశ్వేశ్వరుని శత్రువులైన యీ 'ఆంధ్రేశ్వరులు' కళింగ ప్రాంతాల్లోకి పైబడి చొచ్చుకొస్తున్న వెలమ పాలకులు కావటానికి హెచ్చు అవకాశం వుంది. రెడ్డి రాజ్యంలో అంతఃకలహాలు పెచ్చుమీరుతున్న అదునులో, అన్నదేవచోడుడు రేచెర్ల వెలముల పెద్ద సేనలే దేవరకొండ నుండి కళింగమార్గమున దండు వెడలగా, రెడ్డి ప్రభువుల సామంతుడైన విశ్వేశ్వరుడు వారి కోరిక మేరకు 'ఆంధ్రేశ్వర' బిరుదము దాల్చిన రేచెర్ల వారిని సర్వసిద్ధి రంగమున నెదుర్కొని తీవ్ర పరాభవమునకు గురికావించి యుండును. శ్రీ సోమశేఖరశర్మగా రూహించిన యీ చిత్రణ వాస్తవమగుననుటకు ఆధారముగా మరియొక చారిత్రక నేపథ్యమున్నది. చాళుక్య పాలకులకు మొదటినుండి వెలమనాయకులతో క్రమాగత వైరమున్నది. "వెలుగోటి వారి వంశావళి"లో చాళుక్య - వెలమ పాలకుల మధ్య నేర్పడిన అసంఖ్యాక యుద్ధములు ప్రస్తావించటం జరిగింది.[15] చివరకు పరాకాష్ఠగా తెలంగాణములోని జల్లిపల్లి రంగంలో క్రీ॥శ॥ 1361 లో వెలమలు మొదటి అనపోత, మొదటి మాదల నాయకత్వంలో చాళుక్య రాజు లేవన్మందిని ఒక్కుమ్మడిగా మట్టు బెట్టటం జరిగింది. నూట ఒక్కంమంది చాళుక్య ప్రభువుల్ని వారి ఐదు లక్షల అరవై వేల సైన్యాన్ని వెలమ పరాక్రమం భస్మీపటలం చేసిందంటే,[16] అతిశయోక్తి ఎంత వున్నప్పటికీ, పోరు తీవ్రత తెలుస్తుంది. విజయ సూచకంగా వెలమ నాయకులు, 'సోమకుల పరశురామ', 'సోమవంశగ్రహణ', 'సోమకుల రాజవర్గ నిర్ధూమధామ', 'చాళుక్య భూపాల విదళిత', మొదలైన బిరుదాలెన్నింటినో ధరించారు. అంతటితో పగ చల్లారక చాళుక్య పాలకుల శిరఃచిహ్నాల్ని తమ తమ పాదపీఠికల్లో చెక్కించుకొని సంతుష్టులయ్యారు.[17] ఇదంతా చాళుక్య విశ్వేశ్వరుని రాజ్యాధికారానికి కొద్దిముందు రెండు పాలక కుటుంబాల మధ్య రగులు

తున్న విషమస్థితి. వీరు విశ్వేశ్వరుని కాలంలో కూడ యీప్రాంతంలో దాడి చేస్తున్నారని వారి సింహాచలంలోని శాసనాల్నిబట్టి గ్రహించ వచ్చు.[18] తమ వంశీయులు వెలమవీరుల చేతిలో పడిన యీ భంగ పాటు విశ్వేశ్వరదేవు డెరుగనిది కాదు. పరాక్రమవంతుడు, సమర్థుడు నైన అతని హృదయము వెలమలపై ప్రతీకారేచ్ఛతో జ్వలించి యుండును. ఫలితముగనే సర్వసిద్ధి రంగమున వెలమవీరుల మాన ప్రాణములు బలితీసుకొని, వారు గతమున లేమయితీర చాళుక్యరాజుల నొందించిన యిడుమలకు ప్రతిసల్పి యుండును.

ఈ విధమైన అవకాశంవున్న సమకాలీన రాజకీయ సన్ని వేశాన్ని ఖుణ్ణంగా పరిశీలిస్తే క్రీ॥శ॥ 1402 లో సర్వసిద్ధిలో జరిగిన భీకరయుద్ధలో చాళుక్య విశ్వేశ్వరునిచే పరాజితులైన 'ఆంధ్రేశ్వరులు' వెలమపాలకులేనని గ్రహించవచ్చు.

**అధోజ్ఞాపికలు :**

1) హిస్టరి ఆఫ్ ది యీస్టర్న్ చాళుక్యాస్ ఆఫ్ వేంగి (బి. వి. కృష్ణా రావు) పే. 103.
2) కళింగ సంచిక, పే. 283.
3) ఎ. ఆర్. ఇ. సి. పి. నెం. 10, 11, 12, 13, ఆఫ్ 1908-9.
4) "కొండ మీద వెండి గిన్నె
కొక్కిరాజు కాలు విరిగె
దానికేమి మందు-?
వేపాకు చేదు,
వెల్లుల్లి గడ్డ
నూనియ బొడ్డు
నూటొక్క ధార! - యిత్యాదులు
5) ఐ. ఏ. సంపుటి 13, పే. 213.
6) భారతి, సెప్టెంబరు, 1980, పే. 25.
7) ఇ. ఐ. సంపుటి. 19, పే. 64.
దీనిని ప్రకటించిన జె. నోబెలు, 'గతి'కి ఐదును సంఖ్యా వాచకంగా తీసుకొని శక సం॥ 1325 గా భావించాడు. కాని 'చిత్ర భాను' నామ సంవత్సరం శక సం॥ 1324లో రావటం చేతను, 'కావ్యాలంకార చూడామణి'లో యీ విషయం వర్ణించే సందర్భంలో 'చతురుపాయ బాహుశక్తి క్షమావళి' అని చెప్పటం చేతను, యీ సంఖ్యను శక సం॥ 1324 గానే భావించటం జరుగుతోంది.
8) కావ్యాలంకార చూడామణి, సప్తమోల్లాసము, ప. 41.
9) భారతి, డిసెంబరు, 1981, పే. 60.
10) హిస్టరీ ఆఫ్ ది మైనరు చాళుక్య ఫేమిలీస్ యిన్ మిడీవల్ ఆంధ్ర పే. 131.
11) కావ్యాలంకార చూడామణి, పీఠిక.
12) హిస్టరీ ఆఫ్ ది రెడ్డి కింగ్డమ్స్, పే. 27.
13) హిస్టరీ ఆఫ్ ది మైనరు చాళుక్య ఫేమిలీస్ యిన్ మిడీవల్ ఆంధ్ర పే. 133.
14) హిస్టరీ ఆఫ్ ది రెడ్డి-కింగ్డమ్స్, పే. 175.
15) వెలుగేటి వారి వంశావళి, పే. 22 - 23.
16) ,, పే. 18.
17) ,, పే. 39 - 41.
18) యస్. ఐ. ఐ. సంపుటి 6, సం. 1081, 1100.

---

# ఆవాహన

కాళ్లూ చేతులూ ముడుచుకుని
గర్భంలో ఎన్నాళ్లుంటావు?
తల్లిని బాధించైనా సరే
భూమి పోరాటంలోకి దూకితేనే
నీకు వయస్సు లెక్కగడతాను!

# బాధ

సముద్రం
నన్ను శవం చేసినందుక్కాదు
దూరంగా ఒడ్డున పడేసినందుకే
ఎక్కువ బాధపడ్డాను.

శ్రీ గాలి నాసరరెడ్డి

# సాగివంశ ప్రభువంశావళి- చారిత్రక సమన్వయము

పరశురాముని కోపానలమున కొకసారి, మహాపద్మనందుని యౌద్ధత్యమునకు మరొకసారి అగ్గమై విమలమకుటార్హములు గాకుండ పోయిన రాచవారు తమ తొలివంశౌన్నత్యమును గోలుపోయి, వంశోత్పత్తి క్రమము వెలువరించు సందర్భమున మాత్రము పూర్వ సాంప్రదాయమును విడనాడక అటు సూర్యవంశమునకో ఇటు చంద్ర వంశమునకో తమ వంశమును ముడివెట్టి, తమ పూర్వీకుల నుగ్గడించు నెడల వారు సూర్యాన్వయ వంశసంభూతులుగనో లేక చంద్రాన్వయ వంశ సంభవులుగనో వక్కాణించుచు వచ్చిరి. చారిత్రకముగ నా వంశ ప్రశస్తియటులనే యుట్టంకింప బడుచు వచ్చెను. కాని - వారు వర్ణించి చెప్పిన వంశీకు లందరును చారిత్రక పురుషులుగ పరిగణన కెక్కక విస్మరింపబడి, పాలకులై వెలుగొందిన వారి నామములే గణన కెక్కినవి. అట్టి పురాతన రాజకుటుంబములలో సాగి (చాగి) వంశము ప్రసిద్ధికెక్కి చరిత్ర సృష్టించుకొన్నవి.

సిద్ధేశ్వర చరిత్ర, ప్రతాప చరిత్ర, సోమదేవరాజీయము, రామవిలాస మాది గ్రంథములలో ఆయా రాజవంశోత్పత్తి క్రమము, విజృంభణము, పాలనా విశేషములు, గావించిన ధర్మకార్యములు వివరములున్నవి. అయితే ఆ గ్రంథములలోని విషయములన్నియు యదార్థములు, చారిత్రక సత్యములుగ నెంచుకొనవలనుపడదు. అందలి విషయములను చరిత్ర కనుసంధించి, సమన్వయము జేసినగాని యదార్థ వృత్తాంతము రూపు దాల్చదు. చరిత్ర ప్రామాణ్యము సంతరించుకొనదు. ఈ వక్కాణము సాగి (చాగి) వారి విషయములో నూటికి నూరుపాళ్ళు వర్తించును. అదెట్లనో విశదీకరించు లక్ష్యముతో నీ వ్యాస రచన మారంభింపబడినది

చాళుక్య వంశోత్పత్తి, హైహయ వంశోత్పత్తి, చోళ వంశోత్పత్తివలెనే ఈ "సాగి" వంశోత్పత్తిగూడ నడచినది.

"శ్రీమన్నారాయణ నాభికమలమున పరమేష్ఠి జనించి, వివిధములైన జంతువులను, చాతుర్వర్ణ్యములగు ప్రజలను సృష్టించెను. అందు ప్రజలు కాలక్రమమున జాతి సాంకర్యమునంది, బలవంతులు బలహీనులను పీడించుచుండిరి. జనులు సుఖములేనివారై తమను రక్షించువారెవ్వరు? అని యన్వేషణ జేయజొచ్చిరి. వారు కడకు అరణ్యములందు తపము చేయుచున్న భరద్వాజాది మహర్షులగాంచి వారితో తమకు కలిగిన యరిష్టములను చెప్పి రక్షణోపాయమును తెలుప గోరిరి. మహర్షులు వారిం జూచి "మేమొక మహాపురుషుని మీ కొసంగెదము. అతడు చెప్పినట్లు మీరు నడచు కొనుడు. దాన మీరు సుఖమునంద గలరు" అని పల్కిరి.

అంతట వారు సూర్యుని ప్రార్థించి, తత్ప్రసాదమున "మనువు" అను కుమారుని సంపాదించి, వానికి తమ తపః ఫలములను సమర్పించి, సర్వధర్మ వేదిగాను సర్వ సద్గుణ సమన్వితునిగాను జేసి ప్రజలకు సమర్పించుచు ఇట్లు పల్కిరి. "ఈ మనువు మీకే యాజ్ఞలు యిచ్చినను వానిని ఔషధమువలె వెగటు, చేదుగలవైనను గ్రహించుడు. మీకు సుఖము కలుగును." తదాది ప్రజాకోటి యామనుమహాత్మునిచే శాసింపబడి జాతి, కుల, వర్ణపద్ధతుల ననుసరించి శాంతముగను, సుఖముగను జీవించిరి. కావుననే ప్రజలకు మానవులను పేరు కల్గెను.

ఆ మనువంశమున క్రమముగ రఘువు, భగీరథుడు, రాముడు మొదలగు మహాత్ములు పుట్టి మనుచక్రవర్తిచే నియమింపబడిన ధర్మమును రేఖా మాత్రమైనను జారకుండునట్లుగా రాజ్యమును పాలించిరి.

ఆ సూర్యవంశము వారియందు "దుర్జయుడు" అను మహారాజు దేవగిరి రాజధానిగ రాజ్యమును పాలించుచుండెను వీరికి 5వ పురుషులు మణికర్ణమహారాజుగారు. వీరి మనుమడు ద్విజకర్ణ మహారాజు మాగధులచే నోడింపబడి దేవగిరిని వదలి వేంగీదేశమునకువచ్చి పాలించిరి. కాని వీరి పినతండ్రి కుమారుడు ప్రభాకర మహారాజు గారు తిరిగి మాగధుల జయించి దేవగిరిని ఆక్రమించుకొనిరి. ఈ వంశములో త్యాగిరాజు (సాగిరాజు లేక చాగిరాజు) గారివలన "సాగి" యను గృహనామము, "బుద్ధిరాజు" గారివలన "బుద్ధిరాజు" అను గృహనామము రామరాజుగారనువారు "వత్సవాయి" గ్రామమున నివసించుటచే "వత్సవాయి" యను గృహనామమును పొందిరి. ఒకటియే యగు దుర్జయ మహారాజు వంశమట్లు మూడు గృహనామములనొప్పు రాజకుటుంబములుగా చీలి వర్ధిల్లెను. ఆటుపిమ్మట దుర్జయ వంశస్థులు "సాగి" "బుద్ధిరాజు" "వత్సవాయి" గృహనామముల శాఖోపశాఖలుగ విస్తరిల్లి దక్షిణ భారత చరిత్రలో గణుతి కెక్కిరి.

దుర్జయ వంశోద్భవులగు "సాగి" వారు "చాగి" వారను నామాంతరమున బరగుచు, కొందరు హైహయవంశజులమని ప్రకటించుకొనసాగిరి. వారికి పల్నాటి ప్రభువైన "చాగిబేతారాజు" మూల

పురుషుడు. ఈతడు పశ్చిమ చాళుక్య ప్రభువు "భూలోకమల్ల" సోమేశ్వరుని క్రీ॥శ॥ 1027 1038 మధ్యకాలమున పల్నాడు పాలిం-చెను. ఆతని సంతతి వారు క్రీ॥శ॥ 1182వ సంవత్సరమున జరిగిన "పల్నాటి యుద్ధములో మరణించి, కథావశేషులైరి. హతశేషులైన వారు పూర్వచాళుక్య పాలనవరకు పల్నాటిసీమ కధిపతులై వర్తించిరి.

దేవగిరినుండి వేంగీ భూమికి తరలివచ్చిన సాగిరాజెవరో చరిత్ర చెప్పుటలేదు. కాని-నతవాటి సీమలోని "గుడిమెట్ట" రాజధానిగ పాలించినవాడు "సాగిపోతరాజు"ని మాత్రము చరిత్ర యుద్ఘాటించుచున్నది. ఈతని పూర్వులగూర్చి తెలియవచ్చిన హంశము లేమియు లేవు; కాని-"సాగివంశావళి"లో నీరీతిగ నున్నది.

శ్రీ ప్రభాకరమహారాజు
(మాగధుల జయించి దేవగిరిని తిరిగి సంపాదించెను)

|

శ్రీ భాస్కర మహారాజు

|

శ్రీ జనార్దన మహారాజు

|

శ్రీ ప్రదీప మహారాజు

శ్రీ సాగ్నివీది మహారాజు
(పిదప సాగ్నిమహారాజని, సాగిరాజని పిలుచుటచే వీరి సంతతి "సాగి" వారైరి)

|

దర్పక మహారాజు

|

ముప్ప (త్ప) రాజు (మూర్పరాజు)

|

సూర సింగరాజు

|

పోత్రి రాజు

|

గొంక దోరపురాజు

|

పోతరాజు

ఈ పోతరాజే తొలిసారిగ "గుడిమెట్ట" రాజధానిగ "నతవాటి సీమ"నేలెను. ఈ పోతరాజునకు వెనుక 4 తరమువాడగు ముప్పరాజు చరిత్ర ప్రసిద్ధి గాంచెను. "సాగి" వంశప్రభు ప్రస్తావన ఈ క్రింది తులనాత్మక పట్టికలో వివరింపబడినది.

| సాగివంశ ప్రభువంశావళి | రామవిలాస ప్రబంధము | చారిత్రక ప్రసక్తులు |
|---|---|---|
| శ్రీ దుర్జయ మహారాజు | విష్ణువు | విష్ణువు |
| శ్రీ రణజయ మహారాజు | బ్రహ్మ | బ్రహ్మ |
| శ్రీ ద్యుతికర్ణ మహారాజు | మరీచి | X |
| శ్రీ ధవళకర్ణ మహారాజు | కశ్యపుడు | X |
| శ్రీ మణికర్ణ మహారాజు | సూర్యుడు | దుర్జయుడు |
| శ్రీ సోమకర్ణ మహారాజు | వైవస్వంతుడు | X |
| ద్విజకర్ణ మహారాజు | మనువు | X |
| (వీరు మాగధులచే నోడింపబడి వారికి సామంతులై వేంగిని పాలించెను) | ఇక్ష్వాకుడు | X |
| శ్రీ హేమకర్ణ మహారాజు | రఘువు | X |
| శ్రీ ప్రభాకర మహారాజు (వీరు మాగధుల జయించిరి) | దశరధుడు | X |
| శ్రీ భాస్కర మహారాజు | రాముడు | X |
| శ్రీ జనార్దన మహారాజు | X | X |
| శ్రీ ప్రదీప మహారాజు | X | X |










పై వంశవృక్షములో 14వ వారిగ పేర్కొనబడిన ముప్పరాజు సాగివంశీయులలో మొదటివాడుగ చరిత్ర కెక్కినాడు. ఈతడు రాజేంద్రచోడుని ప్రేమకు పాత్రుడై రాజలాంఛనములపొంది, మహా మండలేశ్వరునిగి "నతవాటిసీమ" నేలుచున్నట్లు చరిత్ర తెలుపుచున్నది. ఈతడు విప్పర్ల గోత్రీకుడయిన క్షత్రియుడు. రాజేంద్రచోడుని సమకాలీనుడగుటచే క్రీ॥శ॥ 1070-1118మధ్యకాలమున నివసించియుండవలెను. రాజేంద్రచోడుడు తనమాతామహార్జితమగు చోళసామ్రాజ్యము నాక్రమింప క్రీ॥ శ॥ 1063 నుండి 1074 వరకు పెక్కు పర్యాయములు యత్నించెను. ఆ కృషిలో ముప్పభూపతి రాజేంద్రచోడునకు కుడిభుజమై నిల్చి, పోరుసల్పియుండును. క్రీ.శ॥ 1068లో కృష్ణానదీ తీరమున చోళరాజు వీరరాజేంద్రునితో జరిగిన యుద్ధమున ముప్పరాజు రాజేంద్రచోడునకు సహాయము చేసెను. కాని విధి వక్రించుటచే పరాజితులై తమ తమ సైన్యములతో సెడవులబట్టి పారిపోవలసిన దుర్గతి పట్టినవి. అయినను పట్టు విడువని విక్రమార్కుని చందమున రాజేంద్రచోడుడు మరల మరల చోళరాజధాని కాంచీపురముపై దండెత్తిపోవుచునేయుండెను. క్రీ. శ॥ 1074వ సంవత్సరమున రాజేంద్రచోడుని జీవితాశయము నెరవేరి ఆతడు చోళసింహాసనమెక్కి సామ్రాజ్యాధిపతియయ్యెను.

క్రీ. శ॥ 1074లో వేంగీశ్వరుడు, రాజేంద్రచోడుని పినతండ్రి విజయాదిత్య 8 నిస్సంతుగ మరణించుటచే పైత్వకమ్మగు వేంగిరాజ్య పాలనాభారముగూడ రాజేంద్రచోడుపైబడెను. చోళ సామ్రాజ్య సింహాసనస్థుడగు నాతడు వేంగిరాజ్య పాలనకు తన కుమారుల రాజప్రతినిధులుగ పంపి రెండు రాజ్యముల దనయాధీనము ననే యుంచుకొనెను.

మహామండలేశ్వర చాగిముప్పరాజెప్పుడు చనిపోయెనో తెలియదు కాని-ముక్త్యాల శాసనమునుబట్టి అతని వంశమున గోంకదోరపు రాజు జనించెనని తెలియుచుండగా నెం. 271 ఆఫ్ 1897 మరియు నెం. 253 ఆఫ్ 1893 శాసనములబట్టి ఈతడు ముప్పరాజు కుమారుడని, ముప్పరాజున కీయబడినట్లు రాజలాంఛనము లీతనికీయబడినవని కొందఱనుచున్నారు. ఈ రాజ చిహ్నములు ముప్పరాజునుండి దోరపరాజునకు సంక్రమించియుండవచ్చునుగాని పీఠిని దోరపు రాజే పొందినాడన్న అసంభవమనిపించుచున్నది. ఏలనన-ఈతడు తన చాగివంశనామము పరిహరించి "గోంక నామమును తన పేరునకు ముందు జంటించుకొనుటబట్టి యితడు రాజేంద్రచోడునకుగాక వెలనాటి గోంకరాజు1 నకు సన్నిహితుడై అతని ప్రేమాభిమానమును చూరగొన యత్నించి యిట్టి చర్యకు దిగెనేమోయను యూహ వుదయించున్నది. "సాగి" ప్రభువంశావళిలో ముప్పరాజునకు దోరపరాజునకు మధ్య ఇద్దరు రాజులున్నారు. కాని-వారు చారిత్రక ప్రాధాన్యతను పొందనందున వర్ణనీయులైనారనియనుకొందము.

ముక్త్యాల శాసనము ననుసరించి గోంకదోరపరాజునకు పోతరాజు జనించెనని చెప్పబడుచుండగా "సాగి" ప్రభువంశావళిలో గూడ నటులనే చెప్పబడనది. చారిత్రకముగ దోరపరాజు తర్వాత "త్యాగ, సత్య, శౌర్యా"ది గుణమణి విభూషితుడగు పోతరాజు రాజ్యమునకు వచ్చెననియు నీతడే "గుడిమెట్ట" రాజధానీనగరముగ మొదట నతనాటి సీమను పాలించెననియు, ఈతడే గుడిమెట్టలో విశ్వేశ్వరాలయము కట్టించినట్లును శాసనసాక్ష్యమున్నది. ఈ పోతరాజు క్రీ. శ॥ 1182లో జరిగిన పల్నాటియుద్ధములో పాల్గొని మరణించెనని తలంపబడుచున్నది.

ఈతని తర్వాత త్యాగరాజనే చాగిరాజు రాజ్యమునకు వచ్చెను. ఇట్లని సాగి ప్రభువంశావళి చెప్పుచుండ శాసనములు మాత్రము పోతరాజునకు పిమ్మట చాగిరాజను నామాంతరము గల రెండవ దోరపరాజు రాజ్యమునకు వచ్చెనని చెప్పుచున్నవి. సాగిప్రభు వంశావళిలో త్యాగరాజు తర్వాత దోరపరాజు రాజయ్యెననియున్నది. ఈ వ్యత్యాసమును సమన్వయించుటెట్లు?

త్యాగరాజు లేక చాగిరాజు అనే నామాంతరములుగల రెండవ దోరపరాజు బెజవాడను రాజధానిగ జేసికొని 15 సంవత్సరము లేకచ్ఛత్రముగ పాలించెను. రాజ్యమునకు రాకపూర్వమే తన తండ్రిచే "గుడిమెట్టలో ప్రతిష్ఠింపబడిన విశ్వేశ్వరునకు, దాసీ జనమునకు, తదితర స్వామి సేవలకు మాన్యములిచ్చినట్లు శాసనము గలదు.

రెండవ దోరభూపతి క్రీ. శ॥ 1182-1197 వరకు రాజ్యమేలెను. ఈతని కిరువురు భార్యలు. చిమ్మాంబిక, ముప్పాంబిక యనువారలుగలరు. చిమ్మాంబికయందు చాగిపోతరాజు (నరసింహవర్ధన చాగిపోతరాజు) అనునాతని, ముప్పాంబికయందు మనుమచాగిగణపయ, భీమయలనువారల నిర్వుర కుమారులగాంచెను. చాగిపోతరాజు భార్య రాజాంబిక. ఈతడు క్రీ. శ॥ 1199 నుండి 1230 వరకు 31 సంవత్సరములు రాజ్యము చేసెను. ఈతడును చాగిరాజును కాకతి గణపతి సమకాలీనులు. బెజవాడ కనకదుర్గ దేవాలయములోనున్న యొక శాసనములో నీతడు పెక్కు ధర్మకార్యముల నొనరించెనని ప్రశంసింపబడినాడు (నెం. 301 ఆఫ్ 1924 నెం. 300 ఆఫ్ 1924 నెం. 335 ఆఫ్ 1892, నెం. 273, 275 ఆఫ్ 1924, నెం. 284 ఆఫ్ 1924) తన పేర పోతాపురమను అగ్రహారము నిల్పి హింతాలతానారికేళవృక్షముల నాటించి విలసిల్లునట్లు చేసెను. ఈ వివరములేమియు సాగిప్రభు వంశావళిలో కానరావుగాని పోతరాజునకు తర్వాత వచ్చినవాడు నరసింహరాజని, ఈతని కుమారుడే పోతరాజనియున్నది. సాగిపోతరాజే "నరసింహవర్ధన" బిరుదువహించి "నరసింహ వర్ధన సాగిపోతరాజ"ను పేరుగాంచినాడు. ఈతడు నరసింహరాజు సుతుడు గాడు. దీనికి తార్కాణము బెజవాడ శాసనములో రెండవ పోతరాజు "శ్రీయోగానంద నరసింహదేవదివ్య శ్రీపాదపద్మారాధకు" డని "శ్రీనరసింహవర్ధనస్త్యాగి పోతధరణీపతి" యను సంబోధనవలన తెల్లమగుచున్నది.

ఈ చాగిపోతరాజునకు నరసింహరాజును అతనికి మన్మపోత మాచరాజులను సుతులిద్దరున్నట్లు సాగప్రభు వంశావళి చెప్పుచున్నది. దీనినే రామవిలాస ప్రబంధకారుడనుసరించినాడు. ఆ పిదప వ్రాతలును చారిత్రక దృష్టికి నిల్చుటలేదు. మాచరాజునకు ఎరపోతరాజు అతనికి శ్రీరామరాజు అతనికి రామరాజు, తెలుగురాజు, అనంతరాజను ముప్వురు కొమరులుండినట్లును అందు రామరాజు" "వత్సవాయి" గ్రామములో నివాసముండుటచే నాతని సంతతి "వత్సవాయి" గృహనామము స్వీకరించిరని వ్రాసిన వ్రాత చరిత్ర కన్వయించుటలేదు. చరిత్ర ననుసరించి పోతరాజు పిదప నాతని సవతి సోదరుడు చాగి గణపయ రాజ్యమునకు వచ్చెను. ఈతని శాసనయొక్కటి క్రీ. శ॥ 1250 నాటిది కన్పట్టుచున్నది. ఇతడు కృష్ణా తీరమునను్న "దాములూరు" గ్రామమును శ్రీ అమరేశ్వరస్వామికి సమర్పించెను. తన తల్లి ముప్పాంబికతో "త్రిపురాంతక" మునకు జని యట గోదానములిచ్చెను. ఈతడు దిన్నాంబికయందు మనుమచాగి గణపయను గాంచెను. ఇతడు వేదాద్రిలోని ప్రతాపనృశింహస్వామికి "వేముపల్లి" గ్రామము సమర్పించెను. ఈతని పాలనలో శ్రీవత్సగోత్రజుడు అన్నమంచికుమారస్వామి యజ్వ కుమారుడు సోమయాజి భాస్కరుడు రాజ్యాభివృద్ధికై నిర్మించిన "చాగిమన్మగణపేశ్వరాలయము" నకీతడు కొంత భూమిని మాన్యమొసంగెను. ఈతని కుమారుడే మహామండలేశ్వర చాగిపోతరాజు.- ఈతని శాసనమొకటి బెజవాడలోగలదు

# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ ఆయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది. అమృతాంజన్-డెర్మల్ ఆయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు అదర్శమైన నివారిణి. నేడే కొనండి!

**అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004**

**Amrutanjan Limited**





757-TG

చాగిగణపయ సోదరుడు భీమయ కుమార్డు దోరభూపతి "నతవాటి" సీమలో పాలనము నెరపుచు "ఏలేశ్వరదేవుని" ప్రతిష్ఠించి "మున్నానది" కపతలనున్న భూముల కొన్నింటిని మాన్యములుగా నిచ్చెను. క్రీ. శ॥ 1157లో చాగిమన్మపితరాజు పాలన చేసినట్లు "పెనుగంచిప్రోలు" శాసనము చెప్పుచున్నది. బహుశః ఈతడు మనుమ చాగిగణపయ సుతుడై యుండును. ఏలనన చాగిరాజు మనుమడును భీమరాజు సుతుడునునగువానిని మనుమ చాగిరాజని, చాగి ముమ్మగాటని చేతుక కృకకూతింపబడుచుండుటచే సహాయముగ నట్లూహింపబడినది. ఈతని పాలనాకాలముకూడ ఇతర సమాచారములతో గ్రంథస్థవక్కాణములతో సంవదించుచున్నది. సాగి ప్రభు వంశావళిలో మాచరాజు సంతతి వారిలో రామరాజునుండి "వత్సవాయి" శాఖ ఉద్భవించి, విడిపోయిన తర్వాత దోరపరాజు మొదలగువారు పుట్టిరని చెప్పబడినది. ఆ కోవలో "ఋద్ధారాజ"ను రాజు బయలుదేరి. వారి సంతతి వారికి "బుద్ధిరాజ"నుగృహనామము సంతరించిపెట్టెను,

సాగివంశప్రభు వంశావళిలో 46మంది ప్రభువుల వివరము లుగ్గడింపబడినవి. వారి సంతతి చెయ్యేరు, కాద్రేనికోన, పిల్లంక, గోగనమఠము, చింతలపల్లి, కోటవుర్రు, తంగేడు మొదలగు గ్రామములపై నాధిపత్యము వహించి ప్రజాదరణ పొంది ప్రభుకోటిలో జేరిరి.

ఇంతకంటె సాగివారి ప్రభు విస్తారమును గురించి తెలియదు. పూర్వ ప్రభువుల యనంతరము పాలనాధికారము చేపట్టినవారి వివరములు, చరిత్ర ఆర్వాచీన గ్రంథములలో నిక్షిప్తమైయుండవచ్చును. ఈరాజవంశములో కలిదండి, పెన్మత్స, నల్లపరాజు, చింతలపాటి,పొత్తపాటి కనుమూరి,గాధిరాజు,భూపతి,రాజు,రుద్రరాజు,జంపన మొదలగు యింటి పేరులతో వివిధ వంశములు బయలుదేరి పాలనతో పాటు పంచుకొనిరి. వారి సమగ్ర చరిత్ర సేకరించుయత్నమూమధ్య జరిగినదిగాని యది యెంతవరకు సాగినదో తెలియరాకుండ పోయినది. పురాతన రాజవంశ ప్రశస్తిగన్న చాగి (సాగి) పూసపాటివారి చరిత్రములు కొంతవరకు అందుబాటులోనికి వచ్చినవి

చరిత్ర విద్యాధర **తురగా కృష్ణమూర్తి**

# మాస్తి దృష్టిలో రవీంద్రుడు

( యింటర్వ్యూ )

అవి నేను యం.ఫిల్ కోసం రవీంద్రనాథ ఠాగూరు కథల పైన పరిశోధనను ప్రారంభించిన రోజులు. ఉపయుక్త గ్రంథాల కోసం విశ్వ విద్యాలయ గ్రంథాలయంలోని కేటలాగ్‌ను గాలిస్తుండగా మాస్తి వేంకటేశ అయ్యంగారి పేరు కనిపించింది. ఆయన ఆంగ్ల భాషలో 'రవీంద్రనాథ ఠాగూర్' అన్న గ్రంథాన్ని రచించారు.

పరిశోధనా పర్యవేక్షకులయిన ఆచార్య గుత్తికొండ నాగేశ్వర రావుగారు "ఠాగూరు మహోన్నత వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవడానికి మాస్తి వేంకటేశ అయ్యంగారి పుస్తకం చాలా ఉపకరిస్తుంది. ఆయన బెంగుళూరులోనే వుంటారు. మనముకిసార ఆయనను తప్పకుండా కలవాలి" అంటూ సలహా యిచ్చారు. మరో నెలరోజుల తరువాత, మేమిద్దరమూ వేంకటేశ అయ్యంగారిని కలుసుకోగలిగాము.

బెంగుళూరులోని 'గవిపుర'లో ఆయన నివాసం. అది నవంబర్ నెల 7 వ తేదీ, 1982 వ సంవత్సరం. సాదరంగా ఆహ్వానించారు ఆయన.

పాతకాలపు పెద్ద పట్టెమంచం. వెనుకన పెద్ద ముత్తయిదువ ఫోటో. మంచం పక్కన పేము కుర్చీలు. నిశ్చలంగా వెలుగుతున్న దీపకళికలా, సన్నగా, హుందాగా కనిపించారు ఆయన.

వెనుకనే రవీంద్రుడు స్వహస్తాలతో రాసిన ఇంగ్లీషు ఉత్తరం ప్రేము కట్టించబడి వేలాడుతోంది: (దాని తెలుగు అనువాదం ఇస్తున్నాను.)

> మీరు అపరిచితులైన నా మిత్రులను నన్నెరుగ పరిచారు
> పరుల మందిరాల్లో నాకు స్థానం కల్పించారు.
> దూర ప్రాంత వాసులను చేరువకు తీసుకొచ్చారు
> ఆగంతకులను సహోదరులను గావించారు

పరిచయాలు ముగిశాక, ఆయన తన 'రవీంద్రనాథ ఠాగూరు' రచనోదంతాన్ని వివరించారు.

మైసూరు విశ్వవిద్యాలయంవారి పబ్లికేషన్ కమిటీ కోరిక మేరకు, మొదట రవీంద్రుడి రచనలపైన ఒక చిన్న వ్యాసాన్ని రచించానని, ఆ పరిశీలన విద్యార్థులందరికీ అందుబాటులో వుండడం కోసం యింగ్లీషులోకి తర్జుమా చేయడం జరిగిందని ఆయన వివరించారు. ఆ తర్జుమా జరుగుతున్న కాలంలో సైతం రవీంద్రుడి రచనలు పుంఖాను పుంఖాలుగా వెలువడుతుండడంతో ప్రచురణను కొంతకాలం ఆపివుంచారట! ఆంగ్లభాషలోని తర్జుమా కాని రవీంద్రుడి రచనలు గురించి తెలుసుకోవడం కోసం స్వామి చిన్మయానంద సహాయాన్ని అర్థించారట! అప్పటికప్పుడు వెలువడుతున్న సాహిత్యాన్ని పరిశీలించడం కోసం నారాయణస్వామి అయ్యర్ సహాయం పొందారట! రవీంద్రుడి సాహితీ వ్యక్తిత్వానికి అద్దం పట్టడానికి యెంతటి శ్రమ పడవలసి వచ్చిందో అయ్యంగారు తెలియజేశారు.

అరగంటసేపు యింగ్లీషులో సాగిన ప్రశ్నోత్తరాల కార్యక్రమంలోని కొన్ని ముఖ్యమైన ప్రశ్నోత్తరాల్ని మాత్రం ప్రస్తావిస్తాను.

ప్రశ్న: ఆధునిక భారత సాంస్కృతిక పునరుజ్జీవనం యొక్క ప్రభావం మీకెలా తోచింది?

జవాబు: అది ఒక కాంతిపుంజం. అప్పుడే కొత్తగా కన్నులు విప్పినట్టుగా తోచింది.

ప్రశ్న: రవీంద్రుడిని యెడ్గార్ యెలెన్ పో, టాల్‌స్టాయ్, మపాసా లాంటి అత్యుత్తమ కథకుల స్థాయిలో చేర్చగలమా?

జవాబు: సందేహం యెందుకు?

ప్రశ్న: రవీంద్రుడిలోని కవి, అతడిలోని కథకుడికి అడ్డంకిగా తయారయ్యాడా? లేక మరింతగా పురోగమనానికి తోడ్పడ్డాడా?

జవాబు: రవీంద్రుడెంతటి గొప్ప కవో, అంతటి గొప్ప కథకుడు. అంతటి గొప్ప కవి మాత్రమే అటువంటి గొప్ప కథల్ని సృజించగలడు.

ప్రశ్న: రవీంద్రుడు భారతీయ సంప్రదాయ ధోరణిలోనే కథలను రచించాడు అంటే యేవాల్మీకో, కాళిదాసో కథలను రాసినట్టుగా మనం వూహించగలిగితే, అవి రవీంద్రుడి కథలలాగా వుండి వుంటాయేమో ననిపిస్తుంది. మీరేమంటారు?

జవాబు: లాగా యేమిటి? అలాగే వుంటాయి. నిజానికి వీరందరి వెనకా దాగివున్న ఆత్మ వొకటే గదా!

ప్రశ్న: రవీంద్రుడి కథలపైన టాల్‌స్టాయ్ రచనల ప్రభావం వుందా?

జవాబు: టాల్‌స్టాయ్ కథలు ఒక సూక్తి చుట్టూగానీ, ఒక అయిడియా చుట్టూగానీ అల్లిన కథలు. రవీంద్రుడి కథలు అటువంటివి గావు.

ప్రశ్న: రవీంద్రుడి కథలకు ప్లాట్ వుండదని ఒక వాదముంది. మీరు యేకీభవిస్తారా?

జవాబు: అలా యెవరైనా అంటే నేను జీవితానికి సైతం ప్లాట్ వుండదని సమాధానం చెబుతాను.

ప్రశ్న: రవీంద్రుడిపైన కారల్ మార్క్స్ ప్రభావం వుందా?

జవాబు: యెందుకు లేదు? రవీంద్రుడు గొప్ప మానవతావాది. రష్యాకు వెళ్ళొచ్చిన తరువాత, సామాన్య ప్రజానీకానికై ఆ దేశం చేస్తున్న కృషిని వేనోళ్ళా పొగిడాడు ఆయన.

ప్రశ్న: రవీంద్రుడి కథల్ని లిరికల్ కథలుగా పేర్కొనవచ్చు. మీరేమంటారు?

జవాబు: నిజానికి ప్రపంచ సాహిత్యంలోని గొప్ప సాహిత్యమంతా లిరికల్‌గానే వుంటుంది. పురాణాలన్నీ మొదట పాడేందుకు వీలు కలిగేలా రచించబడ్డాయి. రవీంద్రుడి కథల్లో సైతం ఆయన కవితాత్మ తొంగిచూస్తూనే వుంటుంది.

ప్రశ్న: రవీంద్రుడి కథలలో దుర్మార్గులు చాలా అరుదుగా కనిపిస్తారు అంటే నిజ జీవితంలో అటువంటి వ్యక్తులు వుండరని ఆయన అభిప్రాయమా?

జవాబు: రవీంద్రుడు జీవితంలోని ఆర్ద్రతనూ, ప్రేమానురాగాలనూ స్పర్శించదలచుకున్నంతగా, మరో విషయాన్ని పట్టించుకోలేదు. జీవితపు చెడు దృక్కోణాన్ని పట్టించుకోపడం నాకు సైతం యిష్టం వుండదు.

ప్రశ్న: రవీంద్రుడి శిథిల కుటీరం నవలికలో వదినా, మరుదులమధ్య అపురూపమైన అనుబంధాన్ని చిత్రించాడు. ఆయన జీవిత చరిత్రను పరిశీలిస్తే, ఆయన సొంత అనుభవమేమయినా యీ నవలికను రాయమనికి స్ఫూర్తిని కలిగించాయేమో ననిపిస్తుంది. మీ అభిప్రాయ మేమిటి ?

జవాబు: విమర్శకులకూ, పాఠకులకూ యిటువంటి పనికిమాలిన కుతూహలా లెందుకు కలుగుతాయో నాకర్థంగాదు. ఆ రచనద్వారా రచయిత చెప్పదలచుకున్న విషయమేమిటో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. రచన ముఖ్యంగానీ రచయితగాదు.

ప్రశ్న: రవీంద్రుడి కథానికల గొప్పదనానికి కారణం వొకమాటలో చెప్పాలంటే యేమిటంటారు ?

జవాబు: 'స్పిరిట్'.

"పాశ్చాత్య ప్రభావం నుంచీ భారతదేశం తప్పించుకోజాలదు. కానీ యథాతథంగా అనుకరించినప్పుడు పునరుజ్జీవనం సాధ్యపడదు. ప్రపంచ ఆలోచనావిధానాల్ని జీర్ణించుకున్న తరువాతమాత్రమే ప్రపంచానికి తన భావవీచికల్ని అందివ్వడం సాధ్యమవుతుంది. తన భూభాగంలో ప్రవేశ్లానుకుని, బాహువుల్ని యితర ప్రాంతాలకు వ్యాపింప జేసినప్పుడు భారతీయులీ పనిని నిర్వహించగలరు. రవీంద్రుడీ విషయాన్ని గుర్తించ గలిగాడు. ఆయన తన మాతృభూమి ప్రాచీన ఆలోచనా విధానాలనుంచీ స్ఫూర్తిని పొందాడు. ఆధునిక ప్రపంచానికి అత్యంతాధునికమైన వ్యక్తిగా తన ఆలోచనల్ని అందించాడు తన మాతృభాషను సేవించడం ద్వారా రవీంద్రుడు తన దేశభక్తిని నిరూపించుకున్నాడు. తన దేశ సంస్కృతిలోనూ, సంప్రదాయంలోనూ ప్రగాఢమైన నమ్మకాన్ని వుంచుకున్నపుడే, తాను ప్రపంచ మానవులందరికీ సన్నిహితుడు గాగలడని ఆయన తెలుసుకున్నాడు"- అంటూ రవీంద్రుడి వ్యక్తిత్వాన్ని నిర్వచించిన మాస్తి వేంకటేశ అయ్యంగారు, రవీంద్రుడి తరువాత ఆయన, బాధ్యతను స్వీకరించిన వ్యక్తిగా పొడగడతారు.

శ్రీ నరేంద్ర

# మ ధు క శ

కాటూరి వేంకటేశ్వరరావుగారినీ, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారినీ, విశ్వనాథ సత్యనారాయణగారిని - నేను చూడలేదు.

కానీ ఒక 'పిట్టంత' మనిషిని చూశాను - ఆ మనిషిలో 'చెట్టంత' వ్యక్తిని దర్శించాను ! చాలామంది దృష్టితో ఒక 'అహం కారి'ని చూశాను. ఆ అహంకారిలో తన 'సత్తా' తనకు తెలిసిన 'ఆత్మజ్ఞాన స్రోతస్సు'ను కనుగొన్నాను! ఆయన వామనునివలె వుంటారు-తెలిమంచు గుట్టల తుదిమెట్టుమీద తనను తాను "కొలుచు" కునే సామి "జడలల్లిన జీబుల" వెలుగులీనే "అమృతము కూడుగట్టిన దొర"ను అందికొని అందరినీ పంచికొనుమని అందించే భావుక శ్రేష్ఠ డని ఆ వామనునిలో చూశాను ! అయన 'విరసుడు' అంటుంది లోకం - కాదు - 'రస సిద్ధుడు' అంటాను నేను !

ఆయన పేరుచెప్పి ఎంత భయ పెట్టిందీ లోకం నన్ను? అని ఆశ్చర్యపోతూవుంటాను! ఇంటిలో మాహేశ్వర లింగాన్ని వుంచు కొని గులకరాళ్ళ గుట్టల్లో వెతుక్కునే లోకం మీద జాలిపడుతూ వుంటాను—

"పూర్వప్రధాజీవరవేతమై శక్తినాడులయందు చచ్చిపోయిన" జాతికి గాఢ చింతనాశీలం ఎక్కడిది? "పైమెఱుంగులు చూసి భ్రమసి పోయే" జాతికి "అంతస్స్రోతస్విని" అయిన "సరస్వతి" ఎలా ప్రసన్నం అవుతుంది? అందుకే విశ్వనాథ అంటారు—

"చిలికి మెఱుంగు సన్న సగిషీపని బంగరు సేతమెచ్చలే
రకలుషమౌవనాంతర మహోఝరిణీ పరివేగ మోర్వలే
రకృత పరిశ్రముల్ శ్రమగతాలస బుద్ధులు......"

ఇదిగో - ఈ అకృత పరిశ్రములకూ, శ్రమగతాలస బుద్ధులకూ ఆయనమాట 'కశాఘాతం', కానీ తెలిసినవారికి అది "మధుకశ"! ఎఱిగి దరిచేరిన వారికి ఆయన సరస్వతి 'సుభద్ర'!

ఆయన అనుభవలక్షం విలక్షణమైనది - రససిద్ధుడైన ఆయన నోట వెలువడే మాట పెదవులనుండి జారిపోయేది కాదు - ఎదలో "రక్తమై" పెల్లుబికి వచ్చేది.

"బాలరామాయణం"లో ఒక శ్లోకం ఆయనకు యిష్టమైనది- ఇదీ ఆ శ్లోకం—

"సద్యః పురీసరేఽపి శిరీషమృద్వీ
సీతాజవాత్ త్రిచతురాణి పదాని గత్వా
గంతవ్యమద్యకియదిత్య సదృక్ బ్రువాణా
రామాశ్రుణః కృతవతీ ప్రథమావతారమ్"

ఈ శ్లోకానికి అర్థం ఆయన ఎప్పుడూ పూర్తిగా చెప్పలేక పోయారు - అరణ్యవాసానికి వద్దంటే బయలుదేరినది సీత. తనపట్టు పలుకు నిరూపించుకోవటానికా అన్నట్లు ఆమె గబగబా మూడు నాలు గడుగులు వేసింది గంగను దాటిన తరువాత - ఆ మూడు నాలుగు అడుగులూ వేసి వెనుతిరిగి "ఇంకా ఎంతదూరం వెళ్లాలి మనం?" అని ప్రశ్నించిందట! ఈ ప్రశ్న ఆయననోట ఎన్నడూ పూర్తిగా పలుకనే లేకపోయారు - "గళస్థ గాద్గదికము, లోచనాంత బహుధా స్రుత బాష్పనదమ్ము" ఆయనను ఆపనికి "చాలక చేసెడు"! ఆ [illegible] కాబోలు! ఇదీ ఆయన అనుభవగాఢత్వం!

ఒక్కొక్క కవికి ఒక్కొక్క ముద్రవుంటుంది-ఒక్కొక్క శబ్దచిత్రం చెక్కుతాడు - ఒక్కొక్క వాక్ఛిల్పం మనముందుంచు తాడు - అందుకే ఆయన ఒక్కొక్క కవికీ ఒక్కొక్క ప్రతీకను చెబుతారు - "వాల్మీకి సన్నజాజి పువ్వువంటివాడు, భాసుడు మొల్ల పువ్వులాటివాడు, కాళిదాసు మల్లెపూవు అయితే భవభూతి మొగలి పువ్వు వంటివాడు" అంటారాయన ! పువ్వులను మూరలతో కొలిచి బేరమాడే వారికి యీ అనుభవం ఎలా వస్తుంది! అందుకే అంటాడు క్షేమేంద్ర "కొత్తతరం కొడుకులకు కోకిలేం తెలుసు?" అని.

అసలు వసంతం వచ్చిందని కవికి ఎలా తెలిసిందో విశ్వనాథ యిలా చెప్పారు—

"పరిచయానుద్రిక్త పరిరంభ సమయాన
ప్రియురాలి యెదచెమరించినంత"

వసంతం వచ్చిందని తెలిసిందట! ఆ పరిరంభము పరిచయము చేత అనుద్రిక్తము - అయిననూ "ప్రియురాలి యెద చెమరించి"నది- ఆ "చెమరింత"ను భావుకుడైనవాడే కనిపెట్టగలడు.

మరచిపోకండి - కావ్యం "కాంతా" సమ్మితం! నన్నయ వ్రాసిన నాటినుండీ యింతవరకూ ఎందరో ఆంధ్ర భారతాన్ని చదివారు! అసలు వాల్మీకి రామాయణాన్నీ చదివారు - చదివినవారే మళ్ళీ మళ్ళీ చదివారు - కానీ చదివిన పుస్తకమే - అయినా చేపట్టిన ప్రతిసారీ "ఎద చెమరించే" వ్యక్తి ఆయన! ఆ చెమర్పులేని వారికి శ్రీ శంకరులు అన్నట్లు—

"వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్ర వ్యాఖ్యాన కౌశలమ్
వైదుష్యం విదుషాం తద్వద్భుక్తయేనతు ముక్తయే"

"శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణ కారణమ్" అవుతుంది- అంతే!

"కేవలం వస్తువును గురించి కానీ, క్రియను గురించికానీ తెలియజేసినంత మాత్రమున ఒక వాక్యము ప్రమాణముకాదు - మరి

ఏది ప్రమాణము? నిశ్చయముగా ఫలమును కలుగజేయు విజ్ఞానమును అందించునదియే ప్రమాణము ఆ విజ్ఞానమును కలిగింపనిది అప్రమాణము. అనుభవాదులు యిచట యధాసంభవముగా ప్రమాణము" అంటారు శ్రీ శంకరులు - చూడండి—

"నవార్థస్య వస్త్వన్వాఖ్యానమ్ క్రియాన్వాఖ్యానమ్ వా ప్రమాణమ్। కింతర్హి నిశ్చిత ఫలవత్ విజ్ఞానోత్పాదకత్వమ్ । తద్యత్రాసి తత్ ప్రమాణమ్ । యత్ర నాస్తి తదప్రమాణమ్। అనుభవాదయశ్చయథా సంభవమ్ ఇహ ప్రమాణమ్॥"

ఒక విషయమును విచారించి నిర్ణయించ వలెనన్న అనుభవమే ప్రమాణమని తెలుచున్నది. పురా నిర్ణీతములైన అభిప్రాయములను ప్రక్కకు పెట్టి మాత్సర్య రహితబుద్ధితో అధ్యయనం చేయాలి-వేదార్థమైననూ - కావ్యార్థమైననూ అదేమార్గం - అందుకే ఆయన అంటారు "భగవంతునిసద్దకు వెళ్లేటప్పుడు పాదరక్షలు బయటవదలి వినమ్రులమై ఎలా వెడతామో కావ్యం దగ్గరరూ, కవిదగ్గరరూ అలాగే వెళ్ళాలి" అని! "కవి"యైన వానిపట్ల ఆయన అంత వినమ్రుడు. శ్రీ శంకరులు చెప్పినట్లు "అనుభవపూర్ణుడు" ఆయన!

అయితే యీ అనుభవపూర్ణుని వాక్యం ప్రమాణమా? కాదా? దీనికి "నిశ్చిత ఫలవద్విజ్ఞానోత్పాదకత్వమ్" వుందా? లేదా? అన్నది ప్రశ్న! దీనికి నా అనుభవాన్నే నిర్లజ్జగా ఉదహరిస్తాను—

కొన్నేళ్ళ క్రితం శ్రీనాథుడి సీసపద్యాల వూయెలలో వూగులాడుతూ మురిసిపోయి నన్నయగారి పద్యాలు నచ్చక "శ్రీమదాంధ్ర మహాభారతము" (సాహిత్య అకాడెమీ ప్రతి) పాత పత్రికలతో కలిపి అమ్మేశాను. తరువాత కొన్ని సంవత్సరాలకు నాకు ఆయన పరిచయం కలిగింది. ఒకసారి రాజమహేంద్రవరంలోని గౌతమీ విద్యాపీఠంలో ఆయన పోతనగురించి ప్రసంగించవలసి వుంది. 'సమాచారం' దిన పత్రిక సంపాదకులు కీ॥ శే॥ గంధం సీతారామాంజనేయులు ఆ సమావేశానికి అధ్యక్షులు. శ్రీ సీతారామాంజనేయులు సభా ప్రారంభంలో ఆ సంవత్సరాన్ని ప్రభుత్వం నన్నయ సంవత్సరంగా ప్రకటించిందని అన్నారు. దానితో పోతనగురించి ప్రసంగించవలసిన వక్త నన్నయగురించి ప్రారంభించారు. ఆ ప్రసంగంలో ఆయన నన్నయగారి వసంతవర్ణనం పద్యాలు రెండూ చదివారు. మొదటి పద్యం "కమ్మని లతాంతమ్ములకున్" అనేది పూర్తయేసరికి నాకు విశ్వనాథవారి 'మ్రోయుతుమ్మెద' నవలలోని మొదటి నాలుగుపుటలూ అనుభవంలోకి వచ్చాయి. ఆయనను ప్రసంగానంతరం యింటిదగ్గర వదలి నన్నయ భారతం కోసం – అది పుట్టిన రాజమహేంద్రవరంలో- పిచ్చిపట్టినవానివలె తిరిగాను - ఆంధ్రుల 'అదృష్ట' విశేషం! అది ఆ పట్టణంలో ఎక్కడాలేదు - నన్నయను అమ్మటం ఏమిటనుకున్నారో ఏమో? తరువాత నాలుగురోజులు దానికోసం వూరంతా గాలించాను - దొరకలేదు - చివరకు కొవ్వూరు సంస్కృతకళాశాల అధ్యాపకులు శ్రీమాన్ సముద్రాల రంగ రామానుజాచార్యుల వారిదగ్గర ఆ పుస్తకాన్ని తెచ్చుకున్నాను - నా మిత్రుడూ ప్రాణ ప్రాణమూనైన శ్రీ చింతకూరి వేంకట రామశాస్త్రికీ, నకూ యిప్పుడు నన్నయ కంఠాభరణం! హృదయస్థుడూను! ఇదీ నిశ్చితఫలం! తెలుగు నుడికారపు సొంపు నా ఎదలో నిలిపింది నన్నయ, ఇదీ విజ్ఞానం!

కేవలం ఒక్క ప్రసంగంతో శ్రోతలో జాగృతిని కలిగించే ఆయన వాక్కు "మంత్రమయం", "మననాత్ త్రాయతే ఇతి మంత్రమ్" అనికదా! అంతేకాదు - ఆయన వాక్కు "మధుకశ"!

"ఆదిత్యుని అగ్నిగర్భుడని వాల్మీకి పేర్కొన్నాడు. అగ్ని అంటే అదితి అన్నమాట. అదితి సర్వజీవశక్తులకూ ఆద్యాశక్తి, మహా సరస్వతి, ఆమెనుండి వెలువడే వాక్కులు దేవతలు. అందుకే శ్రుతి 'మాతా దిత్యానాం దుహితా వసూనాం ప్రాణః ప్రజానాం అమృతస్య నాభిః హిరణ్యవర్ణా మధుకశా ఘృతాచీ మహాన్ భర్గః చరతి మర్త్యేషు' (అథర్వ 9-1--1-4) అంటున్నది. మనుష్యులలో చరించే వాఙ్మహత్తను యింతగా పేర్కొన్నారు. దేవత లందరూ యీమె బిడ్డలు. రసమహిత వాక్కులు యిక్కడే ఉదయిస్తవి. ఈమె పసువుల బిడ్డ. పసువులు ప్రాణశక్తులు. ప్రాణమయ మనోమయ చేతనలే యీమె ఉత్పత్తి స్థానములు. లోకానికి యీమె ప్రాణము. మహాసృష్టి చక్రములో యీమె నాభి, నడిమి అగ్ని. అందువలన హిరణ్యవర్ణ. హిరణ్మయమైన పాత్రేన సత్యస్యాపిహితం ముఖం-ఉన్న విజ్ఞానమునకు ఆచ్ఛాదనగా నున్నది. ఈ వాక్కు మధుకశ. మధుత్వ లక్షణము, కశలక్షణమూ రెండూ కలది. హితమై కశాగ్రమువలె ఒక చురకవేసి లోలోతులలోని కల్మషాన్ని తొలగిస్తుంది అంటారు. "అగ్నిగర్భ" కవితా సంకలనం (జాతీయ సాహిత్య పరిషత్ ప్రచురణ)లో సంపాదకుడు డాక్టర్ కోవెల సుప్రసన్నాచార్య.

సరిగా అలాటి "మధుకశ" ఆయన వాక్కు. చురక తగిలినా శ్రోతమంచికే! తీర్చిదిద్దటానికి ఒక్కోసారి ఒక్కోపాఠం అవసరం. అందుకే ఆయన అంటారు—

"నను దీర్పన్ నసి నీదు చేతికశయైనన్ వేణువైనన్ విలో
చనమైనన్ స్మితమైన గీతమైనన్ సయ్యాటమైనన్ జిరం
తన బోధామృతమైన స్పర్శమయినన్; దత్తద్దశాయోగ్య మెం
చిన నీవైయెడబాటు నోపను జుమీ! శ్రీవేణుగోపాలకా!"

ఇలాగే తత్తద్దశాయోగ్యముగా ననుతీర్చిన "శిష్య వాత్సల్యంబు చెలువు తీర్చినమూర్తి" ఆయన - ఇంతకీ ఆయనపేరు చెప్పనేలేదు కదా! ఆయన కాటూరి, దేవులపల్లి, విశ్వనాథలకు మానసపుత్రుడు- నాకు గురుదేవులు- శ్రీ మల్లంపల్లి శరభయ్య-ఆయనకు పైన చెప్పిన ఆయన మాటల్లోనే నానమస్కారం.

శ్రీ వల్లభాచార్య

# గ్రంథ విమర్శలు

## లెనిన్ సాహిత్య వివేచన

[డాక్టర్ పరుచూరి రాజారామ్, వెల : రు. 12/-లు, ప్రతులకు : పెనుగొండ లక్ష్మీనారాయణ, 5-89-20: కేరాఫ్, కవితా క్లినిక్, 3 వ లైన్, లక్ష్మీపురం, గుంటూరు-522 007.]

గుంటూరు జిల్లా అభ్యుదయ రచయితల సంఘం శాఖవారు ప్రచురించిన సాహిత్య విశ్లేషణ గ్రంథం ఇది. పరుచూరు రాజారామ్ గారు నవలా రచయితగా, కాని కథారచయితగా ప్రసిద్ధులు. వృత్తిరీత్యా డాక్టరయినప్పటికీ రచనా ప్రవృత్తిగా జీవిస్తున్న మనిషి శ్రీ రాజారామ్. మనుషుల నాడినే గాక సాహిత్యపు నాడిని, మనుషుల ఆరోగ్యాన్నే గాక, సాహిత్యపు ఆరోగ్యాన్ని కూడా పరిశీలించే ప్రతిభాంశగల డాక్టరు శ్రీ పరుచూరి రాజారామ్.

ఆంధ్రదేశంలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడటంతో సాహిత్య రచన స్వరూపాన్ని, స్వభావాన్ని గురించిన శాస్త్రీయమైన చర్చకు పునాది పడింది. తారీకులు, దస్తావేజులు పరిశీలించే గ్రంథాన్వేషకులు కొంత మందుంటారు. వారి కోసం ఇంకోమాట అదనంగా రాయాలి అందేమంటే - అ. ర. సం ఒక సంస్థగా రూపొందాల్సక ముందే అభ్యుదయ లక్ష్యంతో రచనలు రాయటం జరిగింది. కొత్త సాహిత్యం రూపు దిద్దుకునేటప్పుడు దాని కనుగుణమైన విమర్శక సిద్ధాంతాలు కూడా రూపు దిద్దుకుంటై. పరిణామ వ్యతిరేకులు మాత్రం భారతీయ అలంకారిక శాస్త్రాలను మించిన సాహిత్య శాస్త్రాలు ఇంత వరకూ పుట్టలేదు. సాహిత్య విషయంలో వాటిదే తుదిమాట అని అప్పుడప్పుడు తీర్పు ఇస్తూ ఉంటారు. సాహిత్యం, దాని అభివృద్ధి ఈ తీర్పులను అధిగమించి ముందుకు పోతూనే ఉంటై.

ఈనాడు సమాజం లాగే సాహిత్యం కూడా సంకీర్ణమై బహుముఖాలుగా విస్తరిస్తున్నది. ఇందులో మంచి చెడులను విశ్లేషించడానికి ఎవరికి తగ్గ కొలబద్దలు వారికున్నై. మార్క్సిస్టు విమర్శ ఈనాటి సాహిత్య విమర్శలో అగ్రగామియై నిలబడింది. అయితే దీంట్లోకూడా కొన్ని అపశృతులు ఉన్నై. వస్తు విశ్లేషణే పరమార్థంగా, సంవిధానం అప్రధానంగా కొంత మంది విమర్శకులు భావిస్తున్నారు. దానివల్ల సాహిత్య ప్రయోజనం, ప్రభావం బాగా దెబ్బతింటున్నై. మార్క్సిస్టు విమర్శ పుట్టిన దేశాల్లోనే అక్కడ విమర్శకులు సంవిధానాన్ని వెనక్కు నెట్టి వెయ్యలేదు. ఇక్కడ మన విమర్శకులకే ఆనవసరమైన పూనకం వస్తున్నది. గతాన్ని ధ్వంసం చెయ్యటమే లక్ష్యంగా పెట్టుకున్న వాళ్ళకి లెనిన్‌మాటలు రుచించకపోవచ్చు. "కెనాట్ టర్న్ ఎవే ఫ్రమ్ ది రియల్లీ బ్యూటీఫుల్ జస్ట్ బికాజ్ ఇటీజ్ వోల్డు, బట్ మేక్ ఇట్ ఎ స్టార్టింగ్ పాయింట్ ఫర్ ఫర్దర్ డెవలప్‌మెంట్" ఈ మాటల్లోని అంతరార్థం ఎంతో సంస్కారం ఉంటేనేగాని అర్థం చేసుకోలేం.

రచయిత స్వేచ్ఛను గురించి ఈనాడు అనేక చర్చలు సాగుతున్నై. ఈ అంశంపై రాజారామ్ గారు లెనిన్ భావాలకు మంచి వ్యాఖ్యానాలు చేశారు. రచయిత కుండే స్వేచ్ఛ రచయితల సంఘాలకు, సమాజానికి కూడా ఉంటుంది. రచయిత కుండవలసిన స్వేచ్ఛ వైయక్తికమైన అరాచకం గాదు. గోర్కీ చట్రాలలో బంధింపబడి రచనలు చేసినవాడు కాదు. కాని గోర్కీ సామాజిక చారిత్రక పరిణామక్రమంలో మహారచయితగా తన బాధ్యతను నిర్వర్తించాడు అని మనం మరిచిపోగూడదు. "వ్యక్తి స్వేచ్ఛ అని అరచే మిత్రులు గుర్తుంచుకోవలసిన మరొక ముఖ్యాంశ మున్నది. సమాజంలో భాగంగా ఉన్న రచయిత, సమాజం నుండి విడివడ్డానని భ్రమలోపడి అది స్వేచ్ఛ అనుకోవటం తప్పు. ఎన్నడూ ఎవరూ సమాజం నుండి విడిపడలేదు. సమాజంలో అత్యధికులు దరిద్రంతో బాధపడుతుంటే ఎవరో ఒకరు సుఖంగా స్వేచ్ఛగా వుండటమనేది కల్ల. ఏ కొద్దిమంది ధనికులో స్వేచ్ఛగా వున్నారనుకున్నా అది తాత్కాలికమే." అంటున్నారు రాజారామ్ గారు.

ఈ గ్రంథంలో రాజారామ్‌గారు మార్క్సిస్టువిమర్శకు ముందుగా, లెనిన్ దృష్టిలో సాహిత్య విశ్లేషణకు ముందుగా సాహిత్యంలో వచ్చిన కొన్ని కొత్త ఉద్యమాలు, వాటి జీవలక్షణాలను విశదీకరించారు. డాడాయిజం, సర్రియలిజం మొదలైన ఉద్యమాల మూలతత్త్వాలను బాగా వివరించారు. అయితే పరుచూరి రాజారాం గారు పేరెత్తకుండా వి. ర. సం దృక్పథాన్ని అక్కడక్కడా నెగిటివ్‌గా విశ్లేషించటం జరిగింది. రచయితల సంఘాలకు స్వేచ్ఛ ఉండాలని భావించిన రచయిత అ. ర. సానికున్న స్వేచ్ఛ వి. ర. సానికి ఎందుకుండ గూడదో తెలియక అట్లా రాయలేదు. రాజకీయ దృక్పథంలో ఉన్న భేదమే అట్లా రాయటానికి కారణం. మొత్తంగా చూస్తే - సాహిత్యంలోకి ఇప్పుడిప్పుడే అడుగు పెడుతున్నవాళ్ళు, ఇంతకుముందే సాహిత్యంలోకి ప్రవేశించిన వాళ్లు మార్క్స్, లెనిన్‌లను వాళ్ళ దృష్టిలోంచే వాళ్ళకు వ్యతిరేకంగా చిత్రించేవాళ్లు తప్పనిసరిగా చదవవలసిన గ్రంథం ఇది.

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్టమైన ఆముదము




శుద్ధి
చేసినది,
వాసన
లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited** 

## రేపటి సూర్యుళ్ళు (యువ కవిత)

[సంపాదకుడు : పాయసం సుబ్రహ్మణ్యం, వెల: రు. 7/-లు ప్రతులకు : జిల్లా యువ రచయితల సంఘం (రిజి); కాసాతోట, శ్రీకాళహస్తి.]

శ్రీ పాయసం సుబ్రహ్మణ్యం సంపాదకుడుగా, సర్వశ్రీ ఎస్. మునిసుందరం, బి. భాస్కర చౌదరి, యం. ఆర్. చంద్ర, కె. బాలకృష్ణారెడ్డి సహాయ సంపాదకులుగా వెలువడిన చిత్తూరు జిల్లా యువ రచయితల కవితా సంకలనం ఇది. కలంపట్టిన ప్రతికవి సమాజాన్ని గురించి రాస్తున్న కాలమిది. ఇది అసహజమూ అంటేకాదు ఇది ఈ యుగధర్మం అని అనుకోవాలి. ఈ కవితా సంకలనం అచ్చువెయ్యటంలో సంపాదకులు ఎంతో ఓర్పు, నేర్పు చూపించారు అని భావించాలి. ఎందుకంటే - దీంట్లో కవితలు చాలా భాగం కవితాస్పృహ ఉన్న మంచి కవితలు.

సుఖాల మధ్య
బాధల చిచ్చర్ల రాలిపడిన దుఃఖాలని,
నీతి విహీనపు బ్రతుకుల్లో
పెరుగుతున్న దారిద్ర్యాలని
త్యాగాల ఉచ్చులో దగాపడ్డ
యౌవనాలని
కులాల శృంఖలాలకు చిక్కి
మాసికంపు కొడుతున్న జీవితాల్ని
ఇట్లా ఎన్నెన్నో
నడుస్తున్న శవాలను చూస్తున్నా.........

అంటున్న ప్రమీలాదేవిగారి కవితలో అన్వయం అసాధ్యమయినా ఒక ఊహ ఉంది. ఆవిడ చూడవలసిన నడపీసుగలు ఇంకా చాలా ఉన్నై. సౌభాగ్య గారి వర్తమానం కవిత వివాదగ్రస్తమైన స్టేట్ మెంట్.

గతాన్ని గాఢంగా చింతించే వాడికి
భవిష్యత్తును బలంగా ఆవహించేవాడికి
బ్రహ్మరథం పడుతుంది లోకం!
వర్తమానం నుంచి వక్రమార్గానికి తిప్పడంలో
వాడూ వీడూ విక్రమార్కులే
సాహిత్యంలోనైనా
సామాజిక రంగంలోనైనా
నేల విడిచిన సాము
చీకట్లో కాలికి తగిలిన పాము.

గతం, భవిష్యత్తూ లేందే వర్తమానం మాత్రం ఎక్కడుంది. భవిష్యత్తుని గురించి గతంలో ఎంతమంది ఎన్ని ఊహించపోతే ఈనాటి వర్తమానం ఇట్లా ఉంది? వారిది పూర్తిగా నిరాశ.

ఇట్లా ఏదో రూపంలో ఈ కవితా సంకలనంలో కవితలన్నీ జీవితాన్ని గురించి పట్టించుకున్నవే. వీళ్ళంతా ఆగామి కవితారాజ్యానికి సూర్యుళ్ళు అవ్వాలని సంపాదకులతోపాటు నేనూ ఆశిస్తున్నాను.

## ఈ దేశం (కవితా సంకలనం)

[వాసాల నరసయ్య, వెల : రు. 8-00లు, ప్రతులకు : 1) వాసాల శౌరి, ఎమ్. ఎ. బి. ఒ. యల్; తెలుగుపండితుడు: ఇం. నెం. 2-1-50/ ఎఫ్; మెట్టుపల్లి- 505 325 కరీంనగర్‌జిల్లా) 2) ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్; రాష్ట్రపతి రోడ్; సికింద్రాబాద్-500003 3) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; చంద్రం బిల్డింగ్స్; విజయవాడ-520003.]

వాసాల నరసయ్యగారు ఒక దశాబ్దంపాటు రాస్తూవచ్చిన తన కవితలను ఈ పుస్తకరూపంలో అచ్చువేశానని చెప్పారు. ఎక్కువగా వీరు రాసినవి మినీ కవితలు. కవితల్లో స్పష్టత సరళత, చమత్కారం మంచి లక్షణాలుగా కనబడతై. దృష్టి సమాజసంక్షేమం. అసమాజం మీద వీరికి వలసినంత అసహ్యంఉంది.

ఈ దేశం ఒక దేహమైతే
కులతత్వం ఒక కుష్టువ్యాధి
మత మౌఢ్యం ఒక మహమ్మారి
అస్పృశ్యత ఒక అల్సర్‌జబ్బు
పక్షపాతం ఒక పక్షవాతం
ఏ ఒక్క జబ్బుకైనా
దేహారోగ్యం చెడుతుంది
ఇన్ని జబ్బులుంటే
ఇక నాదేశం ఏమౌతుంది?

అంటున్నారు వీరు

—టి. యల్. కాంతారావు.

Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247